# నిలా మి నులా

(ఆయుర్వేదము)

# కు దు రు

324/80

గ్రంథకర్త:

శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణ దాసుగారు




1961

# మనికి-మినుకు

## (ఆయుర్వేదము)

## కుదురు

గ్రంథకర్త:

శ్రీ మదజ్జాడ ఆదిభట్ట నారాయణ దాసుగారు

ఆదిభట్ట నారాయణదాస అముద్రిత గ్రంథ ప్రచురణ కమిటీవారిచే
ప్రచురింపబడినది

 1961 [వెల రు 3-00

# తొలి పలుకు

శ్రీమదజ్జాడాదిభట్ల నారాయణదాసుగారు, వేదములు, స్మృతులు అష్టా దశ పురాణములు పరిశీలించి, ఆయుర్వేదము గురించి వ్రాయబడినవిషయములు సేకరించి, అచ్చతెనుగులో'మన్కి-మిన్కు'యను పేరుతో రోగలక్షణములగురించి, రోగచికిత్సగురించి, మందులు తయారుచేయుటకు యుపయోగించు ఓషధులు గురించి యొక పెద్దగ్రంధము రచించినారు. అందులోనొక భాగమైన 'కుదురు' ప్రచురించగలిగితిమి. 'కుదురు' యను యీ గ్రంధములో, అధర్వసంహిత, తైత్తరీయారణ్యకము, ఋగ్వేదము, ఐతరేయ బ్రాహ్మణము, ఛాందోగ్యోపని షత్తు మొదలగు వాటిలో నాయర్వేదముగురించి చెప్పబడిన విషయములన్నియు వివరించబడినవి.

ఈగ్రంధము ప్రచురించుటకు రెండుకారణములున్నవి ఆయుర్వేదము గురించి పరిశీలన చేయువారికి యీ గ్రంధము చాలా యుపయోగించును. అచ్చ తెలుగు మాటలు వాటియర్ధము తెలుసుకొనువారికి యీ గ్రంధము చాలా సహకా రిగా నుండును. అచ్చతెలుగు మాటలు వాడుక చాలా తగ్గిపోవుచున్నది. నన్నయ, తిక్కన మొదలగువారి రచనలలో యెన్నియొ అచ్చతెలుగు మాటలు కాన్పించును. వారందరు, యెన్నియొ అచ్చతెలుగు పదములు ప్రయోగించినను, కేవలము అచ్చతెలుగులో యేగ్రంధము వ్రాసియుండలేదు. కాని నారాయణ దాసు గారు కేవలము అచ్చతెలుగులో చాలా రచనలు సాగించినారు. తెలుగు మాటలకు తెలుగులోనే అర్ధములు వ్రాయుచు 'సీమపల్కు-వహి' యను పేరుతో నొక నిఘంటువు కూర్చినారు. సీమపల్కు-వహి: మన్కి-మిన్కు, రామచంద్రశతక కము, కాశీశతకము, లలితాసహస్రనామము మొదలగు అముద్రిత గ్రంధముల ప్రచురించుటకు కేంద్ర ప్రభుత్వమువారు మూడువేలరూపాయలు విరాళముగా నొసంగినారు. ఆద్రవ్యముతో, రామచంద్రశతకము కాశీశతకము ప్రచురణ చేయబడినవి. మన్కి-మిన్కు-లో నొకభాగమగు 'కుదురు' ప్రచురించగలిగితిమి. సీమపల్కు-వహిలో కొంతభాగము మాత్రము అచ్చువేయుట జరిగినది. మన్కి-మిన్కు-లో మిగిలినభాగము అచ్చువేయుటకు సీమపల్కు-వహి పూర్తిచేయుటకు, యితర అముద్రిత గ్రంధములు ప్రచురించుటకు పదిపన్నెండు వేలరూపాయలు కావలసియున్నది,

ప్రభుత్వమువారు, ధనవంతులు, విద్యావంతులు, ఉదారస్వభావులు భూరి విరాళముల నొసంగి మా యుద్యమము జయప్రదముగావించమని వినయపూర్వ కముగా మనవిచేయుచున్నాను.

వసంతనికేతనము<br>
పన్నీరువీధి, విజయనగరం.<br>
**25—3—61.**

*వసంతరావు బ్రహ్మజీరావు,*<br>
కార్యదర్శి.<br>
*శ్రీ ఆదిభట్ల నారాయణదాసు అముద్రిత గ్రంధ ప్రచురణ సంఘము.*

# వి ష య సూ చి క



ఆటపాటల మేటి

శ్రీ మదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారు

# మన్కిమిన్కి [ఆయుర్వేదము]

## కుదురు.

తొల్పల్కులు (వేదములు), తలఁపులు (స్మృతులు), ప్రాఁతముచ్చటలు మొదలగు పదునెనిమిది చదువుల (అష్టాదశవిద్యల) నెల్లబాగుగానారసి యందీ మన్కిమిన్కిన్గుఱించి చెప్పఁబడిన వేల్పునుడువులనే నాతెలిసిన కొలంది నేనీ నాటుతెలుఁగు మాటల న్వెల్లడించినాఁడను - ఒక్కొక్క వేల్పునుడి పెక్కుతెఱఁగుల దినుసులఁజెప్పుటన్బట్టి మన్కిమిన్కినేపత్కెది నునున్గూర్చి పేర్కొనునో పైనొడవిన పదునెన్మిది చదువుల నారితీఱితేటనాటు తెనుఁగుమాటలగుట్టు మట్టెఱింగిన చదువరి మొనకాఁడొక్కండే యీ మన్కిమిన్కి (ఆయుర్వేదము)న్గుఱించి తేటతెల్లముగాఁ దనసీమ తెలుఁగుపలుకుల వ్రాయఁగలఁడు - వ్రాఁతలేని తొల్లింటి తఱియందున్దొలుపల్కుల న్దమతమ యయ్యవార్లు తమకెల్లనేయే తెవుళ్లెట్లు కలిగి ముమ్మరించునో వానికేయేమందు రెట్లిచ్చి కుదర్చవలయునో పేర్వేరఁ జెప్పియగపర్చి చేసి చూపించుచుండువారు - కనుకఁ దొల్లింటి మందరులెంతయో పాటుపడి యెట్టియిడుమల కోర్చియైనఁ దమతోడిపాటివారికే మాఱున్గోరకయే మందులిచ్చి తెవుళ్లన్గుదిర్చి వానిమీఁదను మనుగడలీడేర్చుకొనఁగల్గిరి- నిక్కముగా నెల్లవారికెల్లపుడు మేలేచేయనెంచు మంచి మందరులొరులవలనఁ బూరిపుడుకనైనఁగల్లరు తైపుచ్చుకొనక తమనుదుటి చెమటోడ్చితమకూడుగుడ్డలన్దామే సమకూర్చుకొందురు - పైవారి యాంద్రన్గాని, డబ్బుగాని సుంతయున్గోరకే తగులున్గాని, లేని మంచివానికొక్కనికే చదువులన్నియు న్దమంతఁదాముపలచి వచ్చును- ఆమేటిమందరి న్దలంచుకొన్నన్జాలు నెటువంటిగడ్డు తెవులైన న్దబ్బునఁ గుదిరిపోవును - ఏపలకు వన్గొనక హాయిగా నూఱేండ్లు బ్రతుకును - తనతోడిపాటివారికెల్లపుడున్మేలే కోరుచుండు మంచివాఁడన్ని తెవుళ్లన్గడిచి తాఁగోరి నన్నాళ్లు పేరుపెంపులతో హాయిగా నింగినేలలనలరును-తొలుఁబల్కులు(శ్రుతులు), తలంపులు (స్మృతులు), ప్రాతముచ్చటలు (పురాణములు) చెప్పినచొప్పున మందరి(వైద్యుఁడు) తనతాతముత్తాతలనుండియున్దానుతెలిసికొన్న పడికట్లన్దప్పక, కూటికై మతేనడువడిన్గైకొనకే తెగులున్దగుల కేకిడులంటక, తనలేమిచెప్పుకొనక, నాకదిది కాపలయుననియొరులకంచల న్బట్టి పేర్చిలాడక, కొండెములాడక, పిసినారిగాక, డాబులున్గొట్టక, యెవ్వరిమీఁదనైన న్బగపట్టక, విసువక, తన తలిదండ్రులవలెఁ దనపిల్లలమాఁడ్కిఁ దనయక్క చెల్లెండ్రన్నదమ్ముల తీరున నిరుగుపొరుగు వారల న్బొరపొచ్చె మిసుమంతయు న్లేకమచ్చిక న్గొనుచు, మిక్కిలి కూర్మిఁ బ్రావించి యిచ్చిన కొంచెమైన న్గొప్పగానెంచి తనివిన్దాటుకొనుచు, దనయెల్ల యిమ్ములన్మ

అసిద్ధమైన రేఁజవన్నెమనకవెగులు గొంటునకు మంచిమాటల న్నుగ్గడించి దీమ
సము నొల్లిపుఁ దనతోవపోని మందపులలోఁ దలపోయుచు (ఆలోచించుచు),
తన చిన్నతనమందియు నునుపుమిన్నా (ఆయుర్వేదము) చదువుకొనుచు
గొప్పమందులు (వైద్యుల) న్నెంచినంచి వారివలనఁ జెప్పన్గనుపప్పు వెఱవులన్నె
న్ను కొనుచు వారివలనఁ బుట్టు యుక్తతవతో నడుచుకొనుచు, వేల్పునుడువు
వ్రనయూరికల్పుఁ వ్రాసిన బాగుగాఁజదివి చెప్పఁగలిగి, యేఁబదవపడి యీడుగలిగి
కొమ్మ్రైన నన్నంజుడు (మాంసము) తినకుండువాఁడే మందిమ్మగాను-మందిలో
నెల్ల మందులేకన్నాకులు కనక నవ్వారల న్దక్కిన వారందఱు న్దనుతము యెలు
వేల్పులవలె నెంచికొల్చుచు వారిచెప్పునేఁటలన్నిటికుచుంత వలయును - కూటమి
పట్టి (నిషేకసమయమున) మగవానితలంపు (చిత్తవికల్పన) తీరెట్లుండునో యట్లు
చూలేర్పడును (గర్భసముత్పత్తియగును.) -ఉసురుమేర (ఆయువు), పని(కర్మ
ము), కలిమి (విత్తము), చదువు (విద్య), చావు (నిధనము) ఈ మైదున్గడుపులో
నుండఁగా నేమైతాల్పునకు (దేహికి) ఓజగా (స్వభావముగా) నేర్పఱ్పఁబడును
(సృజింపఁబడును)-

తాఁజేసికొన్న పనియంటుచొప్పున మేనితాల్పు (జంతువు) పుట్టువు (జన్మ
ము) నొందును - పుట్టినవాఁడు గిట్టకతీరదు - నలువగ్రుడ్డున(బ్రహ్మాండమందు)
ఏయేయోజలు (గుణములు) కలవో యొడలి యందవ్వియేకలవు - క్రిందులు
(పాతాళములు), కొండలు మొదలగు నింగినేలదినుసులు (లోకములు). అటు
వలె నేలంకలు (ద్వీపములు), కడళ్లు (సాగరములు), పొద్దు దొట్టి తొమ్మిది
మింటిమినుకులు (ఆదిత్యాది నవగ్రహములు), చూలునడుమ (పిండమధ్యము
నందు) నిరవుకొనియుండును - విత్తనము (శుక్రము) యెక్కువైనచో మగవాఁ
డు, నెత్తురు (శోణితము) మిక్కిలియయిననాఁడుది, నెత్తురువిత్తనములు (శుక్ర
శోణితములు) రెండుసాఁబాళ్లగునెడలనన్నగళ (షండుఁడు) పుట్టును - ఒక్క
నాటికానెత్తురు విత్తనములు చూలాలికడుపులో ముద్దకట్టును (కలిలమగును) -,
అయిదునాళ్లకు బుడగ (బుద్బుదము) అగును, పదునాల్గవనాటికి గాలి, కిత్తి,
తెమడలు కలిసి (మిశ్రధాతుసమన్వితమైన) చియ్య (మాంసము) అగును. ఇరు
వదినాళ్లకు గట్టినంజుడు (ఘనమగు మాంసము) అయితల్లికడుపులోనిమైతాలుపు
వరుసగా ముదురుచుండును -, ఇరువదైదునాళ్లకలవు (బలము), లావు(పుష్టి)తో
నుండును, ఒక్కనెలకాఁగానే నింగి, గాలి, డిగ్గి, తడి, నేలలయోజ (పంచభూత
తత్వము) న్దాల్చును - పుట్టినవారికెన్నటికి నావుతప్పదు - పాడిగా (స్వధర్మము
చేత) జరుగుచున్నవానికిఁ జావునావించును - తొల్లియీల్గు మైతాల్పులకుసురు
గాలితోలెమైమేని తొమ్మిదిగుమ్మములనుండి వెంట్రుకలనుండి దౌడధ్రొండులనుం
డియు నైఁకిపోవుచుండును - మిక్కిలి పాడెగట్లకు (పాపిష్టులకు) ముడిసుండి

యుసురువెడలిపోవును - ఊపిరిపోయినపిమ్మట నోడలుపడిపోవును. పెనుగాలి వలనఁ బెకలింపఁబడిన చెట్టువలెఁ గూలిపోవును, పొరి (మన్నులో,)నీళ్లు(నీళ్లలో), డిగ్గి (అగ్గి) డిగ్గిలో, గాలిగాలిలో, నింగి (ఆకాశము) నింగిలోనంత టన్నిండు కొన్నముక్కంటిలో నణఁగిపోవును (లయమగును) - మేనిలోఁ గోర్కి (కామము) కినుక, కన్ను. వీను (చెవి), మేని యైదుదినుసులు (పంచేంద్రియములు) దొంగలుగా నిరవుకొనుచున్నవి, అక్కఱ (కామము), అలుక (క్రోధము), పొగరు (అహంకారము), ఇవి నడిపించు మొనకాఁడు డెందము (మనస్సు), మేల్కీడుల (పుణ్యపాపముల)తోఁ గూడిన తఱి (కాలము) చంపెడునది-నింగినేలల (జగము) పాడి (స్వరూపము - స్వభావము) తనపని (స్వకర్మము) చేతఁ బన్నఁబడును - తమ మేల్కీడులున్నట్టి యెల్లరున్మాటిమాటి కొండుమేనులఁ (దేహాంతరముల) దాల్చుచుందురు - అయిదు మైదినుసుల (పంచేంద్రియముల)తోఁ గూడి యెల్లబులుపుల (విషయముల)తోఁ గూడఁ గ్రొత్తయొడలి నిల్లుతగులఁబడిన వాఁడింకొక్కయింటిలోపలె నింటియాతఁడై యిరవుకొనును - ఒడలియందు నెత్తుఁ మొదలగు నేడుదినుసులఁ గూడి మైతాల్పుపుట్టును - తలిదండ్రుల మైదినుసుల నట్టి పుట్టినవారి మైయేడుదినుసులు (ధాతువు) లుండును - తలిదండ్రుల మైదినుసులు (ధాతువులు) కలిగిన యీ మేనాయికీసరుల (షట్కోశముల) గలిగియుండును - మేనితాల్పులకెల్లగాలులు (వాతములు) కలుగుచుండును- ఉచ్చ, పీయి యీ రెంటిచేరిక గక్కిన తెవుళ్లొదవుచుండును - ఎముక, విత్తనము (శుక్రము), నన్నపునరము మేనితోడనే తగులఁబడును - మైతాల్పుల కందఱికిట్లు చేటుమూడును - రెండు నెలలకంట (త్వక్కు), నెత్తి క్రొవ్వు (మెదడు) పొడమును -ఎముకలయందలి నేయి (మజ్జ), ఎముకలు మూఁడునెలలకుఁ గలుగును - తలవెండ్రుకలు, వ్రేళ్లు నాల్గవనెలకుఁ బుట్టును-అయిదవనెలకు వీనులు(చెవులు), ముక్కు, బోరతోఁచును- గొంతుకన్నము, కడుపాఱపనెలకేర్పడును-ముడ్డిమొద లేడవనెలకొదవును- మేను, మేనివంతులు(అంగప్రత్యంగములు) ఎన్మిదినెలలకుఁ జాలునిండారును ఎన్మిదినెలల పిమ్మటఁ దల్లికడుపులో నుసుఱుమాటిమాటికిగ్గవలాడుచుండును - తొమ్మిదవ నెలకుఁ గందు (శిశువు) ముదిరి గట్టిపడును - పిమ్మట నక్కడుపులోనున్న మైతాల్పునకు (దేహికి) గడుపులోని తనయున్కి గడుపు దాఁటుచుండు తఱిన్మఱగవాఁడా యాఁడుదా క్లొజ్జయ్యాతానేది కాఁగలనను తలంపుకలుగును - ఆయుసుఱు తాల్పు తనకు మూఁడలవులు (శక్తిత్రయము). వెడదకన్గవ, యాఱుకీసరలు (షట్కోశము) యైదుమైదినుసులు (పంచేంద్రియములు), పదినరములు (నాడులు), పదియుసుఱులు (ప్రాణములు), పదియోజలు (గుణములు) కలిగియుంట తెలిసికొనఁ గలిగినయెడల నామెయి తాల్పుకలతెఱఁగెఱిఁగినవాఁడే మంపరి, కూడికతెలిసిన వాఁడు (యోగవిత్తు) ఎముకలయందలి నెయ్యి (మజ్జి), ఎముక, విత్తనము (శుక్లము - బీజము), వెండ్రుక, నెత్తురు, చేవ (బలము) యీ యాఱుపొరలు కల

పూలు (పిండము) అయిన నింగి, గాలి, నిప్పు, తడినేలలన్గలిసిమినుకుతాల్పు (జంతువు) మేనగును - తొమ్మిదవనెలన్గాని, పదవనెలగాని నిండిన పిమ్మట నీనింగి మొదలయిన యైదుదినుసులకూడికతో మైతాల్పు వెలువరించు గాలుల (సృతివాతముల) చేతలాగఁబడి నొప్పివలన నెల్లపట్లాడి నెలనరము (సుషుమ్నా నాడి) వలనఁబొదలి (పుష్టుఁడై) తల్లికడుపులో నిరవుకొని పైకివెడలుటకై తత్తఱిల్లుచుండును - నేల. తడ, ఇగిరిక (హవిస్సు), కుడుపరి (భోక్త), గాలి, నింగి (ఆకాశము) వీనిచేనమమఁబడి నన్నసరముల ముడులన్గట్టఁబడును - ఈ పిల్లన రములేడు పెద్దనరములలోని వేళ్ళు, అంట (త్వక్కు), నెమ్మ, నరములు, వెండుృకలు. చియ్య (మాంసము) లందైదవవి - ఈయైదు నేలపొడులు (గుణ ములు) - తడి (జలము)యొక్కయై దోజలు చొంగ, యుచ్చ, విత్తనము, నెమ్మ లలోని నెయ్యి, నెత్తురైదవదని మిక్కిలి పూనికనెఱుంగునది - ఆఁకలి, డప్పి, హూర్కు, బడలిక. యొప్పు (కాంతి), యైహార (అగ్ని) యొక్క యైగోజలు - హూరిమి (రాగము), పగ (ద్వేషము), సిగ్గు, వెఱపు, సొలపు (మోహము) గాలివలనఁబొడమినయైవోజలు (గుణములు) - ముడుఁగుట (ఆకుంచనము), పరుగిడుట, దాఁటుట, చాఁచుట (ప్రసారణము), అడ్డంకి (నిరోధము) యీ యైదు గాపాడులు (గుణములు) - మ్రోఁత (ఘోష), తలఁపు (చింత), లోఁతు (గాంభీర్యము), వినికిడి (శ్రవణము), నిక్కమందుచేరుట (సత్యసంక్రిమము) ఈ యేనునింగియోజలు - వీను (చెవి), అంట (త్వక్కు), కన్నులు, నాల్క. ముక్కు యీయైదు నెఱిదినుసులు (బుద్ధీంద్రియములు)- కై, కాలు కుత్తె,మాట, బుయ్యకామలు (గుహ్యము) యీయైదు పనిదినుసులు (కర్మేంద్రియములు) - (ఇడ - ఎడమముక్కు చరము, పింగళ కుడిముక్కు చరము, సుషుమ్న రెంటి నడినరము, గాంధారి - నుడిపుట్టించునరము, గజజిహ్వ, పూష, యశ, అలం బుశకుహువు, (శంఖిని) అను పేర్లుగల యీ పదినరములెల్ల నరములలో మేటులై మైపిడుచనడుమ (పిండమధ్యమున) నుండును - ఎగయూపిరి (ప్రాణము), దిగ యూపిరి (అపానము), మేనినెల్లనొక్కలాగుండుగాలి(సమానము), డోపెగయు గాలి (ఉదానము), ఒడలంతటనలముకొనుగాలి (వ్యానము), డోఁకించుగాలి (నాగము), తెలివినిచ్చుగాలి (కూర్మము). తుమ్మించుగాలి (కృకరము) ఆవులిం పించుగాలి (దేవదత్తము), పీనుగలోఁగూడ నుండుగాలి (ధనంజయము) ఒడలి యందీపదిగాలులలముకొని యుండును - మేనితాల్పులందఱికలవు పన్ను బొడ లియ తుకులకంతటికన్నిన్నతిండి నడుపుగాలి (ప్రాణము), తినినవెంటనే తిండి గాలిచేతరెండు తెఱఁగులు కావింపుచుఁ గుట్టియలోఁగూడ గానుదడిగాను పొలుచే యును - పైగాఁగత్తివలఁదడి (జలము) నల్పి యానిప్పుయందుంచి క్రిందనుండి యానిప్పునామెల్లమెల్లగా నాయునురుగాలి (ప్రాణవాయువు) యూఁదుచున్నగు బ్బును - ఆగాలివలన నాకడుపులోనికిత్తిరగిలిపస (రసము)గాసు వేఱుపర్చును-

క్రొవ్వు, విత్తనము (శుక్లము), నెత్తురు, ఎముకలలోని నెయ్యి (మజ్జ), ఉచ్చ, పీయి, గులిమి (పింజూషము), గోళ్ళు, తెమడ కన్నీళ్ళు, కంటిపుసి, చెమ్మట, ఈ పన్నెండు ముఱుఁకుల (మలముల)నొడలినుండి పైకిఁబోఁగొట్టును- వీను,కన్ను, ముక్కు, నాల్క, పల్లు, బొడ్డు, మేను, కుత్తె, గోళ్ళు, ముఱికులకండలు (ఆశ్రియములు) - పీయి, యుచ్చ హద్దులేకుండును - ఈయొడలు విత్తు (శుక్లము), నెత్తురుల యొండొంటిపొడికవలన నాఱుకీసరలు కలదని (షాట్కౌశికమని)చెప్పఁబడును - వెండుర్కలు మూఁడున్నఱ కొట్లులు (కోట్లు) - ముప్పదిరెండ్లు, వెండుర్కలేడువందలవేలు (సప్తలక్షలు).ఇరువదిగోళ్ళు, ఒడలిలోని చియ్య (మాంసము) వేయిపలములు (పలములు), నెత్తురు నూఱుపలములు. పదిపలములు క్రొవ్వు (మేదస్సు), అంట(త్వక్కు)క్రొవ్వంతే, ఎముకలలోనినెయ్యిపన్నెండు పలములు, నరములనెత్తురు(మహారక్తము) మూఁడుపలములు, తెలుపు(శుక్రము) రెండుచేరలు, ఎఱ్ఱ (శోణితము) అద్దెడు, తెమడయాఱడ్లలు, పీయియుచ్చలాతెసి యడ్డలు - మేనితాల్పునకు బలుపు (సుఖము), కస్తి (దుఃఖము), వెఱపు(భయము), మేలు (క్షేమము), తాజేసికొన్నపని (స్వకర్మము) నృట్టివచ్చును - తల్లకిర్రిందుగా మొదటమూతి పిదపకాళ్ళు వచ్చునట్లు కడుపునుండిగాలికందున్లాగుచుండును-మోఁకాళ్ళవైపులన్గ్గలవనుంచుకొని కడుపులోఁ బాప పెరుఁగుచుండును- రెండు బొటమనవేర్రిళ్ళు రెండు ముడుకులమీదఁన్కుదుములక్రింద నృక్కన త్రైగపవ్రేళ్ళనుమోఁగాళ్ళనడుమన్గవన్ముక్కునుంచుకొని యీతీరుగానాఁడు దాని కడుపులో నిరవుకొని మైతాల్పు (జంతువు) పరుసగా (క్రినుక్రిమముగా) నెదుగుచుండును, ఎముకలవలన గట్టిపడును, తిండితాగుడులచేత బ్రతుకుచుండును తల్లి బొడ్డుచేరిక మాజాకునరము (ఆప్యాయిని) చేతన్ట్టుటఁబడియుండు తల్లిప్రేగు కన్నమందిరికికొని మెల్లమెల్లఁగాఁగ్రిందికి జాఱిపడును - తల్లితిని తాగినకూడు నీళ్ళనబ్బిదియూపెకడుపులో మేను పెంచుకొనుచు అన్నివైపులన్నలఁగుడుపడుచుఁ బెరుఁగుచుండును - తానదివరకుఁగొన్నపెక్కు పుట్టువల న్గన్నమేల్కస్తుల, న్గూర్చితలపోసికొనుచు ఖ్రితుకుపై రోఁతపడుచుండును - కడుపునుండి వెలువడినతోడనే నామునుపటి పుట్టువులందువలె తప్పుపనులఁజేయక తిరిగి పుట్టి చావని తెన్నున నడిపించి మంచిపనులే కావింపఁ దలకొనెదను - ఈ తీరునఁదల్లి కడుపులోనున్న మైతాల్పు తొల్లింటిలెక్కకు మిక్కిలియైన పుట్టువులందెల్ల తెఱఁగులఁదాఁబడినపాట్లు తలంచుకొనుచుఁదఱి (కాలము) గడచుచున్న కొలఁదినూర్మతికిర్రింపుగాఁదిరుగఁబడి తొమ్మిదిగాని పదిగాని నెలలునిండిన పిమ్మట న్పూతిగాలిచేఁబిసుకఁబడుచుఁపైకిఁద్రోయఁబడుచు, నొగులు చేవనరుచు, పుట్టినతోడనే సైఁపరానిసొమ్మగొని నేలన్బడినవెంటనే పైగాలితాఁకు నూపిరాడఁ దెలివిగొని హోయిగానుండును - అంతటనాయుసును తాల్పునేర్పరుమాళ్ళ గారడము (మాయ) తనుగర్రిమ్ముఁగానద్దానికిలోనై తనతెలివి న్గోలుపోవును-ఎఱుకఁదొఱఁగి

మూఁడేండ్లలోపునఁజంటపాపయైయెన్మిదేండ్ల యీడువఱకుఁ జిఱుతయై, కోడెయై, ముసలియై, చచ్చుచున్దిరిగి పుట్టుచుండును - ఇట్లు పుట్టుకసుడిన్బడి తిరుగుచుఁ దనమంచిపనులవలన వేల్పుటెంకి (స్వర్గము) న్మొలయుచుఁదనచెడుగు సేతలన్బట్టి విస్త (నరకమున) న్నొగులుచుండును - వేల్పుటెంకి విస్తలనుడుచు తరుణముమించిన వెంటనే కొలఁది తఱినేలపై పుట్టిమెలఁగుచుండును - తెగులు తగులకుంటకై (ఆరోగ్యముకొఱకు)ఁబగటిజేని(సూర్యుని) న్గొలువవలయును-హాయికై (భోగముకొఱకు), జాబిలి (చంద్రుని) న్గొలుచునది - అలవు (బలము) గాలిన్గొల్వవలయును - చియ్యలేని మోకాళ్ళవాఁడు తెగులుగొంటు (రోగి) యగును - పొదవునట్టిలవాఁడుకొద్దియుసురు (అల్పాయుర్దాయము) కలవాఁడగును-నుదుట మూఁడుగీతలున్నవాఁడు పిల్లలన్గని హాయిగా నఱువదేండ్లు బ్రతుకును - రెండు గీఁతలున్నవాఁడు నలువదేండ్లుమనుసు - పగడగీర (ఒక్కరేఖ) కలవాఁడిరువదేండ్లు బ్రితుకును - ఆయొక్కగీ తెపినులవరకున్నవాఁడు నూరేండ్లు బ్రతుకును రెండుగీరలవలన డెబ్బదేండ్లు, మూఁడుగీటులవలన నఱువదేండ్లు బ్రితుకును - తోఁచితోఁచకుండుగీటులున్న వాఁడిరువదేండ్లుమనును - గీఁతలులేనివాఁడు నలువదేండ్లు బ్రితుకును - తునుకయిన గీటులున్నవానికి దబ్బాటుచావు (కాకిచావు- అపమృత్యువు - అకస్మికమరణము) కలుగును-సుడివోనలుగు(ముమ్మొనవాలుఁ త్రిశూలము) గాని, మొహవా (అడ్డకత్తి - పట్టిసము) గాని నుదుటన్గన్పట్టువా-డొడమిపిల్లలు న్గల్గివందేండ్లు బ్రితుకును - చూపుడువ్రేలు నడిమివ్రేళ్ళ మొదళ్ళ నడుమనెవ్వాని కుసురుగీఁత (ఆయూరేఖ) కొనముట్టునోవాఁడు నూఱేండ్లు బ్రితుకును - బొటనవ్రేలుపాదునుండి నడిమివ్రేలిమొదలుముట్టిన దుసురుగీఁత - చిటికెనవ్రేలు పాదునుండి యెగబ్రాకునదు సుఱుగీఁత, నడిమివ్రేలు చూపుడు వ్రేళ్ళకుఁదునిసికాని తునియకగాని బోవునెడల నూఱేండ్ల యుసురుతప్పదు - చిటికెనవ్రేలి మొదలునుండి నడిమివ్రేలినొరయు నుసురుగీఁత యఱువదేండ్లు మననిచ్చును - కుఱుచకామకలవాఁడు డబ్బుకలవాఁడై పిల్లలన్గనును - పెద్దకాము కలవానికి డబ్బుగాని పిల్లలుగాని కలుగరు. వ్రేలాడు వట్టలుగలవాఁడు నూఱేండ్లు బ్రితుకును - ఇంచుకనేపేకూడికసల్పువాడు నూఱేండ్లు (పెక్కేండ్లు)బ్రితుకును చియ్య (మాంసము) లేనిమోకాళ్ళుకలవాఁడు తెగులుగొంటగును - పసడిమేని యొప్పుకెందమ్మి కయిగవగలయాఁడుది కొ్రిత్తడి (పతివ్రత) యగును- మలఁక (వంక) కొప్పు. గుండ్రిని కన్నులున్నయాఁడుదానిమగఁడుపిల్కుమాపున దెల్ల కస్తులన్గుడుచును - ఎవతెకెళవుల (పార్శ్వముల)ఁజాఁచుల (పాలిండ్ల) న్గఱులు (రోమము) లుండునో పెదవులు పొడవుగానుండునో యది దబ్బునన్దన యింటాతని మడియింపించును - ఎవ్వతెకాళ్ళ చిటికెన వ్రేలిపైవేలు (అనామిక) బొనటవ్రేలు నేలన్సోయకుండునో యదిమగనిన్జంపించి తిరుగుఁబోతగును - ఎవతె నడుచునంత నేలవడఁక జొచ్చునోయది తనయింటి యాతనిఁజంపించి రంకులాఁడి.

యగును - చొట్టవెండ్రుకలవాఁడు బాఁటసీమ (ప్రవాసమున) నశించును - చాలా సేపుకలయిక (మైథునము) సల్పు వానికి యుగము (ఆయువు) తక్కువగును - కడుపుపైనొక్క ముడతకలవాఁడు నూఱేండ్లు బ్రతుకును - ముడత (వలి) లో బొడ్డున్నవానికిఁ గడుపునొప్పియుండు నాముడత యెడమపైపునకుఁ దిరిగియున్న యెడల నానొప్పి కుదుర్చుటకుఁబీఁగగును - ప్రేళ్లగనుపులు (పర్వములు) పొడవుగా నున్నవాని యుసురు (ఆయువు) పొడవుగానుండును -, వాఁడు సొఁగసరి యగును - చిటికెనవ్రేలిమొదటినుండి గీఁత (రేఖ) జుట్టువ్రేలిదనుక నున్నయెడల నూఱేండ్లు బ్రతుకునది - కొనతునుకలైనయెడల వానికిఁ జెట్టునుండి పడుపు కల్గును - వెండ్రుకలునిండిన వీనులవాని యుసురుకుఱుచయగును - చప్పిముక్కువాఁడు దబ్బునఁజచ్చును - మిడిగ్రుడ్లవాని యుసురు తక్కువ - నుదుట మూఁడు గీఁతలున్నవాడు నూఱేండ్లుబ్రతుకును - ఎండుముక్కువాఁడు పెక్కేండ్లు బ్రతుకును - నుదుట నాల్గుగీఁతలున్నవాఁడు దొరయైతొంబదైదేండ్లు బ్రతుకును - నుదటగీతలులేనివాని యుగము (ఆయువు) తొంబదేండ్లు - తలవెండ్రుకల నొరయుచు నొసటి గీఁతలున్నవాని కెనుబదేండ్లు సురుండును - నుదుట నైదుగాని, యేడుగాని, యాఱుగాని, పెక్కులుగాని నొసలు గీఁతలున్న వాఁడేబదేండ్లు బ్రతుకును - నుదుటఁబెక్కు సొట్టగీఁతలున్నవాఁడు నలువదేండ్లుమనును - కనుబొమ్మలనొరయుగీఁతలవాఁడు ముప్పదేండ్లు బ్రతుకును - నుదిటి కెడమవైపు సొట్టయౌ గీఁతలున్నవాఁడిరువదేండ్లకు మించి మన్నఁడు - చిన్న చిన్న గీఁతల నుదిటివానియుసురు మిక్కిలి తక్కువు - చప్పినరములవాఁడు తనతండ్రి నోఁచకార్చును - వ్రేలాడు నుదురు కలయాఁతుది మఱఁదిన్మడియించును - వ్రేలాడు కడుపుకలది మామన్జంపును -

కదలాడు పిఱుదములు కలయాఁతుదిమగనిన్జంపును, మిట్టపండ్ల యాఁడుదింటియాతని నోలయించును. ఒడలినడుమన్బలు తీరుల నరములు (నాడులు) పెక్కులుండును. బొడ్డుక్రింద నరముల నొమ్మలకెత్తించు దుంపయుండును. డెబ్బదిరెండువేలనరములు బొడ్డునడుమ పాదుకొనియుండును. చుట్టుకొనియున్న యానరములెల్ల నుసురునొప్పఁగొట్టఁగలవవ్వానిలోనెల్ల కుడియెడమ నడుములందుండునవి సేతులు (శ్లేష్మములు). ఎడమదిజాబిలి, కుడిది పగటివేల్పు, నడిది డిగ్గి (అగ్గి) తఱి పొడన్బంటన్బండించును (కాలరూపిణియై ఫలించును) ఎడమది బ్రతికువెరవై మేనితాల్పునెల్లన్దనియించును, (అమృతమైకాపాడును). కుడిదిడిగ్గివలె నేలనెల్లనెండించి బుగ్గియొనర్చును. ఈమూడింటిలోనే రెండైనఁగలిసి యాడుచున్నపుడన్నిపనుల న్జెఱచుపొలియిక (మృత్యువు) కలుగును. చిలునొప్పఁగొట్టుటకై (విషాపహరణమునకై) నోరుముక్కులనెమ్మెలఁగు నూపిరినడు మూఁడునరములలో మొదటిది (ఇడానాడి) పనికివచ్చును. పగతురని ల్వేదలించుటకు న్బంపు

టకున్నదినరము (పింగళానాడి) న్వాడవలయును, మాఁగుడుసుప్వాణికల పూసల (మణుల-ముత్తెముల) న్దాల్చువారెల్లకస్తులకులోనై చచె దరు. నిక్కపుకిరీటిపచ్చ (గరుడపచ్చ) తాఁకుడువలనఁ జిలువకాటుచిలుము పోవు. (హరించిపోవును) తక్కిన మణియే పెరవులనైనకుదరని పాముకాటు – ముగాని చిలుమువలనఁ బుట్టినతెవుళ్లేవియైననగ్గాని కిరీటిపచ్చ (గరుడ) పచ్చన్దాల్చ - వానిన్విడిచిపోవును.

[ఇప్పటితఱియందు (కలికాలములో) గలగల్పు (సాంకర్యము) లేక దినుసులుగాని మైతాల్పులుగాని కలుగని కతమునఁబూసలు (రత్నములు) కూడ కలగల్పులేక నిక్కమైనవిదొరకవు. కనుకమందు దినుసులుగాని మందరులుగాని తెవుళ్లన్నుదుర్చజాలకుంటచే నెల్లయిడుమలన్వడి మైతాల్పులుబోమున (బలత్కారముగా)ఁ బెన్దడవు బ్రతుకఁజాలకున్నారు, ఇప్పడిక్కలికాలమునందు పెరుమాళ్లన్గొల్చుటకన్న నెల్లతెవుళ్ళన్మాన్చి యెప్పటికి న్థాయిగా బ్రితికించు పెరవింకేది యున్లేదు.]

మిక్కిలి యెఱ్ఱగానున్న పూసయేదో యదేతమ్మికెంపు (పద్మరాగము) దాని న్దాల్చునాఁడుదికొడుకులన్గనును. పచ్చపూసలు(కిర్కేతనములు) బంగారుతీఁగెతో గుచ్చి కిత్తి(అగ్ని)లో నుంచినయెడల మెఱపుహెచ్చునవి తెవుళ్ళనోర్చిగొట్టును, జగడమున్మాన్పును, ఉసురు (ఆయువు) న్పొడిగించును, పదుగు (వంశము) న్వెలయించును ఇమ్ము (సుఖము) నిచ్చును. మంచుకొండకు (హిమవత్పర్వతమునకు) డాకడ (ఉత్తరదిక్కు) న్జిక్కునొక్కరకపు తెల్లరాపూసలు (భీష్మరత్నముల) పేరుమెడన్వేసికొన్నవాని కనయము కల్మియలరున్నెరువ ను పెట్టి టికి దానిన్జూచి యెలుగొడ్లు,వఱడులు, ఏనుగులగొంగనూఁడు (శరభము) మొదలగు చంపెడు నాల్గుకాళ్ళ కారుమేని తాల్పులు (హింస్రకము) పాఱిపోవును, చిలువ, ఉడుము, తేలు మొదలగువాని చిలుముతగ్గిపోవును. నీళ్ళు (సలిలము), నిప్పు, పగఱు (వైరి), దొంగలనుండి యెక్కువ జడుపుపోవును. మకిలలేక, మెఱుఁగై, మనువై, చెన్నుమీఱు గసిరా - సిరాజి (పగడము) డబ్బు తినుబడి దిమను (ధనధాన్యముల) సమకూర్చును, చిలుము తెవులు వెఱపులనోర్చిఁగొట్టును. పగటివేల్పులన్పంద్రెండుగుర (ద్వాదశాదిత్యుల) న్గొల్చిన నెల్లతెగుళ్లనోర్చును. చిలువతేండ్లన్గొల్చి పాముకాటు చిలుముతగ్గిపోవును. కలపతాల్పు (బలభద్రుడు) న్గొల్చిన వలవునెమ్మదులలరును. నిట్టిపుట్టువు (నారసింహుని) న్నమ్మిట్టుకొని మ్రొక్కినఁ బోరిలో గెల్పించును. తెగులుగొంట్లయొద్దన్గూర్చుండరాదు.

తన యొడలిన్పొడమినప్పటికి న్దెగులు తనకింపుకాదు, కారునందు (అడవిలో) గలిగినప్పటికిన్మందు మేలే. అఱిగిపోయిన తిండి తెవుళ్ళకుఁ జావుదెబ్బ

ఉసురుమిన్కు (ఆయుర్వేదము) తెల్లపఱచుచున్నవాఁడు, అందరికిన్మంచివాఁడు (ఇష్టుఁడు - ప్రియదర్శనుఁడు) గొప్ప ఉగము (ఆయువు), దొడ్డనడత (శీలము) కలవాఁడేమందరి (వైద్యుఁడు) గా నుండఁదగును.

తొల్లిటి పుట్టువందుఁదాఁ జేసికొన్న చెడుపనులన్బట్టి కల్గినమేని యుల్లముల తెవుళ్లు గట్టివింత నెగిసిన ముల్కులవలెఁదగులక మానవు. ముసిలియాఁడు వారల పొందు, క్రొత్తకోపు (నూతనమద్యము), ఎండిపోయినచియ్య (మాంసము) ముగ్గడ్డలు (త్రిమూలకము) నీరుల్లి, వెల్లుల్లి, ముల్లంగి మాపుపెరుఁగు, పగలు పడక, చదువరి (విద్వాంసుఁడు) ఈ యాఱున్విడిచి పెట్టవలయును. అరకువ (అజీర్ణము) పట్ల తిండిచిలుము (విషము) అగును. మందరి (వైద్యుఁడు) లేని యూరిన్నెలకొనరాదు. ఏఱులేని యూరిలోనిరవుకొనఁగూడదు. మిక్కిలి నీళ్లు తాగుచుంట, గట్టి వంటకముతినుట, నెత్తురు మొదలగు మేనియేడు దినుసు (సప్తధాతువులు) తఱిగిపోవుట, పియి, యుచ్చ, తుమ్ము, మొదలగువాని పడినాపుకొనుట (వేగవిధారణము), పగలు పడుకొనుట, రేయి మేల్కొనుట యీ యాఱిటి చేత నెవరికైన (నరులకు)ఁదెగుళ్లుదగులును. లేయెండ, యెక్కువ కూటమి (అతిమైథునము), ఒలికిపొగ (శ్మశానధూమము) కయి కాచుకొనుట (కరతాపనము), ముట్టు దానిమూతి చూచుట, యెంత గొప్పయుగము (దీర్ఘాయుర్దాయము) నైనఁదగ్గించును. ఎండిపోయిన నంజుడు (శుష్కమాంసము) ముసలియాఁడువారి పొందు, లేఁబగటిజేఁడు (బాలార్కుఁడు), లేఁగటి పెరుఁగు (తరుణమగుదధి). తెల్లవారినపట్ల గూడిక, (ప్రభాతము) కూర్కును, వెంటనే యీ యాఱు నుసుఱున్బోఁగొట్టును. అప్పుడే కాచిననెయ్యి, అంగూరు (ద్రాక్ష) పడుచుది (బాలస్త్రీ), పాలబువ్వ (క్షీరభోజనము) వేఁడినీళ్ళు, చెట్టునీడ, వెంటనే చేవ చేయును. నూతినీళ్లు, మఱ్ఱినీడ, గుబ్బెత గుబ్బలు, చలితఱిన్వెచ్చగా వేసవిన్జల్లఁగానుండును. పడుచుదాని పొందు, తలగడుగు (అభ్యంగము), మంచి తిండి, ఈమూఁడున్వెంటనే యోపిక (బలము) నిచ్చును. దవ్వుత్రోవనడుచుట, కూటమి (మైథునము) వేఁకి - కాఁక (జ్వరము) ఈ మూఁడు వెంటనే లావు (బలము) తగ్గించును. లేయెండ, పీనుఁగుపొగ, ముసిలిదానితోఁగవగూడుట, లేఁగటి పెరుఁగు, చీఁపురుదుమ్ము మసురుకోరు వాఁడుకొలువఁగూడదు. ఏనుఁగు, గుఱ్ఱము, తేరు (రథము), వడ్లు ఆవులతుమురు (ధూళి) మేలు. గాలిగాడు (గాడిదె), లొటిపిట, మేఁక, గొఱ్ఱె కాళ్లదుమ్ము (రజము) కీడు. లేయీడున నోర్మికలవాఁడే, యోర్పరియని చెప్పఁదగును గాని నెత్తురు మొదలగు మేని యేడు దినుసులు తగ్గిపోయిన పిమ్మట నెవనికిఁదాల్మి కుదురకుండును. కఱద (మనసు చిత్తము-బుద్ధి) స్వట్టిము నెత్తురు మొదలగుమైదినుసుల (ధాతువుల) స్వట్టిము నొవలితీరుండును. కఱద (చిత్తము) చెడినయెడల నెత్తురు మొదలగు

మేని దినుసు లేఁపన్నెడిపోవును. కాఁబట్టి కఱద (చిత్తము) నెల్లపుడున్నాపాడు కొన వలయును. ఏఱుప (చిత్తము) నెమ్మది (స్వస్థము) గా నున్నప్పుడు నెత్తురు మొదలగు మేనిదినుసులు (ధాతువులు) కొనసాఁగుచుండును. ఎల్లపుడు (దిమ్మ టటమైయుఱాల్పులకు ముదిమి (జర) కొండలకు నీళ్ళుముప్పు. చెలవఁలకుఁగలయిక లేమి ముసలితనము. వలువలకెండకారు (జర). కల్మికతము, పడువున్నవాని పసురెలాపోయిన వాని తెగులు తగులకుంటవంత (దుఃఖము) మొదలంట బెరికి వైచును. పుట్టుకతోడనె యుసురు (ఆయువు జీవితకాలము) యేర్పాటు కావింప చావు (నిధనము) తేర్పడియుండును. ఉసురు నిల్కడలేనిది (అస్థిరము) కోడె యీడు (యౌవనము) నిల్కడలేనిది (అస్థిరము). నూఱేండ్ల యుసురు మిక్కిలి తోలెము. దానిలో రేయిసాఁబాలుచెల్లిపోవును, తక్కినవంతు తెగులు (వ్యాధి) ఏడ్పు (శోకము). ముదిమి (జర), అలసటలతోఁదుదముట్టునది కూడ వట్టిదే (నిష్ఫలమే). ఎవ్వరికైననుగము (ఆయువు) నూఱేండ్లమేర (పరిమితి). అందు లో సాఁబాలుమాపు (రాత్రి) పోవును; దానిసాఁబాలులోనించుక యెక్కువవంతు చిన్నతనమైపోవును. కొంత చుట్టాలయెడయిక యేడ్పు, చావులతోడను, దొర కొలువు చేఁతనోఁబవును; మిగిలినది నీళ్లపిల్లయలవలెఁ గదలాడునది. పొగరు పోతులకడదేలా (గర్వమేలా). రేఁబవళ్లయడ (రూపమున) నుమ్మదిమినేలన్దిరుగ వలయును. పోతు, గుఱ్ఱము గలాఁడు యముఁడు (మృత్యువు) ఉసురుతాల్పుల (భూతముల - ప్రాణుల) నాలిన్ప్రాముపలె మ్రింగివేయుచుండును. తెగులు మిగులుండిన యెడల మాటిమాటికెదుగు చుండున్గావున దెప్పలుంచఁగూడదు. బ్రతుకునకుఁజావేతుద (మరణాంతంహి జీవితమ్). తెగులు పోయినవాఁడు హాయిగా బండుకొనును. ఒడలేతిండిన్దెలుపును. ఆఁకలి తీఱిన వానికిఁ దిండి వమ్ము (వ్యర్థము). మూతిమాఱుపు (ముఖభంగము), డగ్గుత్తిక - దిగులు గొంతు (దీనస్వరము) మేనిచెమ్మట, మిక్కిలి వెఱపు చావు గుఱుతులు. మంచువేఁడి నొప్పిగొట్టును. కట్టడన్పస్తుల్లినవాఁడు (ఉపవాసము చేసినవాఁడు) తళియ (భోజ నము చేయుటకుఁబళ్లెరము), మినుము, చిఱుసనగలు, బొడసగలు, ఆకు కూర, తేనె, పైవారియింటితొడి (ఎరాన్నము) మానవలయును. పోసనము కడలి చిలుకుతఱి (క్షీరసముద్ర మథనకాలమునందు) పెరుమాళ్లు (ధన్వంతరి) యను పేరుగల మందరియై (వైద్యుఁడై) చావురానివ్వకెప్పటికే తెగుల్తగలనివ్వకెప్పటికి న్బతుకనిచ్చుమందు (అమృతము) నిండిన జారీ పట్టుకొనిలేచి యెనిమిది వంతు లుగా నున్న మందులతోలు చదువు (ఆయుర్వేదము) శుక్రుఁడను వానికి (విశ్వా మిత్రుని కొడుకు) జెప్పి చెలువ నిలువు (స్త్రీరూపు) తాల్చి యాబ్రతుకు మందు పాకము (అమృతము) న్వేల్పుల న్రావించెను, ఆఁడుది నెలతప్పకుంట, పుట్టిన బిడ్డ దబ్బునఁ జచ్చుచుంట, సోఁకు (ప్రేతము) వలనఁ గలుగు చీఁదఱ (పీడ) అబ్బాటుగా (అకస్మాత్తుగా) జీవన వృత్తికాటంకము కలుగుట, అందఱిలోనగ

డారు (అపఖ్యాతి) వచ్చుట, డబ్బాటు - అవచాటము (ఆకస్మాత్తుగా) నున్న యిల్లు దబ్బునఁగాలిపోవుట, తనయింట్లో జగడము, నేపముత్తగాఁదనపై మోపఁబడుట, దొరయఖుతెవులు (రాజయక్ష్మ) చెలరేఁగుట, తనంతఁజాఁదనడబ్బు న్దోవలోఁబోఁగొట్టుకొని యెంత వెదకినన్దిరిగి యది చిక్కకపోవుట, దెత్తితనము (పేత్రతత్వము) నోఁగొట్టియునురు (జీవుని) న్బిడ్ద్రోవ (మోక్షము) న్పొందింపఁదగు వెరవులు.

ఎనుబది నాల్గువేవేల లెక్కమేర (చతరసీతి లక్షలు) నెన్నఁబడిన మేని తాల్పుల (జంతువుల) లోని నాల్గు తెగలు గుడ్డు కానుపులు (అండజములు) చెమటపుట్టువులు (స్వేదజములు), నేలన్బెల్లగించి మొలుచుచెట్లు మొదలయినవి (ఉద్భిజ్జములు) మావివలనఁ చొడము నుసురులు (జరాయుజములు). గుడ్డు పుట్టువులిరువదొక్క వేయి వేలు (ఏకవింశతిలక్షలు) నొక్కొక్క తెగ లెక్క తెలును. మేని తాల్పులకెల్ల మందితనము (మానుష్త్వము) మిక్కిలి లెస్స (దులభము) అంట (త్వక్కు), కన్నులు, వీన్పు (చెవులు), నాల్క; ముక్కు, పలుకు, కయి (చేయి), కాలు, కుట్టియ (పాయువు), బయ్యకాములు శిశ్న భగములు - ఉపస్థము) ఈపదిమేని దినుసుల కుదిరిక గొప్పయాదట-పాడి-మేళ్ళ (మహాపుణ్యముల) వలనఁగల్గును. పాఱులు (బాహ్మణులు), దొరలు (క్షత్రియులు), కోమటులు (వైశ్యులు), కాఁపులు (శూద్రులు) నాల్గు తెగల వారు మాఱుపుట్టువు (పునర్జన్మము) వేల్పునరుపెన్నులు (స్వర్గనరకములు) కలవని నమ్మితొలుఁబల్కులు (వేదముల) కట్టుపాట్లన్పట్టిపడుచుకొనుచుందురు. చాకలి, గొడగరి, మేళఁగాడు, ముండలనాడించువాఁడు, బొమ్మలాటవాఁడు దొమ్మరి, తాళగిరి (నటుఁడు) మేదరి (బురుడుఁడు). బోయి (కైవర్తుడు) ఎరుక (భిల్లుఁడు-చెంచు) ఈ యేడుగురు కడజాతివాండ్రు (అంత్యజులు). ఆఁవంజుడు (గోమాంసము) తినుచుఁదెగలవాసి (జాతిబేధము) లేక తేటతెల్లముగా, బల్కఁజాలని పచ్చెకాండ్రు (మ్లేచ్ఛులు) మొదలగు చిలుపులు (క్షుద్రులు) పెక్కు తెగలు. లెక్కమిక్కిలియగునన్ని మైతాల్పులందు [illegible]. తిండి, కూటమి, కూర్కు, వెఱవు, కినుక, మైతాల్పులకెల్ల నొక్కటి[illegible]గాని యెఱుకయే (వివేకము మాత్రమే) పొంద వలను పడదు (దుర్లభము), పసివారుగాని, యీడు వచ్చినవారుగాని, ముసలులు (వృద్ధులు) గాని [illegible]వారు, వంతన్గలఁగు వారుగాని, గొప్పవారుగాని, కొద్దివారుగాని యెవ్వవు[illegible]నోర్వఁజాలక మఱల మఱలఁ బుట్టుచున్చచ్చుచుందురు.

మంచికూడు పెట్టిన యీవికాఁడు వేలిమిన్[illegible] (అగ్నిహోత్రము చేయువాఁడు) మినుకులతల తెలిసినవాఁడు (వేదాం[illegible]), వేయినెలలు బ్రతికిన

వాఁడు, నెలకొక్కసారిపస్తుల్లినవాఁడు (మాసోపవాసి) తొ్రిత్తడి-ఇల్లాలు (పతి
వ్రత) మందిలో నీయాఱుగురు దండము పెట్టఁదగుదురు.

ఒడలులేని యెడల మందిచేయఁదగినపని (పురుషార్థము) పాడి (ధర్మము), ఒడమి (ధనము), కోర్కి (కామము), పెందో్రివ - విడుపు-ముక్తి (మోక్షము) కలుగదు. కావున మేనిని, డబ్బును, గాపాడుకొని మంచిపనుల (పుణ్యకర్మముల) నొనర్చవలయును. ఎల్లపుడు న్దనుచాఁగాచుకొనవలయును. తొనమొదటే యన్ని టికానరా (భాజనము) మేనిన్గాపాడుకొనుటకై మిక్కిలి తలకొనవలయు (యత్నమాచరింపవలెను) బతికియుండిన నిమ్ములు పడయవచ్చును. మఱల నూరు మఱలఁబొలము, మఱలనిల్లు, మఱల మంచిచెడ్డ పని కలుగునుగాని మఱి మఱి యీ యొడలురాఁబోదు. ఒడలిన్గాపాడుకొనఁదగిన వెరవులు చదువరుల చేత నెల్లపుడున్గావింపఁబడు, పులుము మొదలగుతెగుళ్లు తగిలినవారు (పష్ఠాదిరోగులు) కూడ నొడలు విడుచుట కొప్పుకొనరు. ఇప్పుడనే బిస్తు తెగులు (నరకవ్యాధి) నెవఁడుకుదుర్చుకొనఁడో యట్టి తెగులు గొంటు మంపు వొరవని సీమువ్వెజ్జ యేమి చేయఁగలడు ? ఈనిన పెద్దపులి వలె ముదిమొరయుండును, ఉసురు (ఆయువు) పగిలిపోయిన పనఁటిలోని నీళ్ళవలె తఱఁగి పోవుచుండును, పగతుని మాడ్కిఁదెవుళ్లులోఁబర్చుకొనుచుండును. కనుక నెవ్వఁడు తనకు మేలు మఱి మఱి చేసికొనఁజాలును. నొప్పి (దుఃఖము) చెలరేఁగకముందే, యెడుములురాక మునుపే, మైవంతులు (ఇంద్రియములు) చెడకముందే (వికలత పొందకము నుపే) మేలు కావించు కొనుటకలవాటు చేసికొనవలయును. గాలిస్తుట్టచుట్టవీల గును, మింటిన్మొక్కల చేయవలనుపడును, అలలన్మడి వేయవచ్చును, ఉసుఱున్నిల్పుకొని పూనిక హోదా (ఆస్థ) పనికిరాదు. తఱిచేత నేలకాల్చఁబడు చున్నది, వేల్పుల యిల్లు (మేరువు) కూల్చఁబడుచున్నది, కడలి నీళ్లింకింపఁ బడుచున్నవి, యొడలిమాట చెప్పనేలా ? రేపటిపని నేఁడు చేయవలయును, మలిపూటపని తొలి పూటచేయవలయును. పనియైనదాలేదాయని చావెదురు చూడద్దు. ముదిమితో్రివచూపు చున్నది. ముమ్మరించిన తెగులు మూఁకముం దేగుచున్నది, చావు పట్టిలోఁగొనుచున్నదింకనైన నేడుగడను (రక్షకుని) గనఁ డేమి ? పూరిపుడుక దబ్బనముతోఁ గ్రుచ్చి పొడిచి, ఇమ్ములమీఁదికోర్కి నేతితో దడిపి మక్కువ (రాగము), పగ (ద్వేషము) డిగ్గినుడికించివేఁచి మంది (మానవుల) నొ్పితు తట్టువముగలాఁడు (యముడు-మృత్యువు) న్దినుచుండును. పిల్లలను- ఈడు వచ్చిన వారలను, ముదుసళ్ళను, కడుపులోనిచూలు న్గూడనందఱినొ్పితు గుట్టముగలాఁడు పొదవుకొని యుండనీ నేల (జగత్తు) యిటువంటిది. మంది చేరికకు (సంగమునకు) మంచి చదువరి మందు.

ఇట్లు గరుడపురాణములోఁ జెప్పఁబడిన తీరున మన్కి మిన్కి (ఆయుర్వేదము) తెలిఁగింపబడెను.

# మన్కిమిన్కుల కుదురు - ఆయుర్వేదపీఠిక

ఒక్కొక్క దినుసు పెక్కు తెఱఁగుల లెక్కింపనలవిగాకుండును. చోటు తఱియాదులనబట్టి (దేశకాలపాత్రానుసారముగా) యెచ్చటి యేయీడుగల యే తెగులు గొంటునకు (రోగికి) దగునట్టేరకము మందివ్వవలయునో యట్లు తెలిసిచేయఁగల మందరియున్నచో నూట యిరువదేండ్లవరకు బ్రతుకదగి జంజాటము (సంసారము) నఁదగులు రెండుకాళ్ళ కన్నాకులు (మనుష్యులు) తెగులు గొంటులై (వ్యాధిగ్రస్తులై) యబ్బాటు చావులకు అపమృత్యువులకు లోనగుదురు కావున మందరి (వైద్యుడు) కాఁదగిన వాఁడెల్ల పాఁ్రఁజదువుల నారి దీరి పెండ్లి మానుకొనియేయుసుఱుల (జీవుల) నైననగ్గారింపక కలనైననల్ల వలుక కెప్పటికి న్దిఁగెఁబోండ్లజోలితలపెట్టక నేల నెల్లచోట్ల నెల్లమందులన్వెతకి తీసి తెచ్చి కూర్చుకొని యందందఁ దనకన్నఁ బెద్దలవలన నేర్చుకొనుచు నెవ్వరి వలననైన నెద్ది యున్నోరకెల్లప్పుఁడు న్వెలుఁగుఁజేనికి మొ్రక్కుకొనుచున్దలంచినంత నెల్లతెవుళ్ళ నోపిగొట్టుమిడియల (వేదమంత్రముల)ఁ జదువుచు మన్కిమిన్కి (ఆయుర్వేదము) లచొప్పున మందు దినుసు లందఱికగపర్చి తనవలె మందరులన్ వేన వేలన్వెలయించుచే కీడైన నంటక పగటివేల్పు లాగుననింగి నేలల నెల్లచోట్ల నల రారు చెప్పటికొప్పు మీఱఁదిరుగుచుఁ జెడుగులన్డిద్దుచు మంచివారల బ్రతుకు హాయిగాఁ బెంచుచుండవలయును.

# సర్వవిద్యాసారే దశమః సంపుటః

# మన్కిమిన్కి [ఆయుర్వేదము] కుదురు.

పడుచు (కన్య) తనకంటెఁ బెద్దవానిన్గాని తన యీడు వానిన్గాని తనతెగకుఁ (జాతికి) జెందినవాని పెండ్లాడవలయున్దనకన్న చిన్నవానిన్జెట్టవట్టకాలు దొ్రిక్కి (వివాహమాడ) రాదు. కూఁతురునకుఁగాని కొడుకునకుఁగాని తలిదండ్రులెంత.... సీమ (దూరదేశము) నెరవుకొన్నవారికి బెండ్లిచేసిన నంత హాయి కలుగున్గాని చేరువనున్న వారితోఁబెండ్లికావించిన యెడల జగడము వచ్చును. ఱేఁడు (క్షత్రియుఁడు - రాజు) గాని యయ్యవారు ఓజ్జ - పురోహితుఁడు (బ్రాహ్మణుఁడు) గాని యెట్లొడళ్లు తెగుళ్లు తగులకుండునో (ఆరోగ్యముగానుండునో) యట్లెల్ల తెఱఁగు మంది నడువడినొండొరుల గాపాడుకొనవలయును. ఆఁడువారున్మగవారలు నూడన్దొలు తన్మంచి నడువడి నలరా........ బ్రాఁజదువునారి ఱీఱి మేటి చదువరులై పిదప నింటికాఁపులై (గృహస్థులై) కలిమి (ఐశ్వర్యము) గాంచి పిమ్మట గాఱున నిరవుకొని (వానప్రస్థులై) కాఁక (తపస్సు) సలిపి తఱవాత బోడలై (సన్యాసాశ్రిమముస్దాల్చి) తొలుఁబలుకుల పాడి న్వెల్లడింపవలయును. ఎట్లుపగటిఱేఁడు (సూర్యుఁడు) వేల్పుచేఁ బుట్టింపఁబడి మెఱపు (విద్యుత్తు) వలె నెల్లదినుసుల (లోకముల) లాగుకొనుచు నింగినేలల నంతట నిండార నలముకొన్న మెఱవు (విద్యుత్తు) వలె నన్నిదినుసుల నణగియున్న యుసురులు జీవులు - పుట్టుక కలవారు (జన్మవంతులు) అని తెలుసుకొనవలయును.

ఓ యుసురులారా ! (ఓ జీవులారా !) మీరెపుడొడళ్న్విడిచెదరో యామేనులు తగుల బెట్టి బుగ్గియై నేలమొదలగు దినుసుల గలియ వలయును. మీయంత మీరు తల్లులమేనుల యందలి కడుపు తిత్తులఁ దూఱి (ప్రవేశించి) తిరిగి మేనుల తోఁగూడుచుందురు. చెడుతిండి (కుపథ్యము) కుడుపుల న్మానుకొనుటచేత నొడలుల్లములఁ దెగులు దగులనీక కాపాడుకొనుచున్నవారి మంచి కోర్కెలెల్లఁ దప్పక నెఱవేఱును. ఎల్లవారున్దను పెద్దలు నేర్పినతెన్నునఁ బాటుపడి సేద్యము - కమతము (కృషి-వ్యవసాయము) చేసికొనవలయును. ఊపిరినె గాదిగ గ్రిందు మీఁదులనరములనుండి మలపుకొనఁ గలిగిన యొంటికాఁడు (విన్నాణి-యోగి) తనయుల్లములో వేల్పున్గనఁగలఁడో యట్టికమతము (కృషి) సల్పువాఁడన్ని యిమ్ముల (సుఖముల) న్బొందఁగలడు.

అరకాండ్రా ! కమతకాండ్రా - కమతీండ్రా - కమ్మతీండ్రా - కాఁపులారా దుక్కిముచ్చులారా - పంటకాఁపులారా - రయితులారా-రహితులారా-

రైతులారా - సేద్యకాండ్రారా! మునుమేడిక మొదలగు నెల్లపైరుపెటు పని ముట్లు చేకూర్చుకొని కమతము - కమ్మరము - కినుక - జిరాయితి - దుక్కి - తెగుబడి, పంట - పాటు - పొలము - సాగు - సాగుబడి - సేద్యముచేసి, ఉల్లము నరికట్టుకొను నలవాటొనరించుకొనుడు. (యోగాభ్యాసము చేసికొనుడు) అందు వలన నేడి పండునోయద్దానినైకొని హాయిగాఁగడుపుఁడు. నేర్పరులగు కమత కాండ్రావు తెల్లన్గాపాడుకొనుచుఁ దెలివితేటలతో సేద్యము చేయుచుందురో వారికి మిక్కిలి యిమ్ము (సుఖము) కలుగును. పొలములో నంటరాని (అమేధ్య మయిన అపవిత్రమయిన) ఎరువు - ఎరుపు - గత్త - గత్తము - గొబ్బరము వేయఁ గూడదు. కాని కమ్మతావితోఁ బొదగిన విత్తనముల బాగుగా దున్నిననేం న్పదనెఱిఁగి చల్లవలయునందు వలన నొకట్లుమఁ దెవుళ్లుతగులని తీరుగా (ఆరో గ్యకరముగా) బండిన పంటలన్గుడిచినంత నలవుసుఖులేవు చెందును. నేర్పరి యగు నాడుదిగాని మగవాఁడుగాని తెలివితేటలతో నోపికపట్టి పండిన పంట తిను చు నెల్లతెవుళ్ళన్దవ్వుగా (దూరముగా) బాఱఁదరుమవలయును. ఎవ్వారైనన్గాని పూవులు మొదలగు తొడుకుల - తొట్టుల (పసరముల) న్గొట్టఁగూడదు చంప దగదు. పొద్దుపొడుచుట వలన (సూర్యోదయమువలన) నెట్లు రేయి తొలగి పోవునో యట్లే మందుల చదువు (వైద్యశాస్త్రము) చెప్పిన తీరుగా తగిన కూడు (పథ్యమగునన్నము) కుడుచుటచే తెవుళ్ళన్వేడల గొట్టించవలయును. అందరితో నొండొరులకు (సౌహార్దము) కూరిమి కొనసాగుటహాయి (సుఖము). కంటు - పగ (దౌహార్దము) చెలరేఁగుటయేవంత (దుఃఖము) కనుక నాఁడువారు మగ వారలెల్లరొండొరువులకు మేలుగా నడుచు కొనుచుండవలయును. నేలనుండిగాని నీళ్ళనుండిగాని మూఁడేండ్లకుఁబైగాఁబుట్టి పెరుగు మందు దినుసులన్సమకూర్చు కొని యునుఱు చదువు (ఆయుర్వేదము - వైద్యశాస్త్రము) చెప్పిన చొప్పున పుచ్చుకొనుచున్న యెడల నామందులోఁదలి యనరు (మర్మము) తెల్లనలముకొని (వ్యాపించి) తెగుళ్ళన్పోఁగొట్టి వెంటనే మేనికిమ్ముల (సుఖముల) న్గావించును. ఎల్లవారు న్నొలుదొల్తఁ జేయవలసిన పని మందుపుచ్చుకొనుట, మందుపని చేయ దగునట్లు కుడుచుట (పథ్యము) చేయుచుఁగట్టడితో (నియమముగా) నడుచు కొనుచు, మేనికిఁదెవులులేని కలిమి ఆరోగ్యసంపద న్జేకూర్చుకొనుటయే. తెవులు లేమి (ఆరోగ్యము) చేఁగాని పాడి (ధర్మము), ఒడమి (అర్థము), ముచ్చట - అక్కఱ (కామము), పెందెరువు - విడుపు (మోక్షము) సమకూర్చుకొనదగు చేవ (శక్తి) యెవ్వరికైనన్గలుగనేరదు. ఎటుల హరువిబ్బ (యవనాశ్వము) నెక్కిన రేఁకలు (జోదులు - భటులు) పగతుఱనోర్చి గెలుపొంది వేడ్కనోలలాడుదురో యట్లే యెల్లవుడున్మందు పుచ్చుకొనుచుఁదగిన కూడుకుడుచుచు (పథ్యము చేయుచు) మందచినడువడిన్గాని (జితేంద్రియులై) న వారలే తెగులున్దగులక (ఆరోగ్యవంతులై పెక్కేండ్లు మంచి బ్రతుకు హాయిగొందురు, (ఆనందింప

చుందురు. ఎటుల కాఁపువడ్డు (యువలు) మొదలగు మందు దినుసులు వాడు కొనఁబడి యొడళ్ళన్బెంచునో యట్లే తల్లులు తమ పిల్లలకుఁ జదువు చెప్పి మంచి నడత నప్పిసాక వలయును. ఎటుల మొనగాండ్రు (సేనాపతులు) మేటి నేర్పు పరులై దవ్వైన లాతి సీమలకు (దూరదేశములకు) వెళ్ళిపగవారలగెల్చి తమ ఱేండ్లకు (రాజులకు) ఆయావిలాతుల (దేశముల) దొరతనము (రాజ్యము) న్సమకూర్చెదరో (అప్పగించెదరో) ఆలాగుననే మీరు మేటి పందరులచేత బాగుగా నేర్పఁబడి మందు చదువు (ఓషధివిద్య) లో నారితేఱవలయును. ఏ పంచినాడున (దేశమున) మంచి మందు దినుసులు దొరుకునో తెలిసికొని తెచ్చుకొని తెవుళ్లు మాన్పుటకు వాఁడుక చేయవలయును. (ప్రయోగింప వలయును) మీ యిరుగులకుఁ గూడ నుప్పవలయును. మందిలోనందఱును మొట్టమొదటఁ జేయవలసిన పని తెవుళ్ళనుఱితించుట (నిదానము చేయుట), తెగుళ్ళ నాత్రన్పసమకట్టుట (చికిత్సచేయుట) తగిన తిండి (పథ్యము నేర్పచుఱాట). మందు దినుసు యోజయెఱుక (గుణజ్ఞానము) కలిగియుండుట, తగునట్లు మందులువాఁడి (ఉపయోగించి) యెట్లు తెవుళ్ళనోపఁగొట్టు వెరవునఁదమ బ్రతుకునఁ జేయదగిన పని యెల్లపుడు (పురుషార్థము) నొనసాగించు కొనుటన్నాదగును. కాపాడఁబడిన మొదవులు పాలతోఁదమలేఁగలన్మంది మొదలగు నెల్లమైతాల్పుల నెంచి చేవనలరించునో యాలాగుననే మందులు (ఓషధులు) ఓరెండు కాళ్ళ కన్నాకులారా! (మనుష్యులారా!) మీయొడళ్లనలంపులనూడ బాగుపర్చి విచ్చలవిడి నెల్ల పట్లనెగ్గించును. ఎవరైననాని మందులతోగూడు మొదలగునవి కుడువకుందురో వరుసగా (క్రమక్రమముగా) నలవు తెలువుల తగ్గుదల (బలవిజ్ఞాన హ్రాసము) నొందును గనుక మందులు చేవయెఱుకల నొబ్బదలించుకతము (బల విజ్ఞానాభివృద్ధి నిమిత్తము) మందులెల్ల తెవుళ్ళ నోపగొట్టి పిల్లనల్లులవలె నెల్లత నాపాడును. కట్టుపాటు (శాస్త్రము) చొప్పున మందు పుచ్చుకొన్నవారు వారల యొడళ్ళ వంతులన్నిటి నుండి (ప్రత్యంగమునుండి) తెగుళ్ళనాబఱదఱుమఁబడఁ గాతెవుళ్లులేని వారగుదురు.

ఆఁడువారు మగవారలు నూడగొప్ప మందులు వాడు కొనుచున్నట్టుత (నియమము) తోఁగవగూడ వలయును. చదువరులకు (విద్వాంసులకు) మందుల యెఱుక (ఔషధ విజ్ఞానము) సమకూర్చుకొనఁదగినది, ఎల్లవారును దవ్వులనాని చేరువనాని దొరికెడు మందులన్దీసితెచ్చుకొని వాడుకొని తెగుళ్ళనామన్పుకొని చేవ నొబ్బదలి హాయిగాఁబెక్కేండ్లు బ్రతికెదరుగాక. మందుమ్రాకులు వేళ్ళమోయఁ దప్పివ్వ బెరికివైచి విత్తనము లేకుండ జేయరాదు. ఏ మందు మొక్కలెంత పని పడునో (ఉపయోగించునో) యంతే తీసి తెచ్చి వాఁడు కొనవలయునొచులకను మచిచిక్కని తీగున మందుచెట్లనమ్మచ్చుమాపఁగూడదు, మందు మొక్కలు తెగలమిగుల్పవలయు. తక్కినవారామందులు వాడుకొని తమతమ తెగుళ్ళనాపుకొందురు.

మందరులు వైద్యులు ఏయేమందు లేయేపని చేయఁగలవో యేయే తెవుళ్ల న్మాన్పఁగలవో ముంముగాఁదములోదాము బాగుగా నడుగుట చెప్పుట (పశ్నోత్త రములను) నరసికూడఁబల్కుకొని యందఱొకేయేపాటు (నిర్ణయము) నకు వచ్చిన పిమ్మట తెగులు గొంటుల తెగుళ్లన్మాన్ని నెమ్మదిన్గావింప వలయును. మందరులలో నెవ్వఁడెక్కువ చదువరియో (విద్వాంసుఁడో) యతఁడందఱి కుసు ఱు తొలు చదువులు (ఆయుర్వేదము) న్నేర్పవలయును. ఎల్లవారెన్నిరకముల తెవుళ్లుండునో యన్ని దినుసుల మందులుకూడ కలవని తెలిసికొనవలయును. ఇదెఱుఁగని వారు తెవుళ్లనుమ్మదురఁబెట్టెదరు. తెవుళ్లన్మాన్పఁదగు మందుల నెఱిఁగినవారలాతెవుళ్లనోఁగొట్టుకొని హాయిగామనెదరు. కొన్ని మందుమొక్క లు వేళ్ళతోఁ గొన్ని కొమ్మలు మొదలగు వానితోఁ గొన్ని పువ్వులతోఁ గొన్ని యాకులతోఁ గొన్ని పండ్లతోఁ గొన్ని తమ వంతులన్నింటితో (సర్వాంగము లతో) తెవుళ్లన్విడిపించును గనుక నాయామందుదినుసుల న్దగునట్లు వాఁడుకొను తెఱఁగందఱు న్దెలిసికొనవలయును. మందులు వాడుకొనుట వలనఁదమచేవనేపు (అభివృద్ధి) కావించుకొని తమకున్దమ నారికి న్గాడపగల (శతృవుల) న్దుండ గిండర్రి (పాపాత్ముల) న్లోఁగొని (వశపర్చుకొని) మేనితాల్పు లెల్లరికి న్హాయి కలిగింపవలయును. ఓ రెండు కాళ్ళకన్నాకులారా! (మనుష్యులారా!) మీరు మందుపుచ్చుకొనుటవలనఁ బెక్కేండ్ల యుగము కలవారై (దీర్ఘాయువులై) హాయిగామనుఁడు. మంచి నడువడి నొప్పారుఁడు. మీతోడిమైతాల్పులన్గూడ మిమ్ముమవలె హాయిగా బ్రతుకనిండు. ఎవ్వరైన న్గానితమపగవాఁడగు మందరి (వైద్యుని) మందుగాని తమపగతుల చెలికాఁడగు మందరి (వైద్యుని వెజ్జు వేల్పు వెజ్జు) మందుగాని పుచ్చుకొనఁగూడదు. కాని యెవ్వఁడుసుఱుతొలు చదువుల (ఆయుర్వేదమందు - వైద్యశాస్త్రమున) నారితేరిన చదువరికన్నాకునకు నెచ్చెలియో యెవ్వరిపైన న్గంటు (ద్వేషి) కానోల్లఁడో యందఱికిన్నెమ్మే నల్పు చుండు హెత్తుకాడో (సహృదుఁడో) యట్టి దొడ్డవాని వలన మందుచదువు (ఔషధ విద్య) న్నేర్చుకొనవలయును. ఎల్లవారెప్పటి కలరారు ఆదట - ఆది - పాడి నొందుటకై (సత్యధర్మప్రాప్తి) కొఱకున్మందులు మొదలగు వాని న్దెలిసి కొనుటకున్గొప్పవేల్పు (పరమేశ్వరు) నెల్లపుడు న్గొల్చుచుండ వలయును. అందఱున్దిగ్గి........ మొదలగు వానితో గూడినయునికి (అగ్నియొక్క శుక్లాది స్వరూపము) కలదో దానిచేత న్దెగుళ్ళనోఁగొట్టవలయును. మేనులనవ్వాని వంతులన్గూడ (శరీరముల నింద్రియములన్గూడ) న్దెపులుతవులక కుదిరికనుండు నట్లు చేసి పనికతముల న్దెలుపుచదువు పల్కులనేర్పగన వలయును. మేర మీఱక తగిన తీరుగా తిండి మేలఁకువల (యుక్తములయిన యాహారము) న్గావింప వలయును. ఊద - ఊసి వానము - ఎతుసు - ఓర్వమి - కడుపుమంట - కడుపూఁద - కనుకుట్టుదనము - కాంతాళము - నూడు (ఈషణ్య) లేకెల్లరికి

న్మేలేసలుప్పుచుంమండే తెవుళ్ళన్దవులక హాయిగాఁదను కోరినన్నాళ్ళు బ్రతుకఁ
గలడు. ఇరుకుత్రోవలందు కాఱుడొంకలందు పగలు పొంచుండు దొంగల పాము
పులి మొదలగు కట్టడియుసురుల (క్రూరజంతువుల) న్మందులచేత నడిదములచేత
న్బొలయించ వలయును. ఎల్లవారలెపుడామని (వసంతఋతువు) వచ్చునో
యపుడు పువ్వులు మొదలగు చెట్టుదినుసుల కమ్మతావిన్గా.. చుండునవి. డిగ్గినీళ్ల
నేలలునిండుకొని యుండును, గనుక నెల్లెడల న్దిరుగుచుంట (విహారమునల్పుట)
యొడళ్ళకు మంచిది. పూఁదఱి వేసవులనడుమ (వసంతగ్రీష్మర్తువులమధ్య
కాలమున) నెల్లరు నీళ్ళతోనిండిన చల్లనిచోట్లఁజేరుకొనవలయు, నెచ్చట నొడళ్లు
డుకెత్తవో యెచ్చటి వేల్మి (యజ్ఞము) వలన వానకురిసి యందఱికిమ్మగునో
యచ్చోటు న్గొల్వవలయును. ఆమని (వసంత ఋతువు) యని (యుద్ధము)
చేయుటకనువగుతఱి ఆఁడువారు మగవారు వెలుఁగులఱేని (సూర్యుని) నలరించు
కమ్మతావి దినుసు వేల్చుట వలన నీళ్ళన్గాలిన్బాగుపఱచ తెవుళ్లు లేనివారై తమ
పిల్లలు నూఱేండ్లు బ్రతుకునట్లు పెంచవలయును. ఆఁడుది మగవాఁడు నొండొరు
లన్వలచి తమలోదాము మాట్లాడుకొని పెండ్లికావించుకొని (స్వయంవరమాడు
కొని) యొండొరులపై మిక్కిలి మక్కువ పెంపార నొండొరులకున్మేల్సలుప్పు
కొనుచు చదువుల విన్కి (శాస్త్రశ్రవణము) మందులు పుచ్చుకొనుచుంట (ఔష
ధసేవనము) యొప్పారఁజేయుచుండునది. వేల్మినొనర్చి వానన్గురి యుంపించ
వలయును. పుల్లతీఁగె (సోమలత) మొదలగు మందుదినుసుల న్దెచ్చి వాఁడు
కొనుచు (సేవించుచు)ఁదెగుళ్ళన్మాన్పుకొని హాయిగాఁబెక్కేండ్లు బ్రతుకుఁడు.
ఆమని (వసంతర్తువు), వేసవి (గ్రీష్మఋతువు), వానతఱి (వర్షర్తువు),
చల్లనితఱి (శరదృతువు), మంచుతఱి (హేమంతర్తువు), చలితఱి (శిశిర
ర్తువు) ఈ యాఱు తరుణముల (సమయముల) కనువగు కూడుకూర్కు
కూటములపట్లఁదగిన మందులు వాడుకొనుచుఁ దెవుల్దవులక హాయిగాఁ బ్రతుక
వలయును.

మందిలోనందఱున్గాడ (మనుష్యులెల్లవారును) కడుపులోని కిత్తి (జఠ
రాగ్ని) న్బొదలించుకొని (వృద్ధిచేసికొని) హద్దుమీఱక కూడుకూటముల కట్టడి
న్గావించుకొని గడుపుకొనుచు నెల్లపుడు న్దమయోపిక (బలము) నేర్పుకావించు
కొనవలయును.

రెండుకాళ్ళకన్నాకులు (మనుష్యులు) చదువరి మిన్నలన్వొంబడించి నింగి
నేలల నుండి మెఱుఁగు (విద్యుత్తు) న్గూర్చుకొని వింతపనుల (అద్భుతముల)
న్నెఱవేర్చ వలయును. ఉల్లములోనిది మేని వెలుపలిదిగాఁగిత్తి (అగ్ని)
రెండురకములు. కడుపులోని డిగ్గి (జఠరాగ్ని) తగునట్లు కూడు కుడుచుటచేత
వెలుపలిదైదార (బాహ్యాగ్ని) న్ద్రిప్పుటరగుల్చుట (మధించుట) చేతను దిన్సు
పర్చుకొని (యుక్తము కావించుకొని) చదువరులెల్ల వాఁడుకొందురుగాక.

అందఱున్మంచి పొత్తునన్బొంచి పొసఁగియేమఱిల్లక (ప్రమాదమునల్పక) తమమేని వంతులనోచుఁకొని (జితేంద్రియులై) బ్రతుకుహాయిగా బొడిగించు కొని దొడ్డనడువడినెమ్మెలఁగుచు నొండొరులకు మేల్సల్పుకొందురుగాక. ఎవ్వ డును మిన్కుమందు చదువు (ఆయుర్వేదము - వైద్యశాస్త్రము) తిన్నగాఁ జదువుకొని కొండ మొదలగు చోటులందలి మందుదినుసులు నీళ్ళు బాగుగానరసి (పరీక్షచేసి) యెల్లవారికి నెమ్మలుసల్పుటకై పొరనొరయక (కపటముమాని) తెవులున్గుదిర్చి మంచిమాట లాడుచుండునో యట్టిమందరినందఱాదుకొందురు - పాటింతురు (సత్కరింతురు) శివేనవచసా ॥ పాదుసా మొదలగు దొరకొల్వు నందలి వారందఱిలో మొనగాఁడు తెవుళ్ళన్మందు దినుసులన్బాగుగా నరసి గుఱితింప గలవాఁడగు మందరి నేలుబడి (రాజ్యమున) న్బొజులో (సేనలో) పెత్తనము చేయుచుఁజేవ (బలము) ఇమ్ము (సుఖము) న్గెఱచు తెవుళ్ళను అంకుఁబోతులగు నాఁడువారిన్మగవాండ్రి నడ్డవలయును. (నివారణచేయ వల యును). "అద్యవోచదధివక్తా॥" పిన్నతనమందే పెండ్లిచేసికొని కూటమిన్దేలుట చేతను అంకుసల్పుటచేతనుసుఱు (ఆయుదాయము) న్బోఁగొట్టుకొనఁగూడదు. "మానస్తోకే"॥ కారు - లొంక - కొండలోయ - ఎడారి - తోఁటకాఁపులకుఁ గూడ విడి మందు మాఁకులన్బెరిగింప వలయును. "నమోరోహితాయ॥" మొక్కల కారుతోఁటల (వనముల) నఱికివేయరాదు, "నమఃకృత్స్నాయత యా"॥ దొరమందరులు (రాజవైద్యులు) మొదలగు చదువరులెల్ల మంచి నడత, తగిన మందులు వాడుకొనువెరవు, ఉగ్గడ (నీతి) నందఱికిన్మప్పి, కైమెలపు (హస్తక్రియా కౌశలము) చేతఁగోఁత (శస్త్రచికిత్స) చేసి తెవుళ్లన్మాన్పిమేలు కావింపవలయును. ("యాతేరుద్రశివాతనూః" ॥) నిక్కముఃవారలెల్లప్పుడున్ హాయిగా నుందురు. "ఋతంచమే మృతంచ॥" ఎఱ్ఱవడ్లు (వ్రీహి) మొదలగు తిండిదినుసుల బాగుగాఁబొగచిన (సంస్కరించిన) వంటలు తగునట్లుతాముతిని తమవారిన్దిని పించవలయును. "వ్రీహయశ్చమేయవాశ్చమే" వడ్లు, కారువడ్లు, మినుగులు, నువ్వులు, పెసలు, కొబ్బర (ఖల్వము) సనిగలు, కొఱ్ఱలు (ప్రియం గువులు) సన్నబియ్యము, గడ్డివడ్లు (చామలు), (నివ్వరి), సైదము (గోధుమ పిష్టము). చిఱుసనిగలు (మసూరములు) ఈ తిండి దినుసులు తిన్నఁగావండు కొని తినవలయును. ఉసుఱు (ప్రాణము) మెఱపు (విద్యుత్తు) నింగినేలలందెల్ల నుఁడి కూర్చుని పెక్కేండ్ల బ్రతుకున హాయిగానలరారవలయును. "మిత్ర శ్చమ ఇంద్రశ్చమే" నేనేలాగున మందుల చదువు (వైద్యశాస్త్రము) సృష్టి యాఁకలి దప్పికలు తీర్చుకొనుట కూడు నీళ్ళు కూచుఁకొనఁజాలుదునో యట్లో వేడి వేల్పానన్ను నడుపుము. "సం మాం సృజామి" ఎవరుబీళ్ళనుండి. నేలనుండి. మంచిపస (రసము) న్దీసికొని తినుచుఁదాగ్రుచుందురో వారలు తెగులు తగుల కెల్లచోట్లఁదమపనులు నెఱవేర్చు కొనుటకై రాకపోకలు సల్పుకొనఁజాలి.

పెక్కేండ్లు హాయిగా బ్రతికెదరు. “పయఃపృథివ్యాంపయ ఓషధీషు” ఎవఁడు నిప్పు (అగ్ని) వలెఁబగతుఱనెగఁ గాల్చునో మందులాగున హాయి సల్పునో యట్టివాఁడే యేలుబడి నెల్లఁగాపాడఁజాలును. ‘‘ఋతాషాడృతధామాఽగ్నిః” అందఱున్బగటి వేల్పు మినుకుల (సూర్యకిరణముల) తగునట్లు కొలిచి చదువు (విద్య) మగటిమి (శౌర్యము) పెంపారఁదమపనులు నెఱవేర్చుకొనవలయును. “సంహితో విశ్వసామాసూర్యోగంధర్వః” అందఱు న్జాబిలి గుఱ్ఱపు చుక్క మొదలగు నిరువదెన మండ్రువేల్పువెలయాండ్రు (అచ్చర) మినుకులన్నివడఁ గొలుచుకొనుచు నెమ్మి (సుఖము) నైకొనవలయును. “సుషుమ్ణః సూర్యరశ్మి శ్చంద్రమాగంధర్వః” ఒడలిలో నెంతపని సల్పుకడిమితెంపులు పొడమునో యంతయున్గాలివలనఁగలుగును. గాలులే యుసుఱుపొడలు (స్వరూపములు) హాయిగా బ్రతుకు నడుపుచుండునని యందఱున్దెలిసికొనవలయును.

“ఇషిరోవిశ్వవ్యచాహితోగంధర్వః” ఆఁడువారుగానిమగవారలుగాని వెలిచవి (వ్యభిచారము), తగని తిండి, కూడనితిరుగుడు (విహారము) హద్దుమీరినపూటమి కోర్కె (అతివిషయాసక్తి) మొదలగు చెడుగులకులోనైతమ ఉగము - ఉసుఱు - మనన (ఆయువు) న్దగ్గించుకొనఁజనదు.

“తత్వాయామిబ్రహ్మణా” ఎవఁడుతగవరియై (న్యాయవంతుఁడై) ఓర్పరియై (క్షమావంతుఁడై) తగినమందులు పుచ్చుకొనుచు, మంచితిండి తిరుగుడుల కలవడి, చెడుకోర్కెలనుండి యుల్లమునరికట్టి (జితేంద్రియుఁడై) యొప్పారుచుండునో యట్టివాఁడు నూఱేండ్లు హాయిగా బ్రతుకఁగలఁడు.

“దివోమూర్ధాఽసి” కమ్మనితావిగల యావునెయ్యి మొదలగు మంచిదినుసులు డిగ్గి (అగ్ని)లో వేల్చఁగా గాలిలో నామంచితావి గలిసి చుట్టుపట్ల నుండు వారందఱి తెవుళ్ళన్మొదలంట న్బెఁగొట్టు నట్లెల్లరున్దలకొన (ప్రయత్నింప) వలయును.

‘‘అగ్నిరస్మిజన్మనా” అందఱున్మందు చదువున్బట్టి మందులుచేసి పుచ్చుకొని తెవుళ్ళన్బెఁగొట్టుకొని నెమ్మదిన్బొందిపాడి, యొడమి, కోరు, పెంపొవ్రల (ధర్మార్థకామమోక్షముల) న్బొందవలయును.

“స్వాద్వీంత్వాస్వాదునా” మంచి మందుదినుసులు నీళ్ళన్మఱిగించి తీసిన నిగ్గుపుచ్చుకొని యందఱున్దమ కడుపుకిత్తి (జఠరాగ్ని) బాగుచేసి కియలవు నెమ్మదుల (బలారోగ్యముల) హెచ్చు కావించు కొనవలయును.

"పరితోషించవత్తా" ఏయేమందులు నేలలో, నీళ్ళలో గాలిలోఁబుట్టుచున్నవో క్రొత్తపాత్రత తెవుళ్ళ నన్నిటిన్గడువడినోర్పఁగొట్టఁగలవో యవి యన్నియు న్గూర్చు కొని యనుంగుల (మిత్రుల) వలె నెల్లపుడు న్వాడుకొనవలయును.

"వాయోఃపూత్యఃపవితేత్రిణ" ఎవడుగాని చదువు (విద్య), చేవ (బలము) కఱద (బుద్ధి) యేపాదుటకై పసతేనికూడు (నీరసాన్నము) నెప్పుడున్గుడువరాదు. గొప్పమందుల నిగ్గే పుచ్చుకొనవలయును.

"బ్రహ్మచుక్షత్రింపవతే" ఎంతవలకెవ్వరైన దబ్బునననతిగెడు తిండి తినుచు, మంచి మందులు పుచ్చుకొనుచు గూటమిపట్లఁగట్టడిన్నడుచు కొనుచు (బ్రహ్మచర్యమున్నలుపుచు) ఒడలు, చేవ (బలము), కఱద (బుద్ధి) హెచ్చించు కొనఁజాలరో యంతదనుక నెల్ల యిమ్ముల (సర్వసుఖముల) న్గననేరరు.

"దేవాయజ్ఞమతన్వత" పడుచులెల్ల (కన్యలందఱు) కూటమినొల్లక (బ్రహ్మచారిణులయి) తంత్రము (వ్యాకరణము), పాడి చదువు (ధర్మవిద్య) మన్కిమిన్కు (ఆయుర్వేదము), లెస్సగాఁ జదువుకొని తామెంచుకొన్న కోడె గాండ్రవెల్లడిగాఁగోరి పెండ్లాడి (స్వయంవరముచేసికొని) మంచి తినుబడి దిను సులు మందులు న్వండి పానకములతోఁగల్పి పెనిమిట్లు మొదలయిన వారికిఁ గుడిపి తాము కుడిచి చేవ నెమ్మదుల (బలారోగ్యముల) యేపు (వృద్ధి) న్గావింప వలయును. ఏ చదువరులు (విద్వాంసులు) గొప్పమందుల నిగ్గు న్గాముకుడిచి తమ వాళలకిడుచెల్లపుడుబ్బుచుందురో (ఆనందించు చుందురో) వారే మేలైన వారు (ధన్యులు).

"యస్తేరసః" ఉసుఋతాల్పుచే (ప్రాణిచేత) యేది తినఁబడునో యది వరుసగా (పరంపరగా) విత్తనమై (శుక్రమై) యొడలికతమగును. (శరీరకార ణమగును). మగవానికామ (ఉపస్థేంద్రియము) ఆఁడుదాని కలయిక వలన (స్త్రీసంయోగముచేత) విత్తును (రేతస్సును) విడుచును. వేఱుచోటున్గాల్మడి (మూత్రము) న్పోయును. దీనిన్బట్టి మేనిలోనుచ్చ యున్నచోటికి వేఱుతావున విత్తనము (రేతస్సు)ండునని తెలిసికొనవలయును. ఆవిత్తనము మేని యెల్ల వంతులనుండి (అన్నియంగములనుండి) పొడమున్గనక నొడలి యన్నివంతుల పోలిక (సర్వాంగాకృతి) న్వెలయించును గావుననే యెవని యొడలినుండి విత్తు కలుగునో యాపోలికగానే బిడ్డలు కలిగెదరు.

"రేతో మూత్రిన్ది జహాతి యోనింపవిశదింద్రియమ్" ఎవడు మందుల చదువు (వైద్యశాస్త్రము) చొప్పున మంచి మందులు చేసి తరుణమునకుఁదగునట్లు

(యధాకాలము), పుచ్చుకొనవలసిన తీరుగా (యధాయోగ్యము) దార్రిగునో వాఁడుతెవుళ్ళంటక తనమై యుల్లముల యలవు (శరీరాత్మబలమును) హెచ్చు చేసికొనఁగలుగును.

"దృష్ట్వాపరిసుర్రితోరసం శుక్రేణ" మందరి ముందుగాఁదనకున్న తెగులు న్దాను మాన్పుకొని యేతెగుళ్లున్లేనివాఁడై తరవాత నొరుల మొదలి తెగులున్దెలిసి కొని వారలకు నెమ్మది - నిమ్మళము (ఆరోగ్యము) న్గలిగింప వలయును.

"ఇంద్రఃసుతార్రిమా" వేఁపుడు (ధానములు), పెరుగులో నానవేసిన పేలలు - పేలాలు (కరంభము), జాజాము - జాజము (పాలిక - పరీవాపము) పాలు, పెరుఁగు ఇవిడిగ్గిలో (అగ్నిలో) వేల్చఁదగిన యిగిరిక (హవిసు) జున్ను గడ్డ (ఆమిక్ష), మీగడ - మీవడ (వాజినము) ఇవన్నియు న్దినుబడిదినుసులనిగ్గు.

"ధనాఃకరంభః" మందుచదువు (వైద్యశాస్త్రము) తెలిసిన పెనిమిటులాంధ్ర నాండుర్రిపెనిమిటల మందిచ్చి తెగుళ్లు మాన్పి బాగుచేయవలయును.

"తదశ్వినాభిషజా" ఎవరు చెడుగుల పొత్తుమానుకొని వెలిచవి (వ్యభి చారము) లేక తమవిత్తనము (వీర్యము) హెచ్చించుకొందురో వారు బిడ్డలన్గని తమ పదుగు (కులము) న్లెస్సకావించుకొందురు.

"పయసాశుక్రిపుష్కృతమ్" మూతితోమూతి (ముఖమునకు ముఖము) కన్నులతో గన్నులు, డెందమున డెందము (మనస్సునకు మనస్సు) మేనికి మేను (శరీరమునకు శరీరము) ఒండొరులు బిగియఁగలుపుకొని తప్పక రొడు పగునట్లు కూటమినోలలాడ వలయునట్టి నమ్మకమగు కలయిక వలన పుట్టిన బిడ్డ మిక్కిలి యందముగ నుండు సుంతయురోఁత (కురూపము) గా నుండదు.

"ముఖం సదస్యశిరఇత్" తగిన తిండి నడతలచేత నెల్లపుడొడలిడెందముల న్దెగులు తగుల నివ్వక తమపుట్టువీడేర్చుకొనుటకై పెరుమాళ్ళ గుఱించి పాట (హరికథాగానము - ఈశ్వరగుణగానము) పాడవలయును.

"బృహదిందార్రియగాయత" మందరిమిన్న (వైద్యరాట్టు) మంచిచోట్లఁ బుట్టి మందులు తెచ్చి నిల్వచేసి తెగులు గొంటుల (రోగుల) కిచ్చి వారి తెవుళ్ళ నోఁగొట్టవలయును.

"అధ్వర్యో అద్రిభిఃసుతమ్" ఆఁడువారుగాని మగవారలుగాని మందు చదువు (వైద్యవిద్య) నెఱుఁగకుందురో వారు తెగుళ్ళన్మాన్పుటకుగాని మంచి నడువడి నెల్లపుడు న్గొనుటకుఁగాని చాలరు - పనికిరారు.

"తనూపాఖిషజా" మందరులు (వైద్యులు) రెండు తెఱఁగులందొక్క తీరు వారు వేఁకి మొదలగు (జ్వరాదులగు) మేని తెవుళ్ళన్మందుల వలన న్మాన్పెదరు- రెండవరకమువారు డెందము తెలివిలేమి (మానసావిద్య) మొదలగు తెవుళ్ళనోఁ గొట్టునయ్యవార్లు (అధ్యాపకులు) మంచి తెలుపువారు (ఉపదేశకులు) ఎచ్చట నీరెండు తెఱఁగుల మందరులుందురో యచ్చట నైవుళ్ళలేమిచే నెల్లయుసుఱు లందఱు (సర్వప్రాణులు) మేని డెందమునలుఁకువలనొంపొందక హాయిగా నుందురు.

"ఇంద్రాయేందుగుం సరస్వతీ" ఫురువుపట్టిన కీడు చేత నక్కిన తెవుళ్ళ చేత నోడగును.

"ప్రజావతీరనమీవాఅయక్ష్మా" మీగడ పెరుగు విత్తనము (వీర్యము) న్పెంచును.

"సోమేనత్వా ఒఒ తన చీర్మంద్రాయదధి" ఎగయూపిరి (ప్రాణము) దిగ యూపిరి (అపానము), ఒడలంతటనలమిన యూపిరి తిన్నగానాడుచున్నవాఁడు పెక్కేండ్లు బ్రతుకును.

"ప్రాణాయత్వా ఒపానాయ" మందు దినుసులు బాగుగాఁబొడి కావింపఁ బడిమంచినీళ్ళలోఁగలుపఁబడినపుడు కోరినట్లుపని చేయును.

"సంకసామిసమాహో అద్భిరగ్మత సమోషధయోరసేన" రొట్టె మొదలగు వంటకములు బాగుగా నుడికించవలయు, మాడ్పఁగూడదు. చవులూఱ వండ వలయును.

"ఆగ్నేహవ్యంరక్షస్వ" మందుమూఁకలు మఱచి గుర్పుతుకు ఏలులేనట్లు వేళ్ళనుండియునొమ్మదలంటఁబెఱికి వేయఁగూడదు.

"జివ్యోషధ్యాస్తేమూలం మాహింసిషమ్" ఆవు పాలన్ని మందులలో మిక్కిలిమేలు.

"మహీనాంపయోఒస్త్రోషధీనాంరసః" పగటి వేల్పెటు చీఁకటినోఁగొట్టి యుసుఱుతాల్పుల (ప్రాణుల) కు హాయి నల్పునో యట్లు చదువరులందఱు కెల్ల తెగుళ్ళన్గుదిర్చి యుమ్మ (సుఖము) కావింపవలయును.

"శనోభవంతువాజినోహవేషు" చదువరులు తమ నేర్పు (విద్య) చేత నెల్ల వారి యుల్లముల (ఆత్మల) నలరించి ప్రకాశింపఁజేసి పెక్కేండ్లు బ్రతుక గల వారిన్గానల్పవలయును.

"సమిద్ధో అగ్నిః" ఎవరు మంచినడువడికలవారో యెవరి పలుకు చదువు నప్టి మేలైయుండునో యట్టివారలు పెక్కేండ్లు బ్రతుకఁదగుదురు.

"తనూనపాచ్ఛుచివ్రతః" ఎవఁడైన నానిమింటనున్న గాలి మొదలయిన దినుసులు లేక బ్రతుకఁజాలడు.

"దుకోశేవివిజీశో" మందరు (వైద్యు) లెట్లు తమ యొక్కయుఁదక్కిన వారియొక్కయు నైవుళ్ళనోర్చఁగొట్టి తమకున్దమవారలకు న్గూడ నొకమి కలిగించె దరో యటులేయందఱున్గూడ నడుచుకొనవలయును.

"దైవ్యాహోతారాభిషజా" ఎవడెల్లతెవుళ్ళన్మాన్పు మందులు పుచ్చు కొనుచు మంచి పుస్తుల నాల్చు చుండునో యతఁడు హాయిగాఁ బెక్కేండ్లు బ్రతుకును.

"శమితానోవనస్పతిః" ఎవరు దబ్బునణగెడు తిండి (సుపథ్యము) తినుటు చేతను మంచి మందు పుచ్చుకొనుటచేత నైవుళ్ళన్పాన్పు కొందురో వారల కోరిన కలిమియునుఱు (ఆయువు) న్గూర్చుకొని హాయిగమన్నెదరు.

"స్వాహాయజ్ఞంవరుణః" ఎవరు సిగ్గఱుల (సిగ్గులేనివారల) నదల్చుచుం దగువారల న్గొండాడుచు మంచి నీళ్ళతో మందులు పుచ్చుకొందురో వారలలవు ంపాదుల (బహారోగ్యముల) న్బొంది కలిమి (ఐశ్వర్యముతో) నలరెదరు.

"హోతాయక్షన్నరాశసమ్" అందఱున్దమ విత్తనమున్గాపాడు కొనుటవలన (బ్రహ్మచర్యము చేత) నొకలి యుల్లముల చేవన్గలిగి చదువరుల న్గొల్చుటచేత తెలివి తేటల కలిమిన్గొని మంచి తిండి మందులన్గుడుచుటన్బట్టి తెవుళ్ళన్మాన్చు కొని నెమ్మది (ఆరోగ్యము) నొందవలయును.

"హోతాయక్షదిడేడిత" రెండు కాళ్ళకన్నాకులు (మనుష్యులు) చదువు నేర్పులతో నెల్లడినుసుల వలన మంచినిగ్గు న్దీసి కొని గాలిడిగ్గుల (వాయ్వగ్నుల) వలె నెల్లచదువుల నెమ్ముల (విద్యాసుఖముల) పంచిపెట్టవలయును.

"హోతాయక్షద్బర్హిః" అందఱున్నివైపులగుమ్మముల న్గలిగి యెల్లఋతుల (ఋతువుల) నెమ్ములిడునిండ్లన్గట్టుకొని నిండు హాయిన్గనవలయును.

"హోతాయక్షద్దురోదిశః" ఓరెండు కాళ్ళకన్నాకులారా! (ఓమనుష్యు లారా!) ఎట్లు రేఁబగలు వెలుఁగుజేఁడు జాబిల్లులన్నిటి నలరించు చుందురో యొప్పులేయీడుల (రూపయౌవనముల) నలరునాండ్రు మగలన్గొల్చుచుందురో, వంట నేర్పుకలవాడు వంటనేర్పుచుందురో యటుల మంచి న్వెల్లడించి యందఱికి న్మేలు చేయుఁడు. తిండి దినుసులాయితపెట్టుఁడు (సిద్ధము చేయుఁడు).

"హోతాయక్షద్దుషేశ సోషేనక్తందివా" ఓచదువరులారా! (విద్వాంసు లారా!) మంచి (వెజ్జురాండ్రు) దినుసులతోలుచదువుల (ఆయుర్వేదము) నేర్చిన పొలఁతులు (స్త్రీలు) తగినపనుల నెఱవేర్చుటకెట్లు పూనుకొందురో మందరు లెట్లు తెగుళ్ళన్మాన్పి యొడళ్ళ చేవనైచ్చు కావింతురో యట్లు నడుచుకొని మీరందఱు న్హాయిగొనవలయును.

"హోతాయక్షద్దై వ్యాహోతారాభిషజాశ్వి నేంద్రం" ఎక్లైముక, మూలగ (మజ్జ) విత్తనము (వీర్యము)లు మేనిపనులన్నడుపుచున్నవో, యేలాగునఁ బగటి వేల్పు మొదలగుమింటి వెలుఁగులు న్పలుకుచెలి (వాణి) యెల్ల యుసుఱుల (ప్రాణుల) న్వెలుపుచున్నవో ఓరటులేయగుచు నింగినేలల పన్నుగడ చదువు నేర్చుకుని (సృష్టివిద్య) న్దెలిసికొని యచ్చుకుప్పలు (శ్రీమంతులు) కండు.

"హోతాయక్షత్త్రిస్రో" ఎవ్వరు చదువు, పనినేర్పు, పూనిక(ప్రయత్నము)ల చేత డిగ్గిమొదలగు (అగ్న్యాది) పలుకు (విద్య) న్దెలిసికొని యావులు దొడ్డి (మొదలగు) పాఁడి తొడుకు-తొఱ్ఱుల (పసరముల) న్గాపాడుచునందఱికిన్మేలే చేయుచుందురో యట్టివారలు మందరుల (వెజ్జుల-వైద్యుల) వలె నెల్లయిడుమల (దుఃఖముల) న్బోఁగొట్టెదరు.

"హోతాయక్షద్వనస్పతి" ఎవరుతొఱ్ఱులలెక్క(పశుసంఖ్య) న్పెంచి యొళ్లు పెట్టించెదరో (బలియఁజేసెదరో) వారు తాముగూడ మిక్కిలి లావరు (బలిష్ఠు) లౌదురు. ఎవరాల చిక్కనిపాలు నెయ్యిపుచ్చుకొనుచుందురో వారలు మువ్వపుపాడి (కోమలప్రకృతి) కలవారగుదురు. ఎవరు కమతము (కృషి) మొదలగు పనుల కెల్లస్బానుచుచుందురో వారలు డబ్బుగింజలు (ధనధాన్యములు) కూర్చుకొందురు.

"హోతాయక్షదాశ్వినా" ఎవ్వరు మంచివారి పొత్తుచేతఁ జెనఁటుల(దుష్టుల) నడ్డగించి (నివారించి) తగిన తిండి నడువడులకలవడి నెమ్మది - తెవులులేమి (ఆరోగ్యము) న్గొని పాడి (ధర్మము) న్గొల్చుచుందురో వారు చేయఁదగుపనిన్జేసినవార (కృతకృత్యు)లగుదురు.

"హోతాయక్షత్సరస్వతీం" మంచిమందరులు (సద్వైద్యులు) తమయొక్కయు న్పైవారలయొక్కయు నొడళ్లన్గాపాడి యెట్లువుంచెదరో యాలాగున నెల్లరు నొడమి (ధనము) కూర్చి హెచ్చుకావించవలయు నందువలన నీపుట్టుక (సంసారము)లో సాటిలేని యిమ్ము (సుఖము) కలుగును.

"దేవీజూ౽హూతీ" ఎట్లుచదువరులలోఁ జదువరు లిరువురువేల్పు మందరికవ (అశ్వులు - అశ్వినీదేవితలు) తగినపని (సత్క్రియ) చేతనెల్లరి న్దెగుళ్లన్మాన్పి నెమ్మదిన్గావించి తెలివితేటల నఱరించుచుందురో యట్లందఱున్దమతోడి పాటివారలకు జదువొడము (విద్యాధనంబు)ల న్గూడఁబెట్టవలయును.

"దేవాదేవానాంభిషజా" ఎవరు మందులు కలుపు నేర్పుగల మందరులై కుట్టియగాలి (అపానము) కొఱకు మేఁకపాలు, గొంతు (వాక్కు) హెచ్చుటకై గొఱ్ఱె పాఁడి, కలిమి (ఐశ్వర్య) పెంపునకై యావుపాలు, తెవుళ్లన్మాన్పుటకు మందులపన న్గూర్చుకొని బాగుగాఁ గూడు (అన్నము) వండుకొని తిని యలవు

మించి (బలముకలవారై) చెడుగుపగఱన్గట్టి పెట్టెదరో వారల గొప్ప యొ శ మి (పరమైశ్వర్యము) న్గొనెదరు.

"అగ్నిమద్యహోతార మశ్వశితాయం యజమానః" ఎవరు చ దు వ రు ల పొత్తుచేతఁ జదువరు (విద్వాంసు) లై నిక్కమేవినెదరో నజే (సత్యమే) కనెదరో సింగినేలతేలెడు వేల్పుతేనిన్గొనియాడెదరో వారుహాయిగా బెక్కేండ్లుబ్రతికెదరు. (దీర్ఘాయువులయ్యెదరు).

"భద్రాం కర్ణేభిఃశృణుయామ" చదువరులైనవారు (విద్వాంసులు) ఎండ గాలి తగులునటుల వచ్చుతీరున నెత్తుగా నిండ్లుకట్టుకొని యంమనెలకొని వలసిన తిండిదినుసు నిల్వచేసికొని హాయిగా బ్రతుకవలయును.

"ఉద్వాతేజాత మంధసా" ఓరెండుకాళ్లకన్నాకులారా! (మనుష్యులారా!) చెలికాఁడు, తెగుళ్లన్బోఁగొట్టువాఁడు, మంచి (శ్రేష్ఠమైన) మందిచ్చువాడు, ఆస్తిసొదరుల (ధనైశ్వర్యముల) హెచ్చుకావించువాఁడు నగుమందరి (వైద్యుని) న్గొల్చియొడలు, దీమసము, డెందము, మేనిచెలువులు (ఇంద్రియములు) చేవహెచ్చునట్లొనరించుకొని యెక్కువ కలిమి (పరమైశ్వర్యము - సంపద) నైకొనుడు.

"హోతాయక్షత్త్వష్టారమింద్రమ్" అన్నివైపులనుండి బాగుగాగాలివచ్చు తెఱఁగునఁబెక్కు గుమ్మములున్నయింట నిరవుకొన్నవారికి బ్రతుకు, మడి, చేవ, నెమ్మది (జీవనము, పవిత్రత, బలము, ఆరోగ్యము) పొదలుచుండును (వృద్ధియగును). గనుకఁబెక్కు గుమ్మములు - గుంభములు - వాకిళ్లు - సరబడులు (ద్వారములు) గల పెద్దయిండ్లు కట్టుకొనవలయును.

"దేవిర్ద్వారోవయోధసం" ఎవరు తమకోర్కెలన్నెఱవేచుకొన నెట్లుపూను కొందురో యట్లే తమతోడిపాటివారి కోరికలు కూడ కొనసాగనెంచుచు దమకు మేల్కలుగఁగోరునట్లు పైవారికిఁగూడ మేల్కలుగనెంతురో యట్టివారు తమకోరిన న్నేఁడ్లు హాయిగా దప్పక బ్రతికెదరు.

"అన్విదనుమతేత్వం మన్యాసైశంచనస్కృధి" ఎవరుతమువలెఁ దమతోడి పాటివారలనెల్లఁజూచుకొందురో చదువరుల పొందుకల్ల నిక్కముల నరసియేపఱచెదరో వారలు గొప్పయునుఱు (దీర్ఘాయువు), నింపుచదువు, కొనసాగు కలిమి (సమగ్రైశ్వర్యము), ఎల్లెడల నెలుపున్గొనుచుందురు.

"ఆయుష్యంవర్చస్యం" ఎవరు తమతొలియీడు కూటమినొల్లక (బ్రహ్మచర్యముచేయుచు) నిండుచదువు నేర్చుకొందురో వారి చదువును దొంగలు దోచుకొనఁజాలరు. పంతువుచ్చుకొనలేరు. (దాయలుండరు) మోపికకానేరదు (భారముకాఁబోదు), ఈతీరుగానే చదువరులు మంచినడువడిన్గొందురో వారుచదువరులలోఁ బెక్కేండ్లయుగము ఉనుఱు (ఆయువు) న్గొనితామెల్లపుడున్బొంగారుచు నొరుల

నలరింతురు.

"నతద్రక్షాంసినపిశాచాస్తరంతి" ఎఱ్ఱయుత్తను. ఉత్తరేణిమొక్క (అపామార్గము) దొట్టిమందుదినుసులెట్లు తెవుళ్ళనెల్లఁబోఁగొట్టియుసురుల (ప్రాణులకు) హాయిగొల్పునో యటుతాము దొసఁగుల (పాపముల)కోసరిల్లి నొరులన్గూడ దొసంగుల (పాపముల) నుండి మళ్ళించిన వారేమందిన్మడి కావించువారు (పవిత్రీకరులు)

"అపాఘమపకిల్బిషమపకృత్యామపోరపః అమార్గ" తగులము (రాగము), పగ (ద్వేషము) మొదలగు అయిపు - ఆగడము - ఎగ్గు - ఐపు-ఒప్పమి- ఒఱరు - కల్ల - కీడు - గొడవ - డొగరు - తప్పితము - తప్పిదము - తప్పు - తీఁపురము - దుండగము - దుండఱికము - దుడుకు - నెరసు-నేరమి-నేరము - నొంటు (దోషము)ల న్విడిచిపెట్టి తమ్మున్వలెనెల్లరన్జూచుకొందురో యట్టిమంచి వారికి నీళ్లుమందులు దొట్టి (ప్రకృతి) దినుసులు (పదార్థములు) హాయి (సుఖము) నిచ్చును. తమయందున్గూర్మి (స్వాత్మప్రీతి), యొరులపట్లఁగిట్టమి - పగ - (ద్వేషము) కలవారికిఁదప్పకకస్తి (దుఃఖము) చేయును.

"సుమిత్రియాన ఆపఔషధయఃసంతు" వేలుపేర్పఱిచినతీరున మంచిచేయఁదగినది (ధర్మాచరణముకార్యము) చెడ్డమానవలసినది. (అధర్మాచరణము త్యాజ్యము) అనిహద్దుమీఱక తగవు - తీరు - తీరుపు - తీర్పు - నెఱి - పాటి - పాడి - నొఱిక (న్యాయము) మానిపైవారి ఇస్తువుహక్కు (సొత్తు) తీసికొనకుందురో యట్టిమంచివారు తెగులు తగులకనూఱేండ్లు బ్రతుకఁజాలెదరు.

"ఇమంజీవేభ్యః పరిధిందధామి" ఎవరుచెడ్డచేయక చెడుగులతోఁగూడకుందురో వేల్పుకొల్పు సల్పుచుందురో వారుకావలసినంతడబ్బు (ధనము) తినుబడి దినుసులు - గింజలు (ధాన్యము) కలిగి పెక్కేండ్లు బ్రతికెదరు.

"ఆయూంషిపవస", అందఱున్వేల్పు పంపున్బట్టి నడచుకొనుచు న్దగుతిండి నడుపడులతోఁ బెక్కేండ్లు హాయిగా బ్రతుకుచుందురుగాక.

"దృతేదృహమాజోక్తేసందృశి జీవ్యాసంజోక్తే" నీళ్లుమొదలగు మందులాయాయిచోట్లు తఱులకుఁ దగునట్లు పుచ్చుకొనుచున్నవారికి మేలుచేయునట్లు చేయనివారికిఁ గీడొనరించును.

"సుమిత్రియన ఆపఔషధయః" మందియందఱునోర్మిమరులుగా కంతయున్గనిపెట్టు తగవరివేల్పు (న్యాయాధీశుఁడగు పరమేశ్వరు) నతనిసెలవు (అనుజ్ఞ) న్గైకొని మన్నించి మంచిపనులు సల్పుచు న్జెడుగుల న్విడనాడి కూటమిన్దగులక (బ్రహ్మచర్యవ్రతముతో) చదువునేర్పులనారితేఱి విత్తనము (ఇంద్రియము) న్గాపాడుకొనుచుఁ బటాబునఁగలుగు చావు (అపమృత్యువు) న్దగిన తిండినడువ

డుల వలన నడ్డుకొనుచు నూతేండ్లయునురు (ఆయువు) న్పొందవలయును. ఎల్ల వారలేయే దొడ్డచేతల నెఱ్ఱెల్లు నడుచుకొందురో యట్లట్లు చెడ్డ(తోవలనుండి కఱప (బుద్ధి) మళ్ళిపోవును, గొప్పచదువుగము (ఉగముఆయువు) కొనసాగుచుండును.

"కుర్వన్నే వేహకమాణిజిజీ విషేచ్ఛత సమాః" జేఁ డెల్లతెఱఁగుల మంద రుల (వైద్యుల) న్గాపాడుచుండవలయును. వారిలోఁ గ్రొందఱుకిమ్మతావిగల దిను సులన్డిగ్గి - నిప్పు - కిత్త - కిత్తి - ఐదార - వరుపు - కణకు - తెఱ-తెఱ్ఱి-నిప్పు నిప్పుక - మఱ్ఱె - వయిరవులు - వయిరాలు - వైరవులు - వైరాలు (అగ్గి -ఇంగ లము - ఇంగిలము-చిచ్చు - అగ్ని) వేల్చుటచేత గాలివాన మందుల న్బాగుచే యుదురు. తక్కినమందరుగొప్పచదువునేపుణాలతోతెగుళ్ళన్గుఱితించుట(నిదానము) మొదలగు నాఁడెముచేతలనారితీఱి యెల్లమైతాల్పుల (ప్రాణుల) తెగుళ్ళనా్మన్పి యెల్లపుడున్గాచెదరు. పనివలనన్గాని మొత్తముపైమందికందఱికిన్లాయికలుగనేరదు. "ఆపోదేవీరుపసృజ"

వెల్లవేళ్మతొలుఁబలుకులందలి మందులన్గూర్చినమిడి
(వేదవాక్యములు)

---

మందులుపొడిచేసినీళ్ళలోఁ గలిపిపుచ్చుకొనుటమేలు.

"సంవసామి సమాపఓషధీభిః. సమోషధయోరసేన" అప్పుడేపితికినయాపు పాలు (ప్రతిధుక్కు), ఆపాలేవెచ్చగానున్నవి (శృతము), పాలమీఁగడ(శరము) పెరుఁగు, మీఁగడ (మస్తువు,) చేమిరి-తోడుపెట్టినపాలు (అతంచనము) జున్ను- జున్నుగడ్డ - జున్నుఁబాలు - ముఱు - ముఱ్ఱు - ముఱ్ఱుఁబాలు(ఆమిక్ష-స్వటిత సుగ్ధము), వెన్న, మిసిమి (నవనీతము) నెయ్యి - నెయి - నే-నేయి- చేచమురు (ఘృతము), పెరుఁగునీళ్ళు (దధిరసము), గోఁకుడు (వాజినము) ఈపది పాల దినుసులు మేనికిఁజేవహెచ్చించును.

"అంధస్థాన్థోవోభక్షీయ" తెగుళ్లన్పోగొట్టుమందరి నాకొఱుకకావలయును.

"యోరేవాన్యో అమీవహా" ఓవేల్పా (రుద్రుఁడా) ఓజగా (స్వభావ ముగా) నీవే మందుపొడ (స్వరూపము) కనుక మాకు మాయాపులకు గుఱ్ఱము లకు గూడ నెల్లతెవుళ్ళనా్మన్పుటకై మందిమ్ము.

"భేషజమసిభేషజగవ్వేశ్వాయ పురుషాయభేషజమ్" మంగలిపని (క్షౌరము) చేయించుకొనుటచేతఁ దెవుళ్ళుంటవుసుఱు (ఆయువు) హెచ్చు, నొడమి (ఐశ్వ ర్యము) పొదలు (అభివృద్ధియగును)

"శివోనామాసిస్వధితిస్తేపితా" ఒడలంతట న్వెన్న పూసికొనుటచేత మైబిగి మించును. ఒక్కెరకమైన రాతికాటుక పెట్టుకొనుటవలన జూపు పెంపొందును,

"మహీనాంపయోసివర్చోదా అసి" ఆవుపాలు త్రాగుచున్నయెడల నరుఁ దెవ్వలు (క్షయరోగము), తక్కిన తెగుళ్లంటవు. తాగినవెంటనే యఱిగిపోవును (జీర్ణమగును). చావునడ్డును (మరణమున్నరిక్షించును).

"శ్వాత్రాః పితాభవత" పుల్లతీఁగె (సోమలత) కొండమీద రాళ్ళ నడుమ పరియలో మొలుచును.

"వనేషువ్యంతరిక్షంతతాన"

పెసలు, చిఱునిగలు మొదలగు పప్పుదినుసు బియ్యము సైదము(గోధుమ పిండి మొదలగు ధాన్యపుదినుసులతో) గలుపుట మందులొండొంటితోఁ గలిపి పుచ్చుకొనుట యొడలికి మంచిది.

"కాషీర్ణరసిసముద్రిస్య -సహోషధీభిరోషధీః" చూలుతగిలిన పదినెలలకుఁ బురుడువచ్చును.

"ఏజతుదశమాస్యోగర్భో జరాయుణాసహ" వేలిమి (యజ్ఞము) చేతఁగోరు కొన్నట్లొడలిన్దాల్చియును బ్రొబడిగించుకొనవచ్చును,

"ఆయుర్యజ్ఞేన కల్పతాం" గోయిత్వవ్వి నీళ్లుపోసినయెడలఁ దెవుళ్ళగులని వ్వకొదలి కోపిక (ఆరోగ్యము) నివ్వజాలిన మందుమొక్కలు మొల్చిపండును.

"ఆపోదేవీరుపసృజ" బంగరుపూసల పేరు మెడన్దాల్చినవారి కు సు ఱు (ఆయువు) మెండగును (అదికమగును).

"దృశానోరుక్మ ఉర్వ్యావ్య ద్యోద్ధుమర్షమాఽఽయుః" ఓడిగ్గీ (అగ్గీ) మందు ద్రాఁకులలో, నీళ్ళలో, నెల్లమైతాల్పుల (దేహధారుల) కడుపుల నీవలరు చుంచువు. వేఁడిన్గాపాడుకొన్నన్గాని యూపిరి (ఆయువు) పోవును,

"గర్భో అస్యోషధీనాం, గర్భో వనస్పతినామ్,
గర్భో విశ్వస్యభూత సాగ్నేగర్భో అపామసి"

కారువడ్లుయవలు (యపలు) మొదలయినవి బంగారుతీగెఁలు మొదలయిన యూరి (గ్రాష్యము) గింజలు (ధాన్యము) లేడుఓషధులు. వీనులు మొదలగు తలయందలి యేడుకన్నముల (సప్తప్రాణముల) న్గాపాడుచుహాయిగా నూఱేండ్ల యుసుఱు (ఆయువు) నిచ్చును.

"యాఔషధీః పూర్వ్యాజాతా" ఓతల్లులారా! దినుసులారా! మీపుట్టుకలు, మీ రకములు, మీపుట్టుచోట్లు, మీమొలకులు, మీచేయు మంచిపనులెన్ని రకములో లెక్కింపనలవికాదు. కనుకనో కొలతమీఱినచవులారా! (జీవగఱ్ఱలారా!) మావాని యిలుదొరను (యజమాను) నేతెగులున్దగులనివ్వకాఁకలి, దప్పి,వనట(శోకము), సొమ్మ (మూర్ఛ-మోహము), ముదిమి, చావులను నాఱుసుళ్ళలో (షడూర్మల) నీలోఁజిక్కనివ్వక కాపాడు.

"శతంవో అంబధామాని సహస్రముత వోరుహః" పగఱఁగెలువననికి వచ్చె
డి దొరవలెనో మందులారా! తెగుళ్ళనోఁతోలుటకై మందఱి పాఱుని (వైద్యుఁ
డగు విప్రుని) చెంతకునొచ్చెండు.

"యత్రౌషధీఃసుమగ్మత" ఒడలంతట నొగులు పెట్టెడి యఱుఁదెవులా!
(క్షయరోగమా! రాజయక్షమా - రోగరాజమా!) కికియని కుత్తుకన్జప్పుడు చేయు
తెమడతెగులు, కలఁత పెట్టు కిత్తతెగులు (పిత్తరోగము), కీళ్ళనొప్పుల నావించు
గాలితెగులు (వాతరోగము) ఈమూఁడు తెవుళ్ళతోఁగూడ నొలగి మ చ్చ మా సి
పొమ్ము (నశించిపొమ్ము).

"సాకంయక్ష్మపర్రిపత" ఓమందు దినుసులారా! మీరొండొండ్లతోఁగూడి
(అన్యోఽన్యముతోఁగలిసి) యొండొరిమికతో (ఏక్యభావముతో) నొండొరున్గాచు
కొనుచు (పరస్పరము న్సంరక్షించుకొనుచు) మొత్తముగా నొండొంటన్జేరి మాతె
వుళ్ళనోఁగొట్టివేడెదను.

"అన్యావో అన్యామవత్వన్యాన్యస్యా ఉపావత" పండ్లు పండునవి, పండ్లు
పండనివి, పూయనివి, పూచునవి మొదలగు మందు ఁమ్రాఁకులన్నియు ను డు వు
ఱేని పంపునంది (బృహస్పతి ప్రేరితములై) మాతెవుళ్ళనెల్లఁ బోడుల్చున్గాక.

"యాఃఫలినీ యాః అఫలా అపుష్పా యాశ్చపుష్పిణీః" మందు మ్రాకులు
తమదొరయగు జాబిల్లితో (చంద్రునితో) నిట్లుపల్కెనేమనఁగా మమ్మొపాఱుఁడు
(బ్రాహ్మణుండు) వాడుకొనుచుండునో యతనికోరిక చొప్పున మేమెల్లతెవుళుల
న్దప్పక మాన్పెదము.

"ఓషధయః సమవదంత సోమేనసహరాజ్ఞా" తొలుఁబల్కులు మందులకై
మొక్కలనే (వనమూలికలనే) యేర్పర్చెన్గాని మఱేగట్టిదినుసులనైన (లోహము
లు, రసము, గంధకము, పాషాణము) మొదలగు దినుసులలోనేదియున్జెప్పలేదు.
ఓమందా! నీవఱుఁదెవులు (బలాసము-క్షయవ్యాధి) నోఁగొట్టెదవు. మొలకతెవులు
(అశోరోగము) న్మాన్పెదవు. మేనినుబ్బించు కణఁతి - ఆణె-ఆణెము-ఆనియ-
ఆనె (కంతి) కడఁతి-కణఁతి-(దద్దు-దద్దురు) బొరుసు, ఏనుగుకాలు - బూరకాలు
మొదలగు వాఁపుతెవులు (ఉపచితము) న్గుదిర్చెదవు, ఘటి వందలకొలఁదిన్దక్కిన
తెవుళ్ళ నడంచెదవు. నోటికంపు (ముఖపాకము), అఱకము - అఱుకువ-అఱ్జి
యము - అజ్జె - మజ్జీ - మజ్జెయ - మజ్జె (అజీతిః - అరుపు - మ ం దా గ్ని)
న్మచ్చ మాపెదవు.

"నాశయిత్రీ బలాసస్యాశ్ఃస ఉపచితాంమసి" ఓమందువేరులారా! మిమ్మ
వేలుపుపాటకాండ్రు - పాటరులు - బయకాండ్రు - లయకాండ్రు - సీకారులు
(వేలుపుగాణాలు - గంధర్వులు) వేల్పుఱేఁడు, ఇంతికౌపుంజు - ఒడలిచూపొడ
మఁడు - పఱి - కౌండపగఱుఁడు - కొంపఱెక్కలుగొట్టినదఱి - షేడే - తలఁపు

డాయి నఁతరించినదొర -తూరుపుదఱి-తూరుపుఱేఁడు తెఱగఁటిఱేఁడు, నిలువెల్ల చూపులై వెలయువాఁడు - మ ల గొ ం గ - వినుత్రోల్దొర - వేవ్వుఱెప్పలఱేఁడు వేగంటి - వేల్పుఱేఁడు - సురతాణి (ఇంద్రుడు), నుడుగుఱేఁడు (బృహస్పతి) మిమ్ము న్దఱివ్వితీసిరి. మాకడిమి (శక్తి) న్దెలిసికొన వెన్నెలఱేఁడు - జాబిలి -నెల (చందుఱిడు - సోమరాజు) మిమ్మున్వాడుకొని (ఉపయోగించుకొని)తన యఱుఁ దెవులు (రాజయక్షము) న్మాన్పుకొనెను.

"త్వాంగంధర్వా అఖనంస్త్వామిందఱిస్త్వాం బృహస్పతిః" ఓమందు మొక్కా నిన్నుదఱివ్వునేను, నెవ్వరి తెగుళ్ళుమాన్పుటకేనుని న్దఱివ్వుచుందునో వారలను వేళ్ళమోఱియనిన్దఱివ్వినిన్నెకల్చి నిన్నుచ్చుమాపన్గనకమాటిమాటికిన్జిగురించుటవలన, బొదలుచు నీవున్నెకేండ్లు హాయిగా ఱిదికి యుందువుగావుతను.

"దీర్ఘాయుస్త ఓషధేఖనితాయస్మై చత్వాఖనామ్యహమ్" చేవ (ఓజస్సు) పగతుఱన్గెల్వఁదగుకడిమి (సహము), దీమసము(ధైర్యము-ఆత్మ), మేనిసొగసు-అందము (తనువు)హాయి(శర్మము), కత్తళము-తొడుపు-బొందళము-సమకట్టు (వర్మము), కాల్కేల్మొదలగుమైవంతులు (అంగములు) ఎమ్ములు (అస్థులు) వ్రేళ్ళకణుపులు (పరుస్సులు) పైఁజెప్పినవిగాక మిగిలినమేనిదినుసులు. ఉగము-ఉసుఱు (ఆయువు), ముదిమితుదవఱకు బఱితుకు (జర) వేఱిల్మి (జన్నము - యజ్ఞము) వలన నాకుఁజేకూర్చున్గాక.

"ఓజశ్చమే సహశ్చమ ఆత్మాచమే" వడ్లు(వ్రీహులు), కారువడ్లు(యవలు), మినుములు (మాషములు), కందులు (ఖల్వములు), కొఱ్ఱలు (పిఱియంగువులు) చిఱువడ్లు (అణువులు), అక్కుఁళ్ళు (చామలు-శ్యామాకములు), ఆమడలు - బర పటలు (నీవారములు - నివరి) సైదముపిండి గోధూమములు - గోదుమలు) చిఱు సనిగలు (మసూరములు) వేల్పు కొల్పు వేఱిల్మి (జన్నము-యజ్ఞము) చేత నాకు మెండుగానబ్బున్గాక.

''వ్రేహయశ్చమే యవాశ్చమే" డిగ్గి (అగ్ని), నీళ్ళు, పొదలు (కొరుధ ములు, మందులు (ఔషధులు), వడ్లుమొదలగు నూడుపు పంటలు (కృషపచ్యము లు) తమంతఁదాము పండుపంటలు (అకృష్టపచ్యములు), ఆవు, గేదె, గుఱ్ఱము, మేక గొఱ్ఱె, గాలిగాఁడు (గాడిదె) ఒంటెమొదలగు నూరినాల్గు కాళ్లమైతాల్పులు (గ్రామ్యపశువులు), ఏనుగు. నెరసరి (సింహము) చౌగంటి (శరభము) గొఱ బోతు (గవయము), జింక (మృగము) కోఁతి మొదలగు కారుఱునుఱులు (ఆర ణ్యపశువులు). ఇదివఱకున్న యొడమి (విత్తము) ఇఁకముందు కలుగఁబోవు కలిమి (విత్తి), పుట్టినకొడుకులు మొదలగువారు(భూతము), నాఁయతనేఁబడయు నాస్తి (స్వార్జితము) వ్రేల్మివలన నాకుండున్గాక.

---

(అథర్వ సంహితనుండి)

# మన్కిమిన్కులకుదురు - [అథర్వవేదము]

సీసపుబిళ్ళయొడలన్దాల్చినయెడల నల్లత్రాగుడుదెత్తులు మొదలగునవి (రక్షఃపిశాచాదులు) చేరకుండును. (సీసాయాధ్యాహ....)మేనితాల్పులకే తెవుల యిన న్దగులకుండును.

గుండెనుండి నూటయొక్కనరము లోతలంతట న్ప్రాకుచు మేనినడుమ నైదుపలవల (పర్వములు) గల (సుషుమ్న) యను నరమునుండి పిన్నపెద్దజెడ్డ కొమ్మలవరుస మూఁడువందల యేబదివేల (లక్షత్రియము పైనర్ధలక్ష) లెక్క న్ప్రాఁకుచున్నవీనరములలో నడిమినరములు నెత్తురు చిమ్ముతెగులు న్పుట్టించు చుండును. నరముల నెత్తురు కారుతెవులు ''(తిష్ఠావరేతిష్ఠ పరఉతత్వం తిష్ఠమధ్యమేః కనిష్ఠికా చతిష్ఠతి తిష్ఠాదిద్దమనిమహీ") అనుమంతరము (మంత్రము)చదివిన యెడలఁ దప్పక కట్టిపోవును.

ఉచ్చపడుతోవకడ్డముగా రాయిన్పుట్టించు తెవులు (అశ్మరి) నకాటుపట్టగు నిసుకనరము (సికతావతి) (కీగడుపు) (బస్తి) యందువిల్లువంపయి యుచ్చపడ నివ్వ కడ్డుఁజుట్టుముట్టు పెద్దనరము (ధనుర్నాడి)లారాః మీరునెత్తురు కార్చకుండుడు (పరివఃసికతావతీ....)

లేడికాళ్ళవలెఁగాళ్లు, ఎద్దుపండ్లు (దంతముల) లాగునఁ బెద్దపండ్లు ఆవు నడకవలెనడక, బుస్ బుస్మనుచప్పుడు (పూత్కారధ్వని) గల యూపిరి, యాఁడు దానికి నుదుటి వెండ్రుకలసుడి (రోమావర్తము) యాఁడుదానికి మగవానికిన్గూడఁ జెడుగుఱుతులు (దుర్లక్షణములు)

ఓతెగులు గొట్టా నీగుండెజబ్బు (హృద్రోగము), నీపచ్చతెగులు (కామిలాది రోగజనిత శారీరహరి ద్వణము) ఈరెండు తెవుళ్ళన్పగటిఱేఁడు (సూర్యుఁడు) చుఱుకుటెండపోఁగొట్టు న్గాక. ఆవునెత్తురునిదీసి నీయొడలికెక్కించి నీమేనిమంచి మెఱుపు తఱుకన్పుట్టించెదను "అనుసూర్యముదయతాం...., పరిత్వారోహి తైః" నిన్నునూఱేండ్లు హాయిగా బ్రతికించెదను, నిన్నెప్పటికిన్బడుచువానిన్గావించెదను. "యారోహిణీదేవత్యా" తెల్లపొడలయులు (శ్వేతకుష్ఠురోగము) నోఁగొట్టుట కై మాపులనబట్టి పెరుగు గుంటగలిజేరు (భృంగరాజము), పసపు (హరిద్ర), పెద్ద పాఁపర (ఇంద్రవారుణి) నల్లవావిలిచెట్టు, నల్లగోరంట, (నీలిచెట్టు - నీలిక)యీ దినుసుల పసరావుపేడ పిడుకలోఁ గలిపి నెత్తురు చిమ్మువరకా బొల్లిపొడలకుఁ బూసి ప్రామచున్న నెరసిపోయిన తలవెంద్రుకలకుఁగూడఁ బట్టించిన యెడల నత్తె

పుట్లు రెండునూర్మనిపోవును ("నక్తంజాతాస్యోషధే") ఓ (నీలిచెట్టా) నలుపునీవు ట్టుకపొడి (జన్మస్వభావము) కనుకబొల్లియులుపు (శ్వేత్రిము) నెరుపును (పలిత రోగము)ను న్నొడలికిఁ బ్రాముటముచేత నారెండు తెవుళ్లు మఱెన్నటికి న్దలచూ పనివ్వక మొదలంటనన్మచ్చమాపుము. "అసితంతే" ఆబొల్లియులుపెముకలనుండి యుగాని చియ్య (మాంసము) నుండిగాని పైతోలు (త్వక్కు) నుండిగానిమఱెల్ల యినన్గాని పొడమి నొగిలించుచున్నప్పటికా తెగులున్మంపరము ("అస్థిజస్యకిలా సస్య") చేత దుదముట్టుమాపెదను.

ఓనీలి మొదలగు మందు ప్రమాఁకులారా! మీచిలువతిండి - చిలువమే తరి - చుక్కను దిటిపిట్ట - తల్లివేసటఁబాపినదంట - తుట్టెపురుగు గుంపుగొంగ-తోడలు లేనివాని సైఁదోడు - పాఁపమేవరి - పాఁపమేపుడు - పాములమేతరి- పాముల వేఁటగాఁడు - పురుఁగులదొర - పులుఁగుబొల్లఁడు - పులుగుఱేఁడు- పెందిరువడి- మేలిచ్చుపులుఁగు (సుపర్ణుఁడు - గరుత్మంతుడు) కిత్తి (పిత్తము) వలన నిరు పుట్టినారు గనుక నంతటి తిరుగులేని గొప్పచేవ (అమోఘవీర్యము) మీకుఁగలదు. (సుపర్ణోజాతం) నల్లత్రాగుడుచేవ (ఆసురీమాయ) యీ (నీలి) మొదలయిన నాల్గుమందుదినుసులు వాడినయెడికచేత నెల్లమందరులకుఁ దొలిమేల్బంతియైబొల్లి మొదలగు పులుముల నెల్లఁగుదిచెఱను.

ఓ (నీలి) నీవునలుపు, నీతల్లినేలనలుపు. నీతండ్రినింగి (ఆకసము)యును నీవిత్తున్గూడ నలుపు. నీముద్దనొడలికిఁ బాము కొన్నవారికి బొల్లి తెగులుగొంట్లకు తెగులుఁబోఁగొట్టి పండువెండ్రుకలన్గూడ నీవలెనలుపుతళుకునలరించుమా"సరూ పానా మతేమాతా"

ఓ చలివణఁకుకాఁక (కాఁక - పులకరము - వెక్క - వెచ్చ - వేఁకి (శీత జ్వరము - తక్మా) నీవు తిండి నఱిగింపఁజాలని కడుపుడిగ్గి (జాఠరాగ్ని) వలనఁ బుట్టితివికనుక నెట్టుఁగాఁ గిత్తిలోఁగాల్పఁబడిన యినుపగడ్డ పొఱనుడికిన వేఁడి వేఁడినీళ్లొడలిపైఁ జిలకరించుటవలనఁ దెదులు గొంతున్విడిచినీకతను (జన్మహే తువ)గునైదార - బరుపు - కిత్త-కిత్తి-కణకు-డిగ్గి - తెఱ - తెఱ్ఱ- నిప్పు నిప్పుక- గుల్లె - వయిదవులు - వయిరాలు (చేతనాచేతనాగ్ని)తోఁగూడఁ దొలఁగిపొమ్ము. "యదగ్నిరాపో అదహత్" ఓ చలిపులకరమా! (శీతజ్వరమా) మిక్కిలి యొడలి న్నొగిలించుదానా! నీవెంతయో వేఁడిన్వేడి నొడలుడికించెదవు, నీవు నిప్పువలనఁ బుట్టినప్పటికొడలిన్బచ్చఁ జాఱించెదవు. నీకు బెక్కుపేర్లుకలవుగాని మొదటిపేరు చలిపులకరమే (శీతజ్వరమే-తుక్మమే) "యద్యర్చిఱయదివాసి శోచిః" ఓచలిపు లకరమా! (శీతజ్వరమా) నీవొడలిలోపలన్పుయిన్గూడ మంటలెత్తించెదవు. మేనం తయు నెండించెదవు. కల్లలుపల్కువారలకు తగునట్లిడుమవిడు. ఏటితోటిమదల

యెకిమీడు, కడలిఱేఁడు - త్రాడుదాలుపు - నీళ్లఱేఁడు - పడమటిదొర - మొయిలు ఱేఁడు - వల్లెతాలుపు - వల్లెత్రాడుగలాఁడు - వానవెచ్చెలి. (వరుణునకు) నీవు కొడుకవు (పుత్రుఁడవు) "యదిశోకోః" చలిగొలిపి వడకించు చోర్వరానియిడు మలిడునో చలివేఁకిసీకుదండము. చలివేసినపిమ్మట నొడలుడికించు కాఁకాఁరూరా-జ్వరమా) నీకుఁ గయిచాఁపు (నమస్కారము)లు. పూటవిడిచి మలుపూటవచ్చు వేఁకి (అన్యేద్యుర్వా) నీకెరఁగుడు. రెండునాళ్ళకువచ్చుపులకమా(ఉభయేద్యుర్వా) నీకుఁగోపులు. మూడేసినాళ్లకు నాల్గేసిపూటలకునద్దగులు చలివేఁకికి గిడిగిల్లినట్టైడ పెట్టిపలుతెఱఁగుల దగిలినొగిలించుచలివేఁకి! మాసలుపు గుంజిళ్ళగొని మమ్మెడలి పోవుదువుగాక "నమఃశీతాయః" నేలనింగినడుమలన్మత్రావుల (భూమ్యంతరిక్షద్యునామకలోకత్రియముల) మందు మ్రాఁకుల పులనీళ్ళనడుమఁ జెలగుడిగ్గిగాలి వెలుఁగుఱేండ్లను ముత్తిరువేల్పుల వేణువేయిమాఱులగు ముప్పదిమువ్వురు వేల్పు లునుజెడపు తప్పని చావుతోఁ (కాలమృత్యువు)తోఁ గలసి తక్కుచిల్లరసూఱు గిట్టింపు (అపమృత్యువులు) మమ్ముఁజేరనివ్వకవంతయేండ్లవరకు హాయిగామము బ్రతికింతురుగావుతను. "యేదేవా "యేదేవాదివిష్ఠయే వృధివ్యాం॥" వానకతమై నింగిమీఁదనెప్పటికొనవేల్పులకైనఁ దెలియఁబడకుండు నీళ్లెల్లదడుపుట మొదలగు పనులచే మాతెవుళ్లనన్నియునోర్చెగొట్టి మాకు హాయి నొనంగుఁగాక. "వారణ్యావ జా శుచయః పావకాయాసుజాతాః॥" వేల్పుఱేఁడు మొదలగు చదలకాఁపులెల్ల రేసీళ్ళసిగ్గగు (సారమగు) చవి (అమృతము), పుల్లతీఁగ(సోమలత) పసనానుట చేనింగిపైచోట నెప్పటికలరెదరో యత్తడిమాతెవుళ్ళనుడిపి హాయిగా మమ్ము నూఱేండ్లు బ్రతికించుగాక.

తేనెవలనఁ బుట్టిన యోయిప్పతుప్పా! (యష్టిమధుకము) తీఁగెపొదా! (మధుకమా) మాయొడళ్ళన్బలుకుల నుల్లముల పనులనెల్ల (కాయికవాచిక మానసవ్యాపకమ్ణాము లన్నింటిని) మిక్కిలి యింపుకావింపుము. "ఇయంవీరున్మధుజాతా॥" నాల్కకొనన్దేనెయునాల్క మొదట (యష్టిమధుకము, అతిమధురము) నీతిప్పవువ్వా! కొండయిప్పపూవువలె నోపుల్లతీఁగరో! (సోమలతా) నావేల్మిపనులందు (క్రితుకమ్ణాములందు) నాయొడలు కావించు పనులయందు నెలకొని నన్నెల్లతెఱఁగుల నందటికింపు కావించుము, "జిహ్వాయాఅగ్రేమధు॥" పూచిన యోనీరిప్పతీఁగెరో నిన్నునేవాడుటచేత నేను నాతోఁగూడినవారు నందటికెల్లతెఱఁగుల మంచి యింపుసొంపులన్దోచనిమ్ము, "మధోరస్మిమధుతరో॥"

ఒడలిమీఁదఁ జన్నిదము - పయిఁడి - పసిఁడి - పుత్తడి - పైఁడి - పొన్ను బంగరము - బంగరు - బంగరువు - బంగారము - బంగారు-పంచము- పొన్ను (హిరణ్యము) నగలుపెట్టుకొన్నవాఁడే తెగులున్దగులక హాయిగా నూఱేండ్లుతప్ప క బ్రతుకఁగలఁడు "నైనంరక్షాంసి॥"

అయిదు గుంపులు - గనుపులుగల వెదురుకఱ్ఱగాని (వేణుదండము)కంపిల్లచెట్టు కొమ్మలజంట (కాంపిలవృక్షశాఖాద్వయము) గాని మిఱ్ఱుపల్లములులేక చచౌకము నున్ననేలన్నిలిపి విడిచినపుడా కఱ్ఱతాఁదలచుకొన్నవైపు (దిశ) పడిపోయినయెడలఁ దాననుకొన్నపని నెఱవేఱునట్లుగాక వేఱుతెలఁగున (దెస)యందుపడెనేని తనపనికాదు. విల్లెక్కిడియమ్ముతొడిగి "వేనస్తత్ పశ్యత్॥" అను మిడియ - పనస - మంతరము (దేదసూక్తము) న్జదువుచెగచినపుడత్తూపుగుఱికి దగిలినయెడలఁ దాఁదలంచిన పనితప్పకనెగ్గును. నీళ్ళతోనింపిన పెద్దచెంబులో పాలుచిలకరించి యానీళ్ళనడిగినపుడెక్కువిచ్చిన నెక్కువుగాఁ దక్కువిడినన్దక్కువుగాఁదనకోర్కి సమకూరును. చీపురుకట్ట (దర్భాస్తంభము) నైకొని ముందు చెప్పిన మిడియననుచు లెక్కించినపుడాపుడుకలు (సరి) లెక్క (సమానసంఖ్య) యైనపుడు తాఁదలంచిన పనినెఱవేఱును. ఎండుపుడుకన్మంతరించి నిప్పులన్పడవేసినపుడెడమవైపునుండి కుడివైపుగామంట (జ్వాల) చుట్టుకొనుచుండెనేని నీకు గెల్పువచ్చును. సొగటాలు (అక్షముల) న్దొర్లించివైచినపుడు నీతలంచినలెక్కగల కాయ వెలికలఁబడునెడనీకోర్కి దేరును. మంతరించి నీచాచిన రెండువేళ్ళలో నీతలంచినవేలెవరైనఁ బట్టుకొన్నయెడల నీవనుకొన్న పనియగును. ఇరువదొక్క చిన్నముక్కలపోఁకలోనుండి నీకైకివచ్చి నన్నిముక్కలుతీసి లెక్కించునపుడవి సరియైన గెలిచెదవుబేసియైననోడెదవు. నీళ్ళనిండిన చెంబున్గాని నాఁగలిన్గాని సొగటాలన్గానిమంతరించిక్రొత్తగుడ్డలోఁజుట్టబెట్టి సమతాఱడని పడుచులనిరువురన్బట్టుకొని పొండనవారేవైపుకవిపట్టుకొని పోయెదరో యావైపునఁ దాఁబోగొట్టుకొన్న సరుకుండును.

పొలము పారి (మన్ను), పుట్టపారి (మన్ను) నాల్గుతోవలు కలసినదారిలోనిబెడ్డ (చతుష్పథలోష్టము), ఒలికిబెడ్డ (శ్మసానలోష్టము) ఈనాల్గుబెడ్డలన్మంతరించి యుంచి నేదియైన బెడ్డనీకుఁ దోచినది ముట్టుకొమ్మని పెండ్లికానిపడుచుతోఁజెప్పు మామె పొలముబెడ్డన్గానిపుట్టబెడ్డన్గాని ముట్టుకొన్నయెడల నామెకుఁ బెండ్లియగును. దక్కిన బెడ్డలలో నెయ్యది పట్టుకొన్నప్పటికామె పెండ్లికాకమునుపే గిట్టును. పెండ్లికానిపడుచుదోసిలి (అంకలి) నిండమంతరించినీళ్లనించి చల్లివేయుమనఁ దూర్పువైపున కాపెయానీళ్లుచిమ్మి వేసినయెడల నామెకుఁబెండ్లియగును.

అదోయత్॥ "ఆను మంత్రిము చెప్పచుఁగాఁక (జ్వరము) పారుడు (అతీసారము) నీరుడి (అతిమూత్రిము) నారికుఱుపు (నాడీవ్రిణము) లన్గుదుర్చుట కొఱకు ముంజిగడ్డి కొసలఁబేనినత్రాడుకట్టుటచేతను, పొలముపారి(క్షేత్రముత్తిక) పట్టువేయుటచేతను, నెయ్యిపూసి తోలుతిత్తిమూతితో (చమఙదృతి ముఖము) ముడిలోను గమగుఱి (శిశ్నము) లోను, నారికుఱుపు సెలలోను గాలిగొట్టవల

యును. పొన్నగంటియొక్క (జింగడమను పేరుగల) మొక్కన్వేళ్ళతోఁ గూడ పెకలించితీసి జనపనారత్రాడు (శణసూత్రము)తో గ్రుచ్చికట్టి "దీర్ఘాయుత్వా య బృహతే॥" అని మంతరించి మేసన్దాల్చినయెడల హాయిగా బెక్కేండ్లు బ్రతికించును (కాశీ) యనువీడు (పట్నము) నందీపొన్నగంటి (జంగిడము) అనిపిల్వఁబడును. ఈ (జంగిడమణి) న్దాల్చినవారి కెట్టితెవుళ్ళైనన్మానిపోకతప్పదు. అడవినుండి తీసితెచ్చిన పొన్నగంటి జనపనారతాడులకూర్చి ముంగేలకట్టుకొన్న పిక్కలిమేలుచేయును. "శణచ్చమాజంగిడళ్చ॥" గగికజనపనారతో ముంగయిన్దాల్చినయెడలఁ బాఁపడుతిట్టు చిల్లంగిచూపు మొదలగు చెడ్డలు తగులకుండ "యళ్చసాపత్న॥" తరములబడివచ్చుచున్న పులుమరుఁదెవులుపారుడు మొదలు తెగుళ్ళ (కులాగతకుష్ఠక్షయ గ్రహణ్యాదిరోగముల) నడంచుటకై నీళ్ళనిండిన యలకి (ఉదకఘటము) నుంచి "ఉదగాతాం భగవతీ॥" అని మంతరించి యిల్లు వెలుపలఁ దెగులుగొంటు (వ్యాధితు) మీఁదఁ జల్లవలయును. (ఆపేయమ్॥)అనుచుమంతరించి కాల్పఁబడిన పూటమాపున (దగ్ధదినరాత్రియందు) మునుపటితీరుగా నీళ్ళుచల్లవలయును. ఏఱుమద్దిపుడుక యూకను నువ్వులు నూలిచుట్టకలిపి "బభ్రో॥" అని మంతరించి యా తెగులు గొంటునకుఁ గట్టవలయును. నాల్గుత్రోవలు కలియుచోట నందలిపెట్ట, పుట్టపారి (వల్మీకమృత్తిక) బ్రతికియున్న మెద్దుతోలుతోఁజుట్టి మునుపటివలె మంతరించి కట్టవలయును. "నమస్తేలాంగలేభ్యః॥" అని నీళ్ళనిండిన బిడ్డన్మంతరించి యెడ్లుపూన్చి నాగలిక్రిందఁ దెగులుగొంటు నుంచి యానీళ్ళన్జిలకరించవలయును. పాడింటిలోనీళ్ళ నిండినయలకి - వనఁటి పరఁటి - ప్రివ్వ - మఱువ (ఉదకఘటము) నుంచి యాయింటికొన న్బాఁతగొయ్యిత్రవ్వితీసి యాగోతిన నప్పాడింటుమొలచిన గడ్డితోఁ గప్పిపుచ్చి యచ్చటన్దెగులుగొంటు నైరవేసి "నమం ననిసప్రిసాహేభ్యః॥" అని యప్పనంటి నీళ్ళన్మంతరించి యెత్తెగులు గొంటునకు గ్రుక్కెడునీళ్ళుపట్టి యతనియొడల నించుక చిలకరించవలయును.

"ఉదగాతాం భగవతీ॥" అను మంతరమును జదువుచు(మూలానక్షత్రము) అనఁబడు చుక్కపొద్దునఁ దరతరమునుండి యున్పుట్టుకతోడనేయొజమై (స్వభావముగా) వచ్చునంటు తెవుళ్ళ (క్షేత్రియరోగములఁ) దగిన తెగులుగొంటునకు మందివ్వవలయును. మోదుగు, మేడి, చేరేడు, జువ్వి (కంపిల్లము), బొడ్డ, రావి, ఉసిరిక, మావిడి, మద్ది, మఱ్ఱిమొదలగు పదిరకములచెట్లపుల్లలముక్కలు (లక్క) బంగారముతోఁజేసిన తాయెత్తులోవేలి జబ్బన్గట్టినయెడల బాఁపసపగల (బ్రహ్మరాక్షసగ్రహము) పట్టినవాఁడాకిడు నెరసి హాయిగాఁ బెక్కేండ్లు బ్రతుకు నీతాయత్తువలన వేలకొలదిమందరుఱు (వైద్యులు) వేయిరకములమందు మ్రాకులిచ్చినప్పటికి నుదురనిపోటు (గ్రహపీడ) తప్పక తొలఁగిపోవును.

నేలమీఁద నెల్లరి తెవుళ్ళన్నాఁన్నుమందరులందఱు న్నిక్కముగా మొదటి మందరియగు వేల్పుటచ్చుమచ్చుతే (ఆదివైద్యుఁడగు దేవునిరూపులే).

"యశ్చకారసనిష్కరత్ సఏవ సుఖిషక్తమః
సఏవతుభ్యం భేషజాని కృణవదేఖిషజా శుచిః"
"క్షేత్రియాత్ త్వానిఋతా త్యాజామిశంసాద్ ద్రుహోముంచామి వరుణస్య పాశాత్, అనాగబ్రహ్మణాత్వాకృణో శివితేద్యావాపృథివీ ఉభేస్తామ్."

గీట్లులేకున్న వ్రాలకన్న మీఁద నిలువుగీట్లుగల వ్రాలు హెచ్చురవళిగాను క్రింద నడ్డగీట్లుగల వ్రాలు తగ్గురవళిగాను బలుకవలయును. ఈ మిడియ (వేద మంత్రము) న్మందరిబాఁపఁడు చదివినంతన్దరతరములనుండి పుట్టుకతోడనే యొడలి నిరవుకొన్నపులుము మొదలగు తెవుళ్లెల్లఁ బటాపంచలై మచ్చుమాసిపోవును.

బొడ్డుగు - బొట్టువు (తిలకవృక్షము) పెచ్చులోపలవేసి చేసిన తాయెత్తు మనికట్టునఁ దాల్చినయెడల నెల్లచెఱుపుచేఁతలు మొదలగు నలుకువళెల్ల (కృత్యాదిసమస్తపీడలు) తొలగిపోవును. అన్నిరకముల తెవుళ్లంటకుండును. పగవారం దఱున్మచ్చుమాయుదురు.

పన్నెండుపూటలు పూనికన్గూడు కుడువనినోముపట్టి తన పగవాఁడు పలవైపుగా (దక్షిణదిక్కుగా)ఁబర్విడుదారిలో వానియడుగులు తాకునట్లు పచ్చిమేడి యాకులువేసి కాలిదుమ్మంటిన యాయాకుల న్గొడవలితోఁగోసి ముక్కలుచేసి యాముక్కలన్గుంపటితగులఁబెట్టి తానోముతఱిన్గేలఁదాల్చి వెదురుకఱ్ఱన్బెక్కుతునుకలుగాఁజిదుకమొత్తవలయునట్లు నేసినతోడనే తనపగతకుఁదన్నాటునేలన్విఱుచుకొని పడిమడియును.

రెండుకన్నులు, రెండువీనులు, రెండుముకుచెరములు, నోరు వెరసి యేడు చిల్లులేయేడుసురుల (సప్తప్రాణముల) కుత్తుకయందలి యెనిమిది నరములన్మాపి "సప్తప్రాణానష్టౌమన్యస్తాంస్తే" అను మంతరము చేవవలన నోనాపగవాఁడా నిన్నెగవాఱ్చెదను.

ఓ గోఁచికట్టా - గోఁచికాఁడా - గోఁచిబాఁపడా - తడుపుదాల్పా తడుపు దాలుపా - ముంజికాఁడా - మెణకరి (మాణవకా) యిటకురమ్ము, ముందుగానీ కుడియడుగిడి యీ ఱాతిపై నిలువుము నీయొడలెల్ల రాయిలాగట్టిపడును. నీకే తెగులైనన్దగులకుండును, వేల్పులెల్లరు నిన్నుహాయిగా నూఱేండ్లు బ్రతికించెదరు గాక. "ఏహ్యశ్మానమాతిష్ఠాశ్మాభవతుతేతనూః, కృణ్వంతువిశ్వేదేవా ఆయుష్టే శరదః శతమ్"

ఓ నాయునుజా నీవు పగఅవలనఁగాని తెగుళ్ళనుండికాని వెరువకుము. ఈ మంతరము చేవచేతనీ వెన్నలికిక్షైటు లేక నింగి నేలలవలె నిల్కడగా హాయి నలరుచుండుము.

యథావ్యాశ్చప్రధివీచన బిభీతోనరిష్యతః ఎవామేప్రాణమాబిభేః" బాఁపన తెగఁ, దొరపదుగున్సుంతయైన వెఱవులేకుండునో యెట్లుపుయిలోడకుండునోయ ట్లేనీవోనాయునుజా కొంకకుము.

"యథాబ్రహ్మచక్షత్రం చనబిభీతో నరిష్యతః
ఐవామేపాృణమాబిభేః" పోయినది రాగలదెట్లడలకుండునోయట్లెనీవు బెదరకుడీలు పడకుమోనాయునుజా.

యథాభూతం చభవ్యం చనబిభీతోన రిష్యతః ఏవామేప్రాణమాబిభేః"

నెయ్యి (ఆజ్యము) చితుకులు (సమిధలు) ఇగిరిక (పురోడాశము) పాలు (పయస్సు) కూడు (ఓదనము). పాలబువ్వ (పాయసము), తొడుకు - తొఱ్ఱి (పశువు), వడ్లు (వ్రీహి) నివ్వరి (యవలు) నువ్వులు (తిలలు) బొరుగులు (ధానలు), పెరుగుతోఁగలిపిన పేలపిండి (కరంభము), చక్కిలము (శష్కులి) ఈ పదుమూఁడు దినుసులు వ్రేల్మిడిగ్గిలోవేల్చి యాపొగపీల్చినవాఁడు తనయు సుఖు, ఉగము (ఆయువు)ను హాయిగాఁ బొడిగించుకొనఁగలఁడు.

ఓ కోలపొన్నా! కడుపున్దాఖుకు తెగులునోృఁగొట్టుము. "ఆరాయమసృక్వా వానంయశస్వాతింజిహిషఃతి, గభాఃదం కణ్వంనాశ యపృశ్నిపణీఃనహస్వచ" కోలపొన్న - నక్కతోఁక పొన్న - నేలపొన్న - పొర్లుగాడి- రోకటిబండ(పృశ్ని పణీ) చిగుళ్లతినుచున్నగ్గాని యాచిగుళ్ళముద్దయొడలికి బూసికొనుచున్న గ్గాని కడుపులోని మెల్లతెవుళ్ళ నడంచును. ఈ నేల పొన్నమందు మ్రాఁకులకెల్ల మేల్బంతిగా ముందువాని కెక్కెనిది నూఱి యాముద్ద ొడలికిరాసికొను టచేత అఱియ - ఆఱె - ఆఱెము - ఆనియ - ఆనె - (కంతి)- కడఁతి-కణఁతి- (దుద్దు) - (దద్దురు) - కపఁతి - బొరుసు, తామర దామర - పడదామర - పొడ తామర - పొడదామర (విసర్పి), తెల్లపులుము (శ్వేతకుష్ఠరోగము) మొదలగు ొడలిమీఁద నలము తెగుళ్ళస్దుదముట్టమాపెదను.

"సహమానేయం ప్రథమాపృశ్నిపణ్యః జాయత॥" బలియఁగోరినవాఁడా పునుదూవకుడిచినవెంటనే చొంగమఱుగుతోనుండిన "ఏపాయంతుపశవో"గుమ్మ పాలు మంతరించి త్రాగుచుండవలయును.

ఏఱుబొడ్డీ పేళ్ళునమలుచు మఱిదాని యాకులేడు తలన్దాల్చి(నేచ్ఛ్రత్రుః॥)

అను (మంత్రము) అచుకొనుచున్నవాఁడు దొరకొలువునందలి తనయెదిరిచదువరుల (ప్రతివాదుల)నెల్లనోడించును. (విష్ణుక్రాంతము - అపరాజిత) వ్రేళ్లుగల తాయెత్తుకట్టువాఁడెదిరి చదువరులకుఁ దలవంపుకావించును.

మందరులు చెప్పినచొప్పున చిఱుబొద్దివేళ్లనూఱి త్రాగినయెడల కుత్తుక యెలుఁగు (కంఠధ్వని) బాగుపడును. గాలికిత్తులవలన వచ్చుతెవుళ్లెల్ల (వాతపిత్త దోషజరోగములన్నియు) దుల్లిపోవును. ఓ చిఱుబొద్దీ! నిన్ను జబ్బుతఁగట్టుకొనుటచేతఁ దొల్లి వేల్పులఁతేడు నల్లఁద్రావుడుల (రాక్షసుల) నెల్లనోరిలో గెలువఁజాలెను. "పాతామిన్ద్రో॥"

బాగుగాఁ గిలకొట్టిన పేలపిండినీళ్లు తెల్లవారినతోడనే యెన్నినీళ్లుత్రాగినను దప్పితీఱక వేఁగు తెగులుగొంటు (తృషాతుణ) స్గూర్చుండఁబెట్టి త్రాగింపవలయును.

రి।　　　　　　　　　　　　రి।
"అత్రివద్వః క్రిమయోహన్మికణ్వవజ్జ మదగ్నివత్
ని ని　　　　　　　　　　　　　　ని
రి।　　　రి।　　　రి।　　　　రి।
అగస్త్యస్య బ్రహ్మణా సంపి నష్మహంక్రిమీన్."
ని　　ని

క్రింద 'ని' యను గుఱుతుకలది [యనుదాత్తకాకలి నిషాదస్వరముచేతఁ బల్కవలయును. క్రిందగాని మీదఁగాని యేగుఱుతులేని వ్రాయిస్వరితము షడ్జ స్వరముచేతస్బల్కనగి. 'రి' యను గుర్తుదాత్తము చతుశ్రృతి ఋషభముచేతఁ బల్కవలయును, ఈ మంత్రము పఠించినంతమున మేనిలోఁగల పురుగులెల్లమడిసిపోవును. పురుగులు తెగులుగొంటు హాయిగాఁ బెక్కేండ్లుమన్నును.

ఓ తెగులుగొంటా! నీకన్నులందు, ముక్కుచరమలందు, తలయందు, నీనెదడునందు (మస్తిష్కమునందు), నీనాల్కయందు స్దగిలిన తెగుళ్ళనొప్పఁగొట్టెదను. పదునాల్గు చిన్నయెముకలతోఁగూడిన నీకుత్తుకయందు, నీతలకెగఁబ్రాకు నరములందు, మాఁపుల యిఱుకులతుకు కొంకులయెముకలందు స్పట్టినతెగులునొప్పఁగొట్టెదను. "గ్రీవాభ్యస్త ఉష్ణిహాభ్యః॥" నీగుండెతెగులు న్మాన్పెదను. నీ గుండెచెంతనున్న చియ్యయుండ (క్లోమము) స్దగిలిన యక్కినొరసిన నంజుడుముద్ద (హలీక్షము) నత్తుకొని యద్దాని కుడియెడమవైపుల నొరసిన యరుచిముద్దల (మాంసపిండముల) నంటియున్న నంజుడుబుడుపుల (వృక్యముల) చెంతనున్న కత్తి (పిత్తము) న్వేలుపుచియ్యగుబ్బ (ప్లీహము), కడుపునిరువైపుల స్దెగజెక్కల

వలెనున్న నంజుడుముద్ద (యక్నిమము), గుండెదగ్గరనున్న నురుఁగ దబ్బ (కాలఖండము) ఈయన్నిచోట్లనగిలిన తెగుళ్ళనడంచెదను. "హృదయాత్ తేపరిక్లోమ్నోహలీక్షాత్ పార్శ్వాభ్యామ్, యక్ష్మంమతస్నాభ్యాణం ప్లీహోయక్నస్తే వివృహామసి"

ఓ తెగులుగొంటా! (యక్ష్మగృహీతుఁడా) పేగుల (అంత్రిముల), పిల్లప్రేగుల (పురీతత్తుల), మూడుల (గుధముల), ప్రేవులచెంత నుచ్చపీయిన్గార్చుత్రోవల, కడుపులోనిప్రేగు లన్నిటికన్నవెద్దపేగు (వనిష్ఠము) నందెల్ల ముదురపేగు (స్థవిరాంత్రిము) ఈ యన్నింటికండయగు కడుపు - కరువు (జఠరము) న్వట్టి తెగుళ్ళనోప్ఁగాట్టెదను. కడుపు కుడియెడమల బొజ్జవంతుల (ఉదరభాగముల), పెక్కు చిల్లులుగల ముణికిబోలె (ప్లాశిమలపాత్రిము), బొడ్డు (నాభి) ఈయన్నిటనగిలి నీతెగుళ్లనాకృన్పెదను.

"ఆంత్రేభ్యస్తేగుదాభ్యో వనిష్ఠోరుదరాదధి,
యక్ష్మం కుక్షిభ్యాంప్లాశేనా భ్యావివృహామితే".

ఓ తెగులుగొంటా! నీతొడలనుండి, మోకాళ్ళనుండి, ఎముకలయతుకుల (అష్ఠీవత్తుల) నుండి, మడమలమండి మీఁగాళ్ళ (ప్రిపదముల)నుండి తెవుళ్ళనోప్ఁ గొట్టెదను. మొలతెగులు (భసద్యరోగము), తులుగుల - తుంట్ల (శ్రోణుల) తెగుళ్ళ ముడ్డినొప్పి (భాసము) నోప్ఁగెట్టెదను.

"ఊరుభ్యాంతే అష్ఠీవద్భ్యాం పేష్ణిభ్యాం ప్రపదాభ్యామ్"
యక్ష్మంభసద్యంశ్రోణిభ్యాం భాసదం భంససోవివృహామితే"

పిల్లయెముకల, మూలగల (మజ్జల) పిల్లనరముల (స్నావల), పెద్దనరముల (ధమనుల) త్రైగవన్, ప్రేళ్ళ, గోళ్లనగిలిన తెగుళ్ళ, నాకృన్పెదను.

"అస్థిభ్యస్త మజ్జభ్యః స్నావభ్యోధమనిభ్యః
యక్ష్మంపాణిభ్యా మంగులిభ్యోనఖేభ్యో వివృహామితే."

ఓతెగులుగొంటా! నీమేని తక్కినవంతుల (అవయవముల) న్నిటి, నెల్లవెండ్రుకలతుదుళ్ళ, గనుపుగనుపుల (పర్వపర్వముల), ఎల్లయతుకు (సంధుల) అంట (త్వక్కు) నుండి పుట్టిన తెవుళ్ళనెల్లఁబోగొట్టెదను. కన్నులు మొదలమేని వంతుల (అవయవముల) నలముకొన్న తెవుళ్ళ (కశ్యపుఁడమ మహాషి)ఁగని పెట్టిన మిడియచేప (వేదమంత్రిప్రభావము) చేతనతనిన్గాని యాడుటవలన నూడఁదప్పక పోఁగొట్టెదను.

"అంగే అంగే లోమ్ని లోమ్ని లోమ్ని యస్తే పర్వణి పర్వణి
యక్ష్మంత్వచస్యంతేవయకశ్యప స్యవీబహేణ విష్వంచం వివృహామసి"

మొదటజాబిలి (సోముఁడు), పిమ్మట వేల్పుపాటకాఁడు (గంధర్వుఁడు) తరువాత వేలిమిడగ్గి (వివాహాగ్ని-అర్యముఁడు) కూడికనోలలాడిన పిదప, బడుచున్ (కన్యకన్) న్నాలవవాఁడు పెండ్లికొడుకు కవగూడును. "సోమజుష్టంమొ॥" మోదుగుపుడుకతాయెత్తునా ముగ్గయిఖెల్లప్పుడు న్దాల్పఁబడి నామేని యొప్పునల రించుగాక.

"ఆయమగన్మణిః మణీఃబహువీమొ॥" చంద్రచెట్టు తొఱ్ఱలోఁబుట్టి యోరావి చెట్టుపుడుకగల తాయెత్తా (మణీ) నాపగవారల నందఱన్నాఁబఁ దఱుముము." తానశ్వత్థనిః శృణీహిమొ॥" ఓకొమ్ము వలెనుండుమందుదినుసా (అతివిషా-కటురోహిణీ-శృంగి) నినుతాయెతులో వేసి ముంగయిన్దాల్చినఁ బగవారలెల్లనడంచెదరు. అరుదెవులు, పులుము మొదలగు తాత తండ్రుల తరములనుండి వచ్చు తెవుళ్లు మాన్పించును.

హరిణస్య రఘుష్యదోధి శీషణి భేషజమ్
సక్షేత్రియం విషాణ యావిషూచి నమనీనశత్

ఓతెగులు గొంటా నీ తెవుళ్ళనెల్ల మున్గుటచేతను (స్నానమాడుట) చేతను, త్రాగుటచేత మంచినీళ్ళే కుదుచుణను.

ఆపఇద్వా ఉభేషజీరాపో అమీవచాతనీః
ఆపో విశ్వస్యభేష జీస్తాస్త్వా ముంచస్తుక్షేత్రియాత్

తెల్లవాఱినతోడనే చుక్కలు జాఱిగినంతనే మునిగెడు ప్రాతః స్నానము చేసెడివానికిఁ బులుము (కుష్ఠు-పెద్దరోగము) మొదలగు తెవుళ్లెల్లఁదప్పక మానిపోవును.

అపవాస్తే నక్షత్రాణామపవాస ఉషసాముత
అపాస్మత్ సర్వంధుభూః తమపక్షేత్రియముచ్ఛతు

కూడుబాగుగా నమిలి పల్చనకావించి (ద్రవముచేసి) (మింగిన వారలు తరతరముల నాత తండ్రులతరబడి న్వచ్చు నులుపు మొదలగు తెవుళ్ళు (క్షేత్రియరోగములు) దుల్లిపోవును. "యదాసుతేః క్రియమాణాయాః క్షేత్రియంమొ॥"

మాతండ్రినింగి, మాతల్లినేల మమ్ము డెక్కలులేని పాము, పులి, డెక్కలు గల పగమూక, యెద్దుపోతు గుఱ్ఱము మొదలగు కష్టడమేని తాల్పఁజాలనో నెట్లు కమాడ్లు కావించెదరో యట్లె యీయెడుములనెల్లఁ దొలగించి కాపాడెదరుగాక.

కళఙ్ఘస్య విశధస్యద్యౌః పితాపృథివీ మాతా
యథాభిచక్రిదేవాస్త థాపకృణుతాపునః

దుంగపుచెట్టు - పెనుమాను (అరలువృక్షము) వేరు తాయెత్తు జబ్బకు గట్టుకొనియు మఱియూపెను బ్రమానికఱ్ఱ నేను నడుచునపుడూఁతకోల కావించు కొనియు నైమడ శ్లేష్మలక్షిత త్రిదోషదూషిత (శరీరము) మొదలగు ముక్కిడులఁ జెడిన యొడలిన్బాగుపచుఙ్కొనెదను. ఈతాయెత్తు నందఱికి న్మొదటివాఁడగు (మనువు) నాఁబడునతడు తాల్చెనిందువలన వట్టకొట్టిన కోడెముక్కు తాళ్ళన్నట్టుఁ బఱునెద్దు లొంగుబడికివచ్చునో యట్టేయరుఁదెవులుపసచెడును (నిర్వీర్యమగును)

"అశ్లేష్మాణో అధారయన్‌తధా తన్మను నాకృతమ్
కృణోమివధ్రి విష్కంధం ముష్కాబహోఙ్ గవామివ"

ఉసుఱు - బ్రతుకునకు నూఱుయొక్కయడ్డంకులు (విష్కంధములు-విఘ్నములు) తెవుళ్ళు - చావులుకలవు. ఈయడ్డుల న్దొలగించుటకై తొల్లివేల్పులు తాల్చినటుల నేను న్గూడ నీపెనుమాను - దుండిగము తాయెత్తు (అరలు వృక్షము) నాజబ్బన్గట్టు కొనెదను.

ఏకశతం విష్కంధానివిష్ఠితా పృధివీమను
తేషాంత్వామగ్రి ఉజ్జహరుర్మణిం విష్కంధదూషణమ్

ఈ తెగులు గొంతుయొక్క యుగము (ఆయువు) తగ్గిపోవుచున్నప్పటికిని తడినేల న్విడిచిపోవుచున్నప్పటికి మఱి యితడు నిక్కముగాఁ జచ్చిపోయినప్పటికి మఱేమందులిచ్చి యేవెరవులు చేసిననైనన్గాని బ్రతుకకున్నప్పటికి న్దప్పకితని నేను మఱల నూఱేండ్లవరకు హాయిగా బ్రతికించెదను.

యదిక్షితాయుర్యఙ్ దివాపరేతో యదిమృతోరన్తికం నీతఏవ
తమాహరామినిఋఙ్ తేరుపస్థాదస్పార్శఙ్ మేనంశత శారదాయ"

ఇగిరిక - ఇగిరికె - నిగిరిక (హవిస్సు) చేత తెగులు తొలంగి నెమ్మది గన్నవాఁడా! పూటపూటకు న్పెంపందుచు బ్రతుకుము. నీకు నూఱు చల్లతఱులు (శరదృతువులు), నూఱుమంచుకారులు (హేమంతములు) న్నూఱు ననకారులు - పూఁదఱులు - మంచునెలలు హాయిగా బ్రతుకిడున్‌గాక. వేల్పుఱేఁడు (ఇంద్రుడు), డిగ్గి (అగ్ని). అన్నిటిన్పుట్టించు పగటిఱేఁడు (సవిత), నుడుగుఱేఁడు (బృహస్పతి) నీకు నూఱేండ్ల యునుఁ గొసగెదరు కావుతను.

శతం జీవశరదో వర్ధఙ్ మానః శతం హేమన్తాన్ఛతము వసన్తాన్
శతంతఇన్ద్రోఅగ్నిః సవితా బృహస్పతిః శతాయుషాహవిషాహాషఙ్ మేనమ్

ఓ (మిత్రావరుణులారా)! ఈ చెల్వయుల్లమునుండి తెలివి నోఁగొట్టుడు. పిమ్మట మంచిచెడ్డల స్గుతిఁకాంపఁజాలక నాకేలోకువ కానిండు.

"వ్యస్యేమిత్రావరుణౌహృదశ్చిత్తాన్యస్యతమ్
అథైనా మక్రతుంకృత్వామమైవ కృణుతం వశే."

ఆవుల తెవుళ్ళు మాన్పిచేవపుట్టించి కాపాడుటకై

"ఖ్రిహ్మజ జ్ఞానం ప్రిపురమంస్తా దేవిసీమతః సురుచోవేన ఆవః
సబుధ్యా ఉపమా అస్యవిష్ఠాః సతశ్చయోనిమసతశ్చ వివః"

అనిమంతరించి చెరువు నీళ్ళన్గాని బావి నీళ్ళన్గాని యుప్పుకలిపి పట్టవల యును. కొలువులోని తన యెదిరి చదువరుల న్గెలుచుటకై కూడ నామంతరమునే యనుకొనుచుండవలయును.

ఉదితస్త్రయో అక్రిమన్ వ్యాఘ్రః పురుషోవృకః
హిరుగ్గియన్తిసిన్ధతోహిరుగ్ దేవో వన స్పతిహిఁకారుణ్నమన్తు శత్రవః"

అనుమంతరము న్జెప్పుకొనుచు నడుచునపుడా త్రోవనుండి పులిగాని, దొంగవాఁడుగాని తోడేలుగాని తప్పుకొని మాయము కాకతీరదు. మఱియున్దమతమ పగఱచే (శత్రువులచేత) నలువైపుల న్బారఁదఋమఁగొట్టఁబడక తప్పదు.

వెలఁగచెట్టు వేరుత్రివ్వితీసి నూఱిపాలలోఁగలిపి మఱిగించి యాచిక్కని పాలు త్రాగి యెక్కుడిన విల్లు తొడపైనుంచుకొన్నవానికి వ్రేలఁబడిపోయిన మగగుఱి (శిశ్నము) బిగితగిలి మిక్కిలిపైకి నిక్కును.

"యాత్వాం గన్ధర్వో అఖనదేవరుణాయమృత భ్రజే
తాం త్వావయం ఖనామస్యోషధిం శేపహషణీమ్."

ఓ వెలఁగవేరు నూఱిన ముద్దకలిపి మఱిగించిన చిక్కని పాలమందా! నిన్నునేను ద్రాగినతోడనే గుఱ్ఱము, కంకరగాడిద - కంచరగాడిద - వేసడము (అశ్వతరము), మేఁకపోతు, పొట్టేలు, ఆఁబోతులకు వలె నాకామ-ఋద్ధు-మగగుఱి విత్తనము (వీర్యము) న్జిమ్మని గుడించుము.

"అశ్వస్యాశ్వ తరస్యాజస్య పేత్వస్యచ
అథఋషభస్యయేవాజాస్తావస్మిన్ ధేహి తనూవశిన్."

ఉలిమిరి - ఇసుకద్రమాను - ఉలిమిడి-మావెలగ - మొగలింగ (వరుణావృక్షము) వేరునూఱి కలిపిన మంచినీళ్ళు త్రాగించినయెడలఁ బెట్టుమందు చిలుము (కందమూలాది జనితవిషము) నోఁగొట్టెదను.

"వారి దంవార యాతైవరణౌవత్యామధి
తత్రామృత స్యాసిక్తంతే నాశేవారయేవిషమ్"

సొమ్మసిల్లించు (మూర్ఛన్గల్గించు) నోఛిలుమా! యెగచినతూపుచేత వలెన్ని నృడఁగొట్టెదను. మేనంతట న్దిరుగుచగపడని కుంటెనకాని (దూత) వలె నున్న నిన్ను నా మంతరమువలన వెడల గొట్టెదను.

"ఏతేమదంమదావతి శరమివపాత యామసి
పరిత్వాచను మిపయేషన్తం వచసాస్థాపయామసి"

కొండలలో వెల్లముఁదిరిన కొండమంచు కొండమీఁద మువ్మూఁ పురముల మెట్ట (త్రికకుత్పర్వతము - త్రికూట పర్వతము) యామెట్ట - అంజనాచలము - కాటుక కొండ - యందుఁబుట్టిన కాటుకా! (అంజనమా) ఉసుఱుల (ప్రాణముల) న్దప్పకతీయువేఁకి తక్మమనఁబడు (జ్వరము), ఎండుతెగులు సన్నిపాత జ్వరవిశేష మైన బలాసము, పాము (సర్పము) ఈమూఁడుమ గులాములే (దాసులే) అనఁ గా నాకాటుక (త్రికకుత్పర్వతజనితాంజనము) వాఁడుటవలన నొండువెరవుల న్మాన్పింప నలవికానికాఁక (జ్వరము), ఎండుతెవులు(బలాసము), పాముచిలుము (సర్పవిషము) తప్పకపోఁగొట్టఁబడుట నిక్కమని తలంపు (తాత్పర్యము)

"త్రియోదాసా అఞ్జనస్యతక్మాబలాస ఆదహిః
వర్షిష్ఠః పర్వతానాంత్రికకున్నామతేపితా"

ఓకాటుకా! నీవు (త్రైకకుద) మను పేరఁబరఁగినప్పటికి (యమున) అనెడు నేఱిలోఁబుట్టుటవలన (యామున) మను పేర నొప్పారినప్పటి కో మేలొ న ర్చు మందా నీరెండుపేర్లనిన్గొనియాడు మమ్ముఁగాపాడుము.

"యదివాసిత్రైకకుదం యదియామున ముచ్యసే
ఉభేత భద్రేనామ్నీతాభ్యాంనః పాహ్యాఞ్జన"

ఓవలమురీ! (దక్షిణావర్తశంఖమా) నీవు వెండిబంగారు మొదలగు మేలి యుదినుసులలో (ద్రవ్యములలో), గన్నాకువు (శ్రేష్ఠము), నీవు జాబిలినుండి పుట్టినదానవు. పోరిలోఁదేరునందుసీవు చూడఁదగియుందువు. నీవందఱికి న్మేలు చేయువాఁడవు. (మహానుభావుఁడవు) కనుక నోకూఁతకైదువు తాయెత్తా! (శంఖ మణీ) మాయుసుఱును హాయిగాఁ బొడిగించుము.

హిరణ్యానామే కోసిసోమాత్ త్వమధి జజ్ఞిషే
రథేత్వమసిదర్శత ఇషుధౌరోచనస్త్వం ప్రణఆయూంషితాడిషత్

కైదువదెబ్బతగిలినచోట నెత్తురు గడ్డించుట కైవేకువతఱియందుమఱిగించిన లక్కతోళ్లమ (క్వథితలాక్షోదకము) న్మంతరించి నెత్తురు కారుచున్న చోటున్గడుగ

వలయును. పోటుతిన్నవానిన్ నెయ్యి పాలు కలిపి త్రాగించవలయు నామంతర మేమనఁగా.

''రోహణ్యసి రోహణ్య స్థ్నశ్ఛిన్నస్య రోహణీ
రోహయే దమరున్ధతి''

ఓ యెఱ్ఱని (లక్కా - లక్షా): నీవు మొలపించు దానవగుచున్నావు. కనుక నీవు కైదువనఱుకువలనఁ గారిపోవుచున్న నెత్తురు స్తంభించి యోయద్దులేని రాజీ (దేవీ) యీగాయమున్మఱల బాగుచేయుము. ఓ దెబ్బతిన్నవాడా: నీ మేనిలోని యాఅవదినుసైన యెముకలయందలి నేయి (మజ్జి) బాగగున్గాక. నీ యొడలియందు జాఱిపోయిన కీలు (పర్వము) నీకిమ్మగుతీరునఁదిరిగి గూటంబడి యత్తుకొనుఁగాక నీమేనన్దెబ్బవలన వ్రేలబడిరాలిన దొబ్బ (మాంసము) తిరిగి మొలచును గాక. నీవిఱిగిపోయిన యెముకతిరిగి యతుకుకొని గట్టిపడి యెప్పటివలె నీకు హాయినిచ్చుగాక.

''సంతేమజ్జా మజ్జాభవతు సముతే పరుషాపరుః
సంతే మాంజ పస్యవిస్రస్తం సమస్థ్యపిరోహతు.''

ఓ (లక్క) మందా: చెడిపోయిన వెండ్రుకలు, సంట (చర్మము), నెత్తురు, ఎముకలు మునుపటివలెఁబన్నుము, మేనియందలి యేయే తక్కినవంతులు (కడమయంగములు)తెగిపోయినవో యాయన్నిటినిదిరిగియత్తుకొనునట్లొనర్చుము.

లోమలోమ్నా సంకల్ప యాత్వచానంకల్ప యాత్వచమ్.
అసృక్తే అస్థిరోహతు ఛిన్నం సంధేహ్యోషధే.

ఓ దెబ్బలునఱుకులవలనఁ జెడినయొడల నొవ్వగులువాఁడా యలమంతరము మందులచేవవలన తిరిగి బాగుపడిగట్టిమేనితోఁ బాన్పునుండిపైకిలెమ్ము. గట్టియుండలు (సుచక్రములు), గట్టికమ్ములు (సుపవులు-నేములు), గట్టి ఇండి కన్నులు (సునాభులు-అక్షచ్ఛిద్రములు) ఈతీరగుతేరు మిక్కిలి నడువఁదగి యుండునో యాలాగుననే నీవుకూడ గట్టియొడలు కలవాఁడవై చప్పునఁ బైకుఱికి హాయి గాఁ బరుగిడ సమకట్టుము (ప్రతిష్ఠితుఁడవగుము). ''సఉత్ తిష్ఠప్రేహి ప్రద్రపరథః సుచక్రః సుపవిః సునాభిః ప్రతితిష్ఠోర్ధ్వః''

ఓవెఱుతురు - వెలుతురు చెట్టా: (సహదేవియను పేరుగల వృక్షమా) ఆఁడుది, కాఁపువాఁడు, చిప్పపట్టుకొని యడుగుకొనువాఁడు (కాపాలికుఁడు - సంకర జాతివాఁడు) మొదలగువారు కావించుచేయుపుచేఁతలు - చిల్లంగివలన బొడమినగొడివె (ఉపద్రవము) లన్నియు నిన్నుమట్టుకొనుటచేతనే తొలఁగిపోవును. నీవు మందు మ్రాఁకులకెల్ల దొరవు.

"ఈశానాం త్వాభేషజానాముజ్జేష ఆరభామహే
చకేర్రి సహస్రివీర్యం సర్వస్మా ఓషధేత్వా"

మందు మొక్కల్లో ఉత్తరేనొక్కటియే యెల్లమందు వ్రూఁకుల న్దనకులో కువ కావించుకొనఁదగు మొక్క. ఓచిల్లంగిపెట్టఁబడి తలడిల్లు తెగులుగొంటా! (అభిచారదోషగ్రహేతుఁడా!) నీవలుకువలన్నియు నాయుత్తరేనుచేత న్దుడిచివైచెదను, పిమ్మట నెమ్మదింబొంది నీవు కలకాలము హాయిగా దిరుగులాడుము.

"అపామార్గ ఓషధీనాం సర్వాసామేక ఇద్వశీ
తేనతే మృజ్మ ఆస్థితమథత్వ మగదశ్చర."

ఉత్తరేను మొక్కయిలుపు అరుఁదెవులు మొదలయినతాతతండ్రి తరముల మండియు న్వచ్చునంటుతెవుళ్ల (క్షేత్రియములయిన క్షయ కుష్ఠాప స్మారాదిక రోగముల) న్దుడిచివేయున్గాక. పగవారితిట్ల (శత్రువులుపెట్టిన శాపముల) న్గూడఁ దుడిచివేయున్గాక. అలాగుననే దెత్తుల (పిశాచముల) నోఁ్పదుల్చున్గాక, అలాగుననే ఎద్దడి - వాదారు-నిపచ్చ-నిప్పచ్చరము-నెవ్వ-షంజె-షంజెతనము -పేదర్కి-పేదఱికము - పేదఱిమి - బీదతనము - లిగాదు - లేమి - లేవడి - సీతరము - సీదర్రిముల (అరాయ్యముల- అలక్షుల)నెల్ల నోఁ్పఱిమ్ముగ్గాక.

అపామార్గోఽపమార్ష్టు క్షేత్రియం శపథశ్చయః
అపాహయాతుధానీరప సర్వాఅరాయ్యః

ఓవేఱుతురా! యోఉత్తరేనా! మీయిర్వురిలో నెవరైన నోఁఅపగఅను (సహజ శత్రువులమ) నడుమన్గిల్లంగి చెఱుపుచేఁతలన్గారించు పగవారల (ఆగంతుక-అసహజ శత్రువుల) కొడుకులు మనుమలు మొదలగు వారలనెల్ల వానకారున-మొలచులేఁత గఱి కపరకులలాగునఁద్రుంచివేయుము.

"ఉతో అస్య బంధుకృదుతో అసినుజామికృత్
ఉతో కృత్యాకృతః ప్రజాం నడమి వాచ్ఛిన్థి వార్షికమ్"

ఓయేలికా! తెల్లజీల్లేడు వేరుగల తాయెతా! (సదాపుష్పమణి) నిన్దాల్చిన వాడుఁ నింగినేలలందు జరిగినవి, జరుగుచున్నవి, జరఁగఁబోవునవెవ్వియైన పనులెల్లఁ దెలిసికొనియన్నియు నెఱుఁగఁజాలిన వాఁడై యేవెఱపునోఁ్పందఁ బోవఁడు.

ఆపశ్యతి ప్రతిపశ్యతి పరాపశ్యతి పశ్యతి
దివమన్తరి క్షమాద్ భూమింసర్వంతద్ దేవి పశ్యతి"

ఓ యెఱ్ఱజిల్లెడ వేరా! (సదాపుష్పిమూలమా!) నిన్ను తాయెతులోనుంచి నా కుడిచేతి మడికట్టు - పోఁచి - పోచీ (మణిబంధము) న్దాల్చుకొని బాఁపఁడు, దొర, కోమట్లు (ఆర్యులు) న్మఱి యీ మూఁడిరుఁ బుట్టుతెగలకుఁ జెందని కాఁపులు (అనార్యులు) సలుపు చెఱుపుచేఁతలకు లొంగకెల్లవారి న్నాకులోఁకువ చేసికొని నింగినేలల జరుగు పనులన్నియు న్గనొనఁజాలువాఁడనయ్యెదను.

తాంమేసహస్రాక్షేదేవో దక్షిణేహస్త అదధహత్
తయాహం సర్వంపశ్యామి యశ్చ శూద్రఉతార్యః

ఇట్టుపు - జుట్టుపు దుట్టువు -వద్దిచెట్టు - అజశృంగిలత - (బహ్మాదిలత) పెద్దతమ్మ మేముగైకొన్నంత (తీక్షశృంగి) నల్లఁద్రావుడు (రక్షస్సు)నోఁకుఁడు (పిశాచములు) మొదలయిన యిడుమల నడంచును.

"ఏయమగన్నోషధీనాం వీరుధాం వీర్యావతీ
అజశృంగ్యరాటకీతీక్ష శృంగీవ్యృషతు."

యోగిరిష్వజాయధా వీరుధాం బలవత్తమః
కుష్ఠేహితక్మనాశనతక్మానంనాశయన్నితః

అనుమంతరముచేత మంచిచెంగలికోష్ఠు (కుష్ఠము) దంచి పొడిచేసి యావెన్నలోఁగలిపిన ముద్దన్నాళ్ళు మొదలుకొని నెత్తివఱకు న్గ్రిందినుండి మీదికిఁదెగులు, గొంతు మేనిపైరాసినయెడల నఱుఁదెవులు(రాజయక్ష్మము)పులుము(పెద్దరోగము) మొదలయిన గడ్డుతెవుళ్ళు (అసాధ్యవ్యాధులు) చప్పున న్గుదిరిపోవును.

రాత్రీమాతానభః పితార్యమాతేపితా మహః
సిలాచీనామవా అసిసాదేవానామసిస్వసా"

అనుమిడియ (సూక్తము) చేత మంతరించి లత్తుక (లక్కా-లాక్ష) కలిపి మఱిగించిన యావుపాలు త్రాగించినయెడల కైదువవలనఁబడిన గాయములు దబ్బున మానిపోవును. అఁడుది నీళ్లాడఁజాలకున్నపుడు గాని బాలెంతతెగులున (సూతికారోగమున) నొగులునప్పుడుగాని

"బ్రహ్మజజ్ఞానం ప్రథమం పురస్తాద్ విసీమతః సురుచోవేన ఆవః
సబుధ్న్యా ఉపమా అస్యవిష్ఠాః సతశ్చయోని మసతశ్చవివః"

అనుమిడియ (సూక్తము) చేత మంతరించిన యువ్వనినిషించవలయును, మఱియాలాగుననే మంతరించి పేల (పిండి) జాపన్రాగింపవలయు నా రెండు తెవుళ్లు తెగుళ్లుక్కుదిరిపోవును.

ఈక్రింద వ్రాసిన మూఁడు మిడియల (మంత్రముల) చెప్పుచుఁ బాము కఱచినవాని జుట్టు ముడివేసినయెడల నెక్కడ నున్న చిలుము (విషము) అక్కడనే నిలిచిపోవును (స్తంభించిపోవును). తేనెటీఁగల నిప్పచెట్టు మొదటనున్న పొరి (మన్ను) కలిపి నూఱి నీళ్ళలోఁగలిపి పాముగఱచినవానిచేఁ ద్రాగింపవలయును. మఱియు నీవియినీళ్ళలోఁ గలిపి త్రాగింపవలయు నన్నిరకముల చిలుములు (విషములు) పోవును (నశించును).

౧॥ దివిహి॰ మహ్యాంవరుణోదివః కవిర్వఃచోభి రుగ్రైర్నిఃరిణామితే విషమ్
ఖాతమఖాతముతసక్తమగ్రభమిరేవధన్వన్నిజ జానతే విషమ్.

౨॥ అలిగీ చ విలిగీచపితా చ మాతా చ
విద్మవః సర్వతోబ న్ధ్వరసాః కింకరిష్యథ.

౩॥ ఉరుగూలాయా దుహితాజాతా దాస్యసిక్నార్న
ప్రితం కందద్రుషిణాం సర్వాసామర సంవిషమ్.

(అధర్వసంహిత యందాఱవ కాండములో)గుండెజబ్బు, నీటికడుపు (జలోదరము), (కామలరోగము - పిత్తరోగము) ఉదుర్చుటకై పాఱుచున్న యేటినీళ్ళు క్రిందుగా ముంచితీసి దానిలో నించిచూరుమీఁద మొలచిన గడ్డిపోఁచలు తీసివైచి తెగులుగొంటువైఁ జల్లవలయు నించుక త్రాగించవలయు నప్పుడీ మిడియనైప్పవలయును.

"హిమవతః ప్రస్రవంతి సింధౌ సమహ సంగమః
ఆపోహ మహ్యంతద్ దేవీర్దఃదన్హృద్ద్యోత భేషజమ్."

మంచుకొండయందున (హిమవత్పర్వతమందున) బుట్టి యొక్కలాగున నేకచలి (సముద్రము)లోఁ గలియుచున్న తెలియేఱు (గంగ) మొదలగు వఱదలు నీళ్ళు (నదులు) కీడులష్టుల్బు కతములు (పాపక్షయహేతువులు) కనునట్టి యేళ్ళనీళ్ళు మాగుండెమంట వ్రాన్పు మందువ్రాకిచ్చుగాక.

యస్మేఅక్షోరాదిద్యోత పాష్టోర్యః ప్రపదోశ్చయత్
ఆపస్తత్ సర్వం నిష్కరన్భిషజాంసుభిషక్తమాః.

ఏతెవుళ్ళు నాకన్నులన్నాగిలించునో నా కాలిమడమం క్రింద మీఁదులనే తెవుళ్ళునొప్పినలువుచున్నవో దెల్బు నిలువు - ఉరువు - ఆడ దేవతారూపములగు నీళ్లా నలుకువలన్నింటి నొప్పిఁగొట్టుగొప్ప మందగున్గాక.

మెడచుట్టు లేచుగడ్డలు - పుండ్లొక్కరకము లేక్క కేఁదియైదు వేఱొక్క

రకము డెబ్బదేడు, మఱొక్కరకము తొంబది తొమ్మిది. మొదటి పుండ్లు పెడతలనుండు నరములందు (మన్యలో) పుట్టును. రెండవరకము మెడనరములం (గ్రీవానాడులం) బోధమును. మూడవరకము మూపునరములందు (స్కంధ్యములగు ధమనులందు) బుట్టును. ఈ మూఁడు రకముల మెడచుట్టు పుండ్లు (గండమాలలు) వరుసగా నీక్రింది మూఁడు మిడియలు (వేదమంత్రములు) చదువుచున్నకాలం దినష్టచ్చమాసిపోవును.

౧॥ పంచ చయాః పంచాశచ్చ సంయంతి మన్యా అభి
ఇతస్తాః సర్వానశ్యంతువాకా అపచితామివ.

క్రొత్తడి నెగ్గించు మాటలు (పతివ్రత న్దూషించు దురుక్తులవలె వాకములుఁ జెడున్గాక.

౨॥ సప్తచయాః సప్తతిశ్చ సంయంతి గ్రైవ్యా అభి
ఇతస్తాః సర్వానశ్యంతు వాకా అపచితామివ,

౩॥ నవచయాన వతిశ్చస్కంధ్యా అభి
ఇతస్తాః సర్వానశ్యంతు వాకా అపచితామివ
రుద్రస్యమూత్రమస్యమృతస్య నాభిః
విషాణకానామవా అసిపితౄణాంమూలాదుత్థితావాతీకృతనాశనీ

తనంతఁదానూడి నేలన్బడి పోయిన యావు కొమ్ము నైకొని నీళ్ళలోఁ బడవైచి యాకొమ్ములోని నీళ్ళను "అస్థావ్ ద్యౌః ॥" అను మిడియ (సూక్తము) చేత మంతరించి నెత్తురు కారు తెగుబు తగిలిన తెగులు గొంటు (రుధిరాస్రావరోగి) నెత్తురు కట్టిపోవుటకై వానిచేత దాగ్రించవలయును. మఱియుత్తెగులు గొంటుపైఁ జిలకరించ వలయును

"అస్థావ్ ద్యౌరస్థాత్ పృథివ్యస్థాద్ విశ్వమిదంజగత్
అస్థుర్వృక్షా ఊర్ధ్వా స్వప్నాస్తిష్ఠాద్ రోగో అయంతవ."

(గ్రహముబు-గ్రామములు) చుక్కలు (నక్షత్రములు) గలనింగి (దివి-ద్యులోకము) కదలక క్రిందన్బడకున్నది. అన్నిదినుసుల కంశ (ఆధారము) యగునేల నిలిచి యున్నది. నిబువఁబడి కూర్కెడు చెట్లు నిలుచుకొని యున్నవి. ఓనెత్తురు కారు తెగుబు గొంటా! (వ్యాధితుఁడా!) నీయీ నెత్తురుగార్చు తెవులు మఱి నెత్తురుకార్పక నిలిచిపోవున్గాక.

ఎలుకలు, మిడుతలు, పిట్టలు, చీడపురుగులు, లేళ్ళు, ఆఖువలు (శల్యకములు), ఉడుము మొదలగు పంటచేలన్నిను పైతాల్పులనోఁగొట్టుటకై "హతంతదర్శమ్" అనుమిడియ (సూక్తము) చేత మంతరించి కలిపిన యినుము సత్తులు (లోహసీసములు) గాని యినుకన్గాని పంటచేలయందందందఁ జల్లిన యెడలన్గాని పైమిడియతో మంతరించిన యినుక నా యెలుకలు మొదలయిన వుండు నెలవుల నల్లినన్గాని లేకెలుక మొదలగు నేపైతాల్పుల నేదానినైననవ్వెండుగ్రికల తాడుతోఁ గట్టి పొలమునడు మన్పాఁతి పెట్టినఁగాని యెల్లకీడులు న్డొలఁగి పోవును.

"హతంతదర్శాం సమంకమాఖుమశ్వి నాచ్ఛింతం శిరో అపిపృష్టీఃశృణీతమ్।
యవాన్నేద దాన పినహ్యతాం ముఖమధాభయం కృణుతందాన్యాయ.॥

ఓకవశేల్పులారా ! (అశ్వినీదేవతలారా) పంటచే నిన్నొఱుకు నెలుక కన్నములో మీరుచొచ్చి యాయెలుకన్గంపుడీ, యద్దాని తలరెండు ముక్కలు చేయుఁడీ, దాని యిరువైపుల యెముకలన్నుఱుము కావించుఁడీ, ఆయెలుక మాపంట న్దిన వీలుకానట్లు దాని నోరు కట్టివేయుఁడీ, యిట్లు చేసి మాపంట చేలకే చెఱుపురాని వ్వాక వెఱవెల్లనోఁగొట్టుడీ.

("మానోదేవాః"॥) అను (మంత్రము) చేత మంతరించిన యినుకన్పాము తేలు మొదలగు వాని వలనఁ గలుగు వెఱవు (భయము) న్మాన్పుటకై యిల్లు పొలము మొదలగు చోట్లఁ జల్లవలయును మఱియు నగ్గి పురితాగ్రిళ్ళిండ్లు వీడులు మొదలగు విడిది గుమ్మముల నల్లవలయును. అలాగుననే మంతరించి యావు పేఁడతో నిండ్లు వాకిలి గుమ్మములలికి కళ్ళాపు చల్లుట గడపల క్రిందఁబూడ్చి పెట్టుట చేయవలయును. లేక కిత్తు (అగ్ని) లో వేల్చవలయును. లేకుత్తరేను (అపామార్గము) గాని, తిప్పతీఁగెన్గాని కల్పిన నీళ్ళనమ్మంతరించి చల్లవలయును

"ఇదమిద్వా ఉభేషజమ్" అనిపుండ్లను కుమర్పుటకై మంతరించిన ఆవు చ్చుతో మొనచూపని పుండుపై రుద్దవలయును. అలాగున పండ్లపాఁచి (దంతమలము) మ్పుండు పైరాయవలయును. అలాగుననే నుఖుగన్మంతరించి కుఱుపు పై రుద్దవలయును.

మానోదేవా అహిర్వధీత్ సతోకాన్త్సహ పూరుషాన్
సంయతం నవిష్పరదే వ్యాత్తనసంయ మన్న మోదేవజనేభ్యః

ఓవేల్పులారా ! చిలుమునోఁగొట్టు నేర్పరులారా ! (విషప్రతీకారకుశలులారా !) పాము మమ్ముల న్గారింపకుండున్గాక (హింసింపకుండుగావుతను) మేము మాకన్న బిడ్డలతోడన్మనుమలతోడ, మమ్మున్గొల్చు పనివాండ్రతోడు

తనున్నారము. పాము తననోరు తెఱవఁజాలకుండున్గాక. పాము కఱచుటకై తెఱచిన నోరు మూయఁజాలకుండున్గాక. మంతరము (మంత్రము) చేవ (సామర్థ్యము) చేతన్నాము కట్టఁబడి యుండున్గాక. పాము చిలుము (విషము) నడంచులావుకల (సమర్థులగు) వేల్పుకవలకు (అశ్వినీదేవతలకు-దేవభిషక్కులకు-దేవజనులకు) మ్రొక్కెదము.

"ఇదమిద్వా ఉ భేషజ మిదంరుద్రస్య భేషజమ్
యేనేషు మేకతేజనాంశత శల్యామపబ్రవత్"

ఇదియే పుండు స్గదుర్చగల మందు (భేషజము) ఇదేముక్కంటి (రుద్రుని) మందు. ఈ మందుచేతనే అంగమొలవేల్పు-ఎత్తులకెకి మీఁదు-కడలిబత్తలికదునే దారి-కప్పుమైదువ పెనిమిటి-కాటిఱేఁడు-కాటేరిఁడు-కుత్తుకఁగందువాఁడు - కొండయల్లుఁడు-కొండవీటి జంగము-కోడెరవుతు-గట్టువిల్కాడు-గట్టువిల్తుడు-గిత్తతత్తడి ఱేఁడు-గిబ్బరౌతు-గుజ్జువేలుపుతండ్రి-గుబ్బలివిలుకాఁడు-చిలువతాలుపు - జడముడి జంగము - జాబిలితాలుపు - జాబిలితాల్ప-జింకతాలుపరి - జింకతాలుపు - తెల్లనిదొర - తోలుదాలుపు - తోలుదాల్ప - దిసమొలవేల్ప - నెలతాలుపు - పాఁపతొడవుల వేలుపు - పొడలగింటెముదాల్ప - బుడుతనెలదాల్ప - బేసికంటి - బేసికంటివేల్ప - మిక్కిలి కంటివేల్ప - మిన్నువాక తాలుపు - ముక్కంటి - ముక్కొటికలకంటు - మేలిమిమెట్టువిల్కాటి - వలిమలల్లుఁడు - వాఁకతాలుపు - వినువాఁకమోపరి - వెండికొండదునీడు - వేఁడికంటి - వేల్పుటేటిమగడు - వేల్పువణిఁగన్నతఁడు (రుద్రుఁడు). ఒక్కవెదురు కోలకు గడకు నూఱుములుకులు నాటిన యంబుచేత నెట్లు ముక్కొటికల (త్రిపురముల) మచ్చ మాపుటకు వాడెను.

"జలాషేణాభిషించత జాలాషేణోపసించత
జాలాషము గంభ్రిభేష జంతేననోమృడ జీవసే."

నీళ్ళ (ఉదకము - జలాషము) అనఁగా నావుచ్చనురుఁగు (గోమూత్రఫేనము) నోపనివాండ్రారా ! (పరిచారకులారా !) పై మంతరముచేత మంతరించి పుండు నెల్లన్గడుగుఁడీ, ఆయావు యొక్క యుచ్చ-పంచితము నురుగున్పుండుపైఁజిలుకరించుఁడీ. పుండును నఱుకునుఁ గుదర్చఁగలమందిద్దియే. ఓముక్కంటీ! యీ నీ మందుచేత మమ్ముహాయిగా బ్రతికించుము.

శంచనోమయశ్చనో మాచనఃకించ నామమత్
క్షమారపో విశ్వంనో అస్తుభేషజం సర్వంనో అస్తుభేషజమ్.

పనిచేయలేనిపట్ల మందరి జన్నిగట్టు (బ్రాహ్మణశిష్యుల్కు) మిడియయలవు (మంత్రిశక్తి) చేతనేగడ్డుతెవుళ్ల (అసాధ్యరోగముల) నోర్వఁగొట్టఁగలుగుట నిక్కము.]

పిల్లిపీఁచర (శతావరి) ఈ మొక్కలున్నచోట న్నులి యుండఁజాలదు. గనుక లేళ్ళు పీచరయున్నచోట తిరుగులాడును.

గాడిదె గడపర (పిండీతకము) ఆకులు నమలిన పండ్లు గట్టిపడును.

''యావదంగినం పౌరస్వతం హాస్తినంగార్దభం చయత్
యావదశ్వస్య వాజినస్తావత్ తేవర్ధతాంపసంః''

గొఱబోతు (పరస్వత్తు), ఏనుగు (హస్తి), గాలిగాడు (గాడిద) గుఱ్ఱము లకు దమతమ పెంట్లన్గవగూడునపుడెంతలేసి బడ్లు (ప్రజనములు-శిశ్నములు) నిగిడి యెంతలేసి యుండునీకామకూడఁధాయత్తు మంతరము. మందులచేత (మణి మంత్రౌషధములచేత) అంత పెద్దదై నిగిడి చెలువల కోర్కె తీరఁదన్నువ్వాక.

మెడచుట్టు పుండ్ల (గండమాల) మీఁద వలమురినఱఁగఁదీసిన ముద్దన్గాని యేపిచొంగన్గాని ''అపచితః॥'' అనిమంత్రించి పూయవలయును. అంబారు పిడుఁజు (జెలగ - జలూక) న్గాని బల్లి (గృహగోధిక) న్గాని యాపుండ్ల వరుస (గండమాల) కున్దగిలి నెత్తురు న్పీల్పించవలయును. "అపచిత్ః" "ఆసుస్రవః" అని మంతరించి యెట్టని యుప్పు నూఱిన పొడి యాపుండ్లపైఁ జల్లి యుమిసి తడుపవలయును. "గ్లౌరితఃప్రపతిష్యతి"॥ అని మెల్లఁగా నోటననుకొనుచు (జపించుచు) మెడచుట్టు పుండ్ల వరుసపైనావుచ్చ - పంచితము (గోమూత్రము) రాయవలయును. లెన్సగా దోమిగడుగవలయును. పండ్లపాచి (దంతమలము) స్పట్టించవలయును.

"వీహిస్వావమ్॥'' అని మంతరించిన నీళ్ళతో న్వాల్గుకాళ్ళయుమురుల (చః ష్పాత్తు) మెడచుట్టు పుండ్ల (గండమాల) పైఁజిలకరించ వలయును. ఆమంతరవ చేతనే నేయివేల్చి యుల్లమునఁబూనికతో నాపుండ్లు మానిపోవుగ్గాక యని -త ఘుకొని (మనసాసంకల్పించుకొని) యానేయి పుండ్లపై వేయవలయును.

"అపచితః ప్రపతత్సుపణోఽవ సతరివ
సూర్యఃకృణోతు భేషజంచంద్రమావో పోచ్చతు."

కీడు వలన మెడకింద్రి కుఁదునల్లుకొని లేచిన గడ్డలాగా మీరుదఁ డలి న్విడిచి చిలువతిండి (శ్మేనము) తన గూడునుండి పైకెగిరిపోవున.

ఓ మెడచుట్టు పుండులారా ! పగటి వేల్పు (సూర్యుఁడు) మిమ్ము నాశనము సేయునుగాక (చికిత్స మీకుఁ జేయునుగాక)

"ఆసూతికారామాయణ్యక్ష పచిత్ ప్రపతిష్యతి
గ్లౌరితః ప్రపతిష్యతి సగలుంతో నశిష్యతి."

కంపుచీమెల్లపుడున్నార్చు నరము (రామాయణి) గల మెడచుట్టు కుఱుపు (గండమాల) దబ్బున నీ మంతరపు చేవచేత (మంత్రసామర్థ్యముచేత) నీయొడలి న్విడిచి యొండుచోటికిఁ బరుగెత్తి పోవును. పుండువలనఁ గలిగిన వంత (గ్లౌ) గూడఁబుండు మానిపోయిన తోడనె తొలఁగిపోవును. లేక పంచితమునఁబుండు తడపఁబడు కతన జాబిలి యాపుండునొప్పిఁగొట్టును.

"వీహిస్వామాహుతింజుషాణో మనసాస్వాహామన సాయదిదంజుహోమి
ఈమంతరముతొడుకు (పసరముల) పుండ్లు మాన్పుటకై వాడవలయును.

"వరణో వారయాతా అయందేవో వనస్పతిః
యక్ష్మోయో అస్మిన్నావిష్టస్తము దేవా అవీవరన్"

ఈవి మొదలగు మంచి యోజల (గుణముల) నలరునో పూచకకాచుచెట్ల (వనస్పతుల) యేలికయగు నీయులిమిరి మాఁకుపేరుగల తాయెత్తు (మణి) తప్పక దొరయుఱుఁదెవులు (రాజయక్ష్మము) మొదలగు తెగుళ్ళనొప్పిఁగొట్టునాక. ఈతనికే తెగులు తగిలెనో దానినంతయు న్వేలుపుఱేఁడు మొదలగు వేలుపు లందఱునార్చెదరుగాక.

"ఇంద్రస్యవచ సావయంమిత్రస్యవరుణస్యచ
దేవానాంసర్వేషాంవాచాయక్ష్మంతే వారయామహే"

తాయెత్తున్గట్టెడు మేము (మణిబంధనకర్తలమగు మేము) ఓతెగులుగొంటా! (వ్యాధితుడా!) నీయొక్క తెవులును వేల్పుఱేని (ఇంద్రుని) అప్పణ - అప్పన - ఆఁక - ఓజ - కట్టడ - తోడు - దురా - దురాయి - పంపు - పని - పనుపు - పన్పు - ముదల - సెలవు (ఆజ్ఞారూపక వాక్యము) న్బట్టి పోఁగొట్టుచున్నారము. ఒక్క వేల్పుఱేనిమాటయేకాదు. పన్నెండుగురు పగటివేల్పులు (ద్వాదశాదిత్యులు) లోఁ జేరిన మిత్రుఁడను వేల్పువరుణుఁడనఁబడు వేల్పుదురాయిన్బట్టియు దక్కిన వేల్పులందఱి మాటల చొప్పున న్గూడ నీతెగులునొప్పిఁగొట్టెదము. నీకడుపులోని వైదార (వైశ్వానరాగ్ని - జఠరాగ్ని) బాగుగా వెలిగించి నీ తెవుళ్ళను దిర్చెదను.

"ఏవాతేఅగ్ని నాయక్ష్మం వైశ్వానరేణవారయే."
"ఆపఇద్వా ఉభేషజీరాపో అమీవచాతనీః
ఆపో విశ్వస్యభేషజీ స్తాస్తే కృణ్వంతు భేషజమ్."

అన్ని మందులు న్నీళ్ల మాఱ్పులే (వికారములే) కమక నీళ్ళే తెవుళ్ళనెల్ల న్గుదుర్చఁదగినమందు. కావుననే యెల్లతెవుళ్ళనీళ్ళులే పోఁగొట్టఁగలుగును, కాబట్టి యన్ని తెగుళ్ళనోఁగొట్టఁజాలిన మందగు నీళ్ళే తెగులు గొంటాః నీ నలుకువలనన్నింటిన్నీ శ్శేకుదుర్చున్గాక.

"అశ్వత్థోదేవసదనః॥" అనుమిడియ తృచము (తృణము) చేత మంతరించి దొరయఱుఁదెవులు (రాజయక్ష్మము), పులుము (కుష్ఠరోగము) మొదలగు గడ్డు తెవుళ్ళనడంచుటకు చెంగల్వకోస్టు (కుష్ఠము) నూఱి యపుడే చిలికి తీసిన యావు వెన్నలోఁగలిపి తెగులు గొంటు మేనికెల్ల న్గ్రిందునుండి మీఁదికిఁ బూయవలెను.

"అశ్వత్థోదేవ సదనస్తృతీయ స్యామితోదివి
తతామృతస్యచక్షణం దేవాఃకుష్ఠమవన్వత"

"యాఓషధయః॥" అని మంతరించి పుల్లతీఁగ (సోమలత) న్నిప్పులోవేసి జన్నిగట్టు తిట్టి (శాపము), నీళ్ళకడుపు తెగులు (జలోదరము - జఠరామయము) తఱిగి పోవుటకై తెగులు గొంటునకుఁబొగ వేయవలయును. తేనెలోఁగలిపి పెరుఁగున్ద్రాగించవలయును. పాలుచల్లయున్గలిపి త్రాగించ వలయును.

యా ఓషధయః సోమరాజ్ఞీఃబహ్వీఃశత విచక్షణాః
బృహస్పతి ప్రసూతాస్తానో ముంచంత్వంహసః

జాబిలిచేనెలఁబడుచు వందలకొలందిన్గన్పట్టుచునుడువుఱేనిచేత నాయాతెవుళ్ళనోఁగొట్టుటకేపఱచఁబడిన తీఁగెమందులు పెక్కు తెఱఁగుల తెవుళ్ళ కాఁటపట్టు లగు కీడులనుండి మమ్మున్దప్పించున్గాక.

"దేవాఅదుః॥" అను మిడియ (మంత్రము) చే నుసురులేని దిమసుల చిలుము (స్థావరజంగమ విషము) నోఁగొట్టుటకై పుట్టపొరి (వల్మీకమృత్తిక) న్దెచ్చి మంతరించి నీళ్ళతోఁగలిపి యొడలికి బూయవలయును ద్రాగింప వలయును.

"దేవా అదుఃసూర్యో అదాద్ ద్యౌరదాత్ పృథివ్యదాత్
తిస్రఃసరస్వతీరదుఃస చిత్తా విషదూషణమ్"

వేలుపులందఱున్గూడ నుల్లము లొక్కటి కావించుకొని (సచ్చిత్తులు) యన్నిరకముల చిలుము (విషము) నడంచు మందిడుదుముగాక. వెల్గుఱేఁడు (సూర్యుఁడు) చిలుమునడంచు మందొసంగున్గాక నింగి (ద్యులోకము) యా మందిచ్చున్గాక, నెలవేలు పొసగున్గావుత. (ఇడా, సరస్వతి - భారతి) యను పేర్లన్బరఁగిన మువ్వురు వేల్పులా మందొసంగుమరుగాక.

"యథామనోమనస్కేతైః" అని మంతరించిన పేలపిండిజావ తెమడ దగ్గు తెవులు మొదలగు తెవుళ్ళు తగ్గింపుటకై తినవలయును.

''యథామనో మనస్కేతైః పరాపతన్త్యాశుమత్
ఏవాత్వంకాసే ప్రపతమనసోను ప్రవాయ్యమ్.''

ఎట్లు తెలివిగల యుల్లము యొక్క తలంపొదవినంతనే (బుద్ధితోఁగూడిన మనస్సు) తలంచినతోనె అన్నిచుక్కలకన్న మీఁదుగానున్న చుక్క (ధ్రువ నక్షత్రము) కు న్గూడఁబఱిగిడునో యట్లే నీవోతెమడదగ్గు తెగులా! (కాసశ్లేష్మ రోగాత్మికమా) తలంపువడితో (మనోవేగముతో) ఈ తెగులుగొంటు (కాసశ్లేష్మ రోగిని) విడిచి పరుగిడిపొమ్ము.

''పిప్పలీక్షిప్తభేషజీ" అని మంతరించి మిరియము - మిరెము - మిర్యము న్గాని, పిప్పళ్ళ మోకిన్గాని వెంటిగాలి తెవులు (ధనుర్వాతరోగము) తగిలిన తెగులు గొంటున్దినిపించవలయును.

"పిప్పలీక్షిప్త భేషజ్యా ఇతాతి విద్ధభేషజీ
తాదేవాఃసమకల్పయన్నియం జీవితతాఅలమ్"

(పిప్పలి - కణ) అనెడు రెండుపేర్ల నొప్పారు పిప్పలి మోడు మందు యొక్క తక్కిన మందు మాఁకులనన్నిటి న్దూఱును (తిరస్కరించును) లేక గాలి తెవులు (వాతరోగవిశేషము) న్బోఁగొట్టును. తెగుళొక్కింతయున్మిగుల నివ్వక తగిలి వేయును. (అతివిద్ధయగును) వేలుపులు పాలకడలిన్దరిచ్చునపుడి మందొక్కటి యెల్లతెవుళ్లన్బాపన్బి యెల్లరన్గోరినన్వాళ్ళు మనుపజాలునని తెలిసి కొని కడులెస్సగా నీమందున్గూర్చుకొనిరి. (కల్పించుకొనిరి).

''అసురాస్త్వాన్యఖనన్ దేవాస్త్వోదవపన్ పునః
వాతీకృతస్య భేషజీ మథోక్షిప్తస్య భేషజీమ్"

ఓ విప్పళ్ళమోడీ! (పిప్పలీ) నిన్ను దొలివేలుపులు (అసురుల్లు - పూర్వ దేవులు) త్రవ్విరి. వేలుపులు నిన్నెల్లయుసురులమేలునకై పైకిఁదీసి తెచ్చిరి.

నీవెట్టిదానవనిన గాలి తెగులు తగిలిన (వాతరోగా విష్టమగు) మేనికిఁదగిన మందువు. మఱియును మేనియన్ని వంతుల (శరీరావయవముల) నెల్లఁబైకెగరించు విసరుగాలి తెగులు (ఆక్షేపక వాతరోగము) న్దబ్బునవాృన్పఁగలమందువుః

"విద్రధస్య బలా సస్యలో హితస్య వనస్పతే
విసల్పకస్యోషధే మోచ్ఛిషఃపిశితంచన"

ఓ పూచికాయని చెట్టా (వనస్పతీ) నాలుగువేళ్ళ (అంగుళముల) మోదుగుమొక్కాః యోమందాః (ఓషదీః) దామర విసర్పము - మండలాకారమైకుష్ఠ వ్యాధి) మొదలయిన తెవుళ్ళనుదుర్చు మందాయొడలిన్బగుల్చు నొక్కరకమైన తెగులునకు (విద్రధిరోగమునకు) మేని చేవ(బలము)న్జెఱచు దగ్గువగపుఁ బుట్టించు తెమడతె గులునకు (బలాసరోగమునకు- శ్లేష్మరోగమునకు), నెత్తురోడ్చు తెవులునకు (లోహితరోగమునకు), నరములనుండి యొడలిలోనంతటన్బ్రాఁకెడు లోఁబులుము తెవులునకు (విసర్పకవ్యాధికి), ఈ రకమైన తెవుళ్లకుఁగతము (నిదానము) గానుండు చెడు చియ్య (దుష్టమాంసము) కుళ్ళంట (మేని చముఱము) గాలి, వేఁడి, తెమడల (వాతపిత్తశ్లేష్మముల) నంట, నెత్తురు, నంజుడు మొదలగు దినుసుల (త్వగసృఙ్మంసాదుల)ఁ జెఱచి దామర మొదలగు తెవుళ్ళు పొడుముచుండును గాన నట్టి తెవుళ్ళన్మొదలంటనూడఁ బెఱికివైచుము. నాల్గు వేళ్ళపొడవుగాఁ బెరిఁ గెడు మోదుగు మొక్కన్వేళ్ళతోఁ గూడన్బెఱికి తెచ్చి బాగుగాదంచిన ముద్ద దగ్గు, వగరుపు. పులుము మొదలగు ముగ్గొయ్య (అసాధ్యములగు) తెవుళ్ళన్నొగులు తెగులు గొంటు (రోగి) యొడలంతట న్బుట్టించుచున్న యెడలఁగొలది పూటలలోఁ దెవుళ్ళన్నియునాృనిపోవును.

"యాతే బలాసతిష్ఠతఃక క్షేముష్కావపశ్రితా
వేదాహంతస్య భేషజంచీపు ద్రిరభిచక్షణమ్"

ఓ మేనిచేవ (బలము) న్బోఁగొట్టు దగ్గువగరుపుల న్బుట్టించు తెగులాః (బలాసమాః) చిరుగుడు - ఎఱ్ఱపులుము (రక్తకుష్ఠవ్యాధి - విసర్పము) దామర చిడుము మొగలగు చీడలు చంకలలో. వట్టలన్ - బీరిజములన్ (ముష్కముల - వృషణముల) నల్లు కొన్న తెగులు (బలాసము) నకు నేను మందున్గనిపెట్టినాఁడ నామందేదనఁగా ముుండ్లవెలగగాని, ఓకిరేను - గంగరావిగాని, రేగుగాని (చీపుద్రివు).

"యోఅంగ్యోయః కణోక్యాయో అక్ష్యోర్విసర్పకః
వివృహామో విసల్పకం విద్రధంహృదయామయమ్"
పరాతమజ్ఞాతం యక్ష్మమధురాంచంసువామసి."

కాళ్ళేఁగవలందు వీనులందు (చెవులయందు), కన్నులయందు నల్లుకొని పలుతెఱగులు గానగపట్టు చిరుగుడు (విసర్పకము) న్మొదలంత నూడఁబెఱికి వైచెదను. ఆలాగుననే పుంఢ్ల తెగులు (విద్రధము), గుండె తెగులున్గూడఁబోఁ గొట్టెదను. మఱియు నెఱియఁబడక (అజ్ఞాతమై) మీఁదిమేని నుండి క్రింది మేనికి దిగఁబాఱుకు తెవులున్మళ్ళించి వెళ్ళఁగొట్టెదను.

"రథజితామ్" అను మొదలగు ముమ్మిడియల (సూక్తత్రియము) చేత మంతరించి తనకు లొంగని చెడ్డయాఁడుదానిన్ (దుష్టస్త్రీని) లోఁకువచేసికొనుటకై యాపెనడుచుతోవలో మినుపగింజల న్గాని (మాషముల), వేఁచిన జనప విత్తుల న్గాని చల్లవలయును. ఆయాఁడుదాని బొమ్మను వ్రాసి చదువునఁ జెప్పిన చొప్పున (సూత్రోక్తప్రకారముగా) విల్లు కోలలఁజేసి యాబొమ్మ ఱొమ్మునా యంబు న్గుప్పవలయును.

౧॥ "రథజితాంరాధజితే యీనామప్సర సామయంస్మరః
దేవాః ప్రహిణుతస్మరమ సౌమూమను శోచతు"

తేరివలన (రథమువలన) గెల్వఁబడిన మినుమను మందాః (మాషాఖ్యౌ పధీ) తమయెక్కుడుల (వాహనముల) చేత నింగినేలలనెల్ల (విశ్వమంతయును) గెల్చుచు విసువు (వైరాగ్యము) పుట్టించు (తగులమున్మాన్పు - విరక్తిన్గావించు) (ఊర్వశియనంబడు) వినుమిటారి మొదలగు వేల్పు చెలుల (అప్సరసల) నొద విన యిక్కూటమి కోర్కి (కామము) నాయెడల లేకుంటచే నిచ్చెడిప (దుష్టస్త్రీ) నన్దగులకున్నది. కావున నావలదొర - తలఁపుచూలియీ పెనన్వలచి తలడిల్లు నటొ నర్చున్గాక.

అసౌమేస్మర తాదితి ప్రియోమేస్మరతాదితి
దేవాః ప్రహిణుతస్మరమ సౌమూమనుశోచతు"

౨॥ యధా మమస్మరాద సౌనాముష్యాహంకదాచన
దేవాః ప్రహిణుతస్మర మసౌమూమనుశోచతు.

ఈ మగవాఁడునన్ను నెల్లపుడున్దలంచున్గాక. నిన్ను వలచి యలరు విలుతు బారిన్పడుఁగాకయని యాగయ్యాళి యెల్లపుడు నాపైఁదగునట్లు వలదొర (మన్మధుఁడు) ఆపెన్పురిగొల్పుఁన్గాక. ఆమెపైనే నొక్కపుడు న్మరులు కొననితెఱఁగు నన్నా చెఱకు విలుకాఁడొనర్చున్గాక. నేనతని న్గోరనప్పటికతఁడు నన్వలచు న్గాకయని యామెనన్మరులొక్కనినా పొందునకు వ్వెళులూరు చుండున్గాక.

"దేవీ దేవ్యామధి జాతాపృథి వ్యామస్యోషధే
తాంత్వానితత్నికేశేభ్యోదృంహణాయఖ నామసి".

ఓకాంచిచెట్టా! ఉడుసరా - నేలముప్పినీ మొదలగు (కాచమాచీప్రభృతికా) నేలమైనలరుచున్నావో గొప్ప మందు మొక్కా! నాజుట్టు కుదుళ్ళుగట్టి చేయుటకై నిన్ను నేను దర్విశ్వ తీయుచున్నాఁడను.

తిరశ్చిరాజేరసి తాత్ పృదాకోఃపరిసం భృతమ్
తత్ కంకపర్వణో విషమియం వీరుదనీనశత్".

కట్లపురుగు - కట్టెడ - మిడినాగు - (తిరశ్చిరాజీ), నల్లత్రాచు (అసిత పృదాకువు) చిలుమును (విషమును), పులికోచ (కంకపర్వము) నంజును (విషమును) నీ (యష్టిమధుకము - అతిమధురము) పేరుగల మందు తీఁగ పోఁగొట్టునుగాక.

యఉభాభ్యాంప్రహర సిపుచ్ఛేన చాస్యేనచ
ఆస్యేఽనతే విషంకిముతే పుచ్ఛదావసత్

ఇక్కడ తేలుతో ననుచున్నాఁడు. ఓ తేలా! నీవు తోఁకతో నోటితో రెండింటితోఁగూడఁ గుట్టుచున్నావు. కాని నీకు నోటనైనాని తోఁక వెండ్రుకలన్నాని నంజు-చిలుము (విషము) లేదు కనుక నీకాటు కొంచెము కొంతసేపు నొప్పి చేయున్నాని మఱేమియు జేయఁజాలదు.

"అగ్నేత పస్తప్యామహ ఉపత ప్యామహేతపః
శ్రుతాని శృణ్వంతోవ యమాయుష్మంతః సుమేధసః".

ఓ వైదార - వరుపు - కణకు - డిగ్గి - తెఱ - తెఱ్ఱి - నిప్పు - నిప్పుక - మల్లె - వయిరవులు - వయిరాలు - వెరవులు - వైరాలు (అగ్గీ) నీవెంతన్నట్టడ (నియమముగొని) నుండి యొడలెండబెట్టుకొని చిక్కెదము. (తపమార్జించు కొందుము), ఆనోము - కాఁక (తపస్సు) చేత తిన్నగా వల్లించుకొన్న తొలుఁ బల్కులు (వేదశాస్త్రములు) వినుచు మాయుగము (ఆయువు) పొడిగించుకొని వలసిన న్నేండ్లు హాయిగాఁ దెల్వితేటలతో బ్రతికెదము.

అపేహ్యరి రస్య రివాః అసి
విషేవిషమ పృక్థావిషమిద్వా అపృక్థాః

ఓనంజా (విషమా) పాము కఱచిన వానినుండి తొలఁగి పొమ్ము. నీవెందు వలనఁబగ (శత్రువ) వగుచున్నావో వీనికే కాదందఱికిన్నగవాఁడవేయగు

చున్నావుగా? కావున చిలుముగల చిలువ (విషవత్సర్పము) శేనీవెక్కుము చిలుమా! నీవేపాపమునకుఁ జెందినావో యాపాపమునకే యెక్కి యద్దానినే తెగటార్చుము.

''యత్స్వప్నే అన్నమ శ్నామిన పాత్రితరధిగమ్యతే
సర్వంతదస్తు మేశివంన హితద్ దృశ్యతేదివా"

కలలో నేనే కూడు తినుచున్నానో యాబువ్వ తెల్లవాఱన్గాన్పించకున్నది. పగలైనన్గన్పట్టకున్నది. కలలోఁగుడిచినట్లున్న కూడంతయున్నాకు మేలే (శుభమే) చేయున్గాక. కలలోఁగూడా కుడుచుటవలనఁ గలుగఁబోవు చేటిమిడి యు (మంత్రము) చేతనణఁగిపోవున్గాక.

దగ్గు తెమడ తెగులున్మాచ్చు కొనుట కొఱకు "అవదివస్తారయంతి"॥ అని మంతరించిన కూడు (అన్నము) గాని, పలచఁగాగాఁచిన పేలాలపొడి (పిండి) గాని యారగింపవలయును. మంతరించిన మంచినీళ్ళనైనఁ ద్రాగవలెను. పగటి వేల్పు (సూర్యు)నైననోలువవలయు (సూర్యోపస్థానము) జేయవలయును.

"అవదివస్తారయంతి సప్తసూర్యస్యరశ్మయః
ఆపఃసముద్రియాధారాస్తాస్తేశల్యమసి స్రిసన్"

ఒక్క వెలుఁగుతేని (సూర్యుని) వంతులే యేడుతెఱఁగుల పగటి వేల్పులగుచు వానన్గురియించుచున్నారా వాననీరో తెగులుగొంటా! నీదగ్గు తెమడ మొదలగు తెవుళ్ళ (కాసశ్లేష్మాదిరోగముల) నోఁగొట్టుఁగాక.

''ఇవతే సురిహపాణ ఇహాయురిహాతే మనః
ఉత్త్వాని ఋఱత్యాః పాశేభ్యోదైవ్యావాచాభరామసి."

ఈ (మంత్రము) చదివిన యెడలఁ జచ్చిపడి యున్నవాఁడు బ్రతికి హాయిగాలేచును. ఓ బ్రతుక నెంచినవాఁడా! (ఆయువు) నిమ్మని యడుగుకొన్నవాఁడా! నీచూపు మొదలగు మేనివంతులన్నియు న్దిరిగి యుసురుకొనున్గాక. అయిదు తెఱంగులగు నీయూపిరి (ప్రాణము) మఱలనీమేన నలరున్గాక, మఱల నీయు (ఉ) గమునీలో నుండుఁగాక. నీయుల్లము (మనస్సు) నీకుఁదిరిగి వచ్చున్గాక. ఇవన్నియున్నిన్ను విడిచి పైకిఁబోవ కుండున్గాక. ఓ చనిపోయినవాఁడా! కీడువేల్పు (నిఋతినామకపాప దేవత) బిగిసిన త్రాళ్ళకట్టులనుండి యీ(దివ్య మంత్రవాక్కు) చేతనిన్విడిపించెదము.

"అగ్నేః శరీరమసి పారయిష్ణు రక్షోహాసిసపత్నహా
అథో అమీవ చాతనః పూతద్రుర్నా మభేషజమ్"

ఈ (మంత్రము) కీడుల (అరిష్టము) ల నెల్లఁదొలఁగించి కాపాడఁ దగిన తాయెత్తు నందుంచుకొన చెట్టు దినుసున్గూర్చి చెప్పుచున్నది. ఓ మోదుగుచెట్టా! నీవుడిగ్గి (అగ్ని) నలరారుచుందువు. నల్లబ్రాగుడులన్ (రక్షస్సుల) దుదముట్టిం చెదవు. కనుక నోములు మోదుగా మాకోరికలన్నియు కూర్చుము.

"స్రాక్త్యేన మణిన ఋషిణేవ మనీషిణా
అజైషం సర్వాఃపృతనా విమృధోహన్మిరక్షసః"

ఈ (మంత్రము) చేత (మంత్రించి) బొట్టుగు - బొట్టువు తాయెత్తు (తిలక వృక్షమణి - సాక్త్యమణి) తెవుళ్ళ నెల్లనొప్పఁగొట్టును. పగఱ మూఁకల (శత్రు సైన్యముల) న్బాఱఁదఱిమి పోరున్మార్చును గనుక నీబొట్టుగు చెట్టు వేరువేసి మడికట్టు - మణికట్టు - ముంగయి (మణిబంధము - ముంజేయి) నలరించు తాయెత్తు (మణి) మమ్మెల్ల కీడులనుండి కాపాడున్గాక.

పాపట (సీమంతోన్నయకర్మము) కావించునపుడు "యాతేమాతా॥" అని మంతరించి తెల్లావాలు పచ్చావాలు చూలాలి కొంగునఁ గట్ట వలయును".

"యాతే మాతోన్మమార్జ జాతాయాః పతి వేదనౌ
దుర్ణామాతత్ర మాగృధద లింశ ఉతవత్సపః"

ఓ చూలాలా! నీవు పుట్టిన తోడనే నీపెనిమిటికిఁ గిట్టని మొలక తెవులు (దుర్నామరోగము) మొదలగు నలకువలు నిన్నంటకుండునట్లు పైగాఁదుడిచి వైచెను గనుక నిన్నటువంటి తెవుళ్ళంటకుండున్గాక.

"మాసంవృతో మోపసృప ఊరూమావ సృపోన్తరా
కృణోమ్యస్యై భేషజంబ జందుర్ణా మచాతనమ్",

ఓ మొలక తెగులా! (దుర్నామరోగమా!) యీచూలాలితొడల నడుమ నిఱుకుచేయకుము. మడిగించకుము. తెల్లావాలు, పచ్చావాలు (బజము శ్వేతపీతో భయవిధసర్షపము) కట్టుచేత మొలక తెవులడంచెను.

"యఃకృష్ణః కేశ్యసురస్తంబ జఉత తుండికః
అరాయానస్యాము ష్కాభ్యాంభంస సోవహన్మసి."

నల్లజుట్టువాఁడు (కృష్ణకేశుడు), మొద్దుపుట్టువు (స్తంబజుఁడు), కీడ్పడు-కొఱతపడు - డిగ్గుపడుమూతివాఁడు (తుండికుఁడు) ఈ మూఁడు తెఱఁగుల యెరచిదిండ్లు - గరాసులు - సోకులు - సోఁకుడులు (అసురులు) ఈయెంటని (ద్వేషింపఁదగిన) వారినెల్ల నీచూలాలివట్టల (వృషణముల) నుండి యుగజ్జల నుండియు - మొలయిఱుకులనుండియు న్పాఱఁదఱిమెదము.

మోదుగు (పలాశము), మేఁడి (ఉదుంబకము), నేరెడు (జంబువు), తెల్ల తెగడ (కాంపీలము), ఉచిఁత - ఉస్తె - ఉచింత (స్రిక్వంగ), (దిరిసెన - శిరీషము), చాఁగ (స్రిక్త్యము), ఉమిరిచెట్టు (వరణము) మారెడు (బిల్వము), గంజాయి - జడగాఁజ - జంగిడము), (కొడసచెట్టు - కొండమెల్లె - కుటకము) రావి (గృహ్యము), వేఁగిస (గలావలము), ప్రిబ్బలి (వేతసము), దూలగొండి (శింబలము) (తామరదుంప - సివుసము), నెమ్మిచెట్టు (తినిసచెట్టు-స్యందనము), కూరనెల్లిచెట్టు (అరణిక - అగ్నిమృథము), పిండిబండచెట్టు (అశ్మయోక్త్రము) నందిచెట్టు (తున్యవు), తులసి - పూతదారువు - ఈచెట్లలోనే పది చెట్లకుఁ జెందిన వేళ్లైనఁ దాయెత్తులో వేసి కట్టుకొన్న యెడల సఱుఁదెవులు దొట్టి యెల్ల తెవుళ్ళు (యక్ష్మాది సర్వరోగములు) మానిపోవును.

## —: అధర్వ వేదములో పదునొకొండవ కాండము :—

"మానోరుదర్రితక్మనా మావిషేణమానః సంసార్రిదివ్యేనాగ్నినా
అన్యతార్రిస్మద్ విద్యుతం పాయైతామ్."

చిచ్చుఱకంటిః (రుదుర్రిఁడా) మమ్ము మిక్కిలి నొప్పించు నీకైదువ (ఆయుధము) గులేఁకి (జ్వరము) మొదలగు తెవుళ్ళనామ్ముకుఁదగుల్చకుము. ఉనుఱుతీయు (ప్రాణాపహారకమగు) కదలకుండు చెట్ల మొదలగు దినుసుల చిలుమునుండి (స్థావరవిషమునుండి) కదలాడును సురుల (ప్రాణుల - జంగమ జీవుల) నంజు (విషము) నుండి యున్మమ్ముల న్విడిపించుము. నీకయిదువగు (ఆయుధమగు) పిడుగునామ్మిదఁబడ నివ్వెకెడారిన్దిరుగు నాల్గు కాళ్ళమైతాల్పులు మొదలగు వానిపై (ఆరణ్యపశ్వాదులపై) రాల్చుము.

"అనుహవంపరిహ వంపరి వాదం పరిషపమ్
సర్వైర్మేరిక్తకుంభాన్ తరాతాన్స్మవితఃసువ."

ముందువెళ్ళుచున్న వాని న్బేరుపెట్టి కదలక వెనుకన్గూర్చున్న వాని పిల్పు (అనుహవము), ఇరుపైపులనున్నవారి పిలుపు (పరిహవము), కాఱులుఁ పరుష

ఘాషణము - పరివాదము), అన్నివైపులనుండి యెక్కడికి వెళ్ళఁబోయినప్పటికి న్దుమ్ముల చప్పుడు (పరిశవము), ఉత్తకుండలు (రిక్తకుంభములు) పనిమీఁదఁ బోవుచున్నట్టి నాకిచెడ్డవలనులకీడుల (దుర్నిమిత్తదోషములనుండి)నీవెల్లచుక్క వేల్పుల (నక్షత్రదేవతల) తోఁగూడియో పగటిజేడా! తొలగించుము.

"యద్ధిరణ్యం సూర్యేణసువర్ణం ప్రజావన్తోమనవః పూర్వ ఈషిరే
తత్త్వాచంద్రంవర్చసా సంసృజత్యాఽఽయుష్మాన్భవతి యోబిభర్తి."

ఎవ్వఁడు బంగారమున్మేనఁ దాల్చుచుండునో పెక్కేండ్లే తెగులు న్దగులక హాయిగా బ్రతుకఁగలఁడు.

"శతకాండో దుశ్చ్యవనః సహస్రపర్ణఉత్తిరః
దర్భోయ ఉగ్ర ఓషధిస్తంతే బధ్నామ్యాయుషే"

చావునకు వెఱచుటకై యీ (దబ్బ - కొస్సె - దర్భ) తాయెత్తు పెరవు (మణిసాధనము) న్నీకుఁగట్టుచున్నాఁడను.

"కృత్యాదూషణ ఏవాయమథో అరాతిదూషణః
అథోసహస్వాఞ్జంగిడః ప్రణ ఆయూంషితారిషత్."

ఈ తెల్లమద్దితాయెత్తు (జంగిడమణి) నావగవారు పన్నిన కుటిలు చెఱుపు సేఁతల (కృత్యలు-అభిచారికో పద్రవముల) నన్నిటి న్పోఁగొట్టి మాఉగముల (ఆయువుల) హాయిగాఁబెంచు (అభివృద్ధిచేయు) న్గాక.

"సజంగిడస్య మహిమాపరిణః పాతు విశ్వతః
విష్కంధంయేన సాసహ సంస్కంధ మోజ ఓజసా"

పైనిజెప్పిన చొప్పున గుఱుతులు (లక్షణములు) గల ఏఱుమద్ది(జంగిడము) అను పేరుతో కాశిపురమున బిల్వబడు మందు యొక్క గొప్పతనము (మహిమ) మమ్మునెల్ల వెఱవులనుండి కాపాడుఁగాక. ఆగొప్ప (మహిమ) యెటువంటి దనఁగా కీళ్ళనొప్పుల గాలి తెగులు (విష్కంధము) అనఁబడు పెద్దనలుకువ తిరిగి మఱెన్నటికి న్పొడమఁజాలని తెఱంగుననాగాలి తెవులు న్దానివడి (ఓజస్సు-బలము) తోఁగూడవెడలించును. జబ్బుపికు గాలి తెగులు (సంస్కంధాఖ్య వాత రోగము) న్దానిచేవతో (సామర్థ్యము) తోఁగూడ న్పోఁగొట్టును. ఏఱుమద్దికి (జంగిడమునకు) కాశిలో జంగిడమని పిల్వబడునోషధి అట్టిచేవ గొప్పతనము కలదు. డాఁపలిసీమలో (ఉత్తరదేశములో) (జంగిడము) అను పేరన్పిల్వఁ

బడు మందుమొక్క ఘూకజడ, బుజపత్త్రి, మరులుజడ, రుద్రజట, నేలతోళసి, తెల్లవావిలి, ఏఱుమద్దిగాని జంగిడమని కాశీపురి - వారణాసి మొదలగు నుత్తర ప్రదేశములలోఁ బేర్కొనఁబడవచ్చును.

"ఉగ్రఇత్ తేవనస్పత ఇంద్ర ఓజ్మానమాదధౌ
అమీవాః సర్వాః శ్యాతయంజహిరక్షాంస్యోషధే."

పూవులు పూయకయే కాచునో చెట్టా! వనస్పతీ, ఓ (జంగిడము) అనబడు మందా! (ఓషధీ) నీచేవ మఱేమందు మాఁకునకైన న్లేదిందునకరయన్పనిలేదు (నాఁటత్రికార్యవిచారణా) కతమేమన వేల్పుఱేఁడు (ఇంద్రుఁడు) నీయందు చేవను (ఓజమును-బలమును) పొదుకొల్పెను. కనుకనో (జంగిడమనఁబడు వనస్పతీ) మందుమొక్కలొంగునవి లొంగనివి (సాధ్యములు - అసాధ్యములు) అని వేఱుపచఁకెల్ల తెవుళ్ళనోప్పఁగొట్టుము. మమ్ముగావుము. వెఱపులన్పుట్టించు (రక్కసుల) నైగటార్చుము.

''హిరణ్య శృంగ ఋషభః శతాఫరో అయంమణిః
దుణౌఁమ్నః సర్వాంస్తృడ్వావరక్షాంస్యక్రమీత్."

బంగరులాగునఁగొనలతో నెల్లమందు మాఁకుల మిన్నయైన పిల్లపీఁచరతా యెత్తు మేనిపైఁబుట్టు చిడుము మొదలగు నన్ని చీడల నోప్పఁగొట్టు (రక్కసుల) నందఱణఁక్కాడును.

"నతంయక్ష్మా అరుంధతేనైనంశపథో అశ్నుతే
యంభేషజస్యగుల్గులోః సురభిగఁంధో అశ్నుతే"

ఎవడు గుగ్గిలము - కౌశికవృక్షనిర్యాసము (బంక) పొగన్పీల్చుచుండునో యట్టి వానికే తెగుళ్ళైననలంచఁజాలవు. లాఁతి వారల తిట్లు (పరాభిశాపములు) తగులవు.

ఐతుదేవస్త్రాయమాణః కుష్ఠోహిమవతస్పరి
తక్మానం సర్వంనాశయ సర్వాశ్వయాతుధాన్యః"

మంచుకొండ చెంతనుండి (హిమవత్పర్వత సమీపమునుండి) మమ్ముఁ గాపాడుటకై యెంతయో చేవఁగలిగిన (కోష్టు - చెంగవికోష్టు - చెంగల్వకోష్టు కుష్ఠమనఁబడునోషధి) మాకడకు వచ్చునానాక. మాకు దొరకినయో (చెంగలికోష్టా) నీవెల్ల తెవుళ్ళనోప్పఁగొట్టుము మఱినీవు రక్కసుల నందఱఁదోలుము.

"యోహారి మాజాయానోఽంగ భేదో విసల్పకః
సర్వంతే యక్ష్మమంగేభ్యో బహినిర్హంత్వాంజనమ్."

ఓనల్ల తుమ్మికతాయెత్తున్దాల్చినవాఁడా! ముదిరి పోయినప్పుడు కుదుర్చుట వీలుకాని పాలుడు (పాండురోగము), కీళ్ళ నొప్పుల తెవులు (అంగభేదమనఁబడు వాతరోగము), మోఁకాళ్ళకిర్రుమన నలముకొను పలుకరము విసము పొక్కుల తెవులు (విసర్పకరోగము) నీయొడలినుండి నల్లతుమ్మికతమంచు (ఆంజనము - రసాంజనము) తప్పక పోఁగొట్టును.

"ప్రజాపతిష్ట్వాబధ్నాత్ ప్రథమ మస్తృతంవీర్యాయకమ్
తత్తేబధ్నామ్యాయుషేవర్చస ఓజసేచబలాయచాస్తృతస్త్వాభిరక్షతు"

ఓ తెల్లతెగడతాయెత్తున్దాల్చినవాఁడా! (అస్తృతమణిధారకః) వెంగినేలంచ్నన్నిననలువ మొట్టమొదట నీకరకకాయమందిచ్చినాఁడు. తెల్లతెగడతా యెత్తుగట్టినాఁడు. తెల్లతెగడ (త్రివృత్తే అస్తృతమను పేరన్పరఁగుచున్నది). ఓ తెల్ల తెగడతాయతుగైకొన్నవాఁడా నీకు ఉగము (ఆయువు) పొదలుటకై (ఆశివృద్ధి పొందుటకై), నీమేనుదళుక్కు మీఱుటకై, నీయొడలి యెన్మిదవ దినుసగుచేవ (ఓజస్సు) కొఱకు, నీబలఁగము (భృత్యాదులు) పెంపు చెందుటకొఱకు, నీపని వారణఁగారుట గుఱించియు నీవీతెల్లతెగడ (అస్తృతమణి) నెల్లప్పుడుఁదాల్చుకొనుము.

## —• కృష్ణయజుర్వేదీయ బ్రాహ్మణము •—

"ఆపోవోక్షతిశాన్త్యై" నీళ్ళుడుకునవంచును (శివశాంతిన్గలిగించును) చవిటి నేల (ఊసరక్షేత్రమున) నుప్పుట్టినగడ్డి మొదలయినవి మిక్కిలి చవికలిగియుంటచేతనవివాడుకొన్న నొదలికిఁజేవనిచ్చును. (వ) పూసువలన మేఁడిచెట్టు (ఉదుంబరవృక్షము) పుట్టినది కనుక వ్రేల్మికై యజ్ఞము (కొఱకు) మేఁడిపుల్లలు వాడఁబడుచున్నవి. మేఁడిన్వాడిన వానికిఁ గూడు కలుగును.

పుల్లతీఁగె (సోమలత) న్దొల్లిగాయత్రిచేవత - పాఁపమేపరి (గరుత్మఁతు) వేల్పులనోడించి తెచ్చునపుడు రాలిన బొట్లు (సోమరసబిందువులు) మోదుగుచెట్టై మొలిచెను గనుక నొదలను వ్రేల్మికి (యజ్ఞమునకు) మోదుగుమాకలు వాడినఁదెగుళ్ళనడంచును. మేనికి దళుక్కు (బ్రహ్మవర్చస్సు) పుట్టించును.

నలువ (ప్రజాపతి) (జమ్మి - శమీవృక్షము) నీకన్దాఁగి యుంటచేత నైదారతెవులు (అగ్ని పిత్తరోగము) నడంచుకొనెను. గావున (జమ్మి - శమి) న్వాడుట వలన (అగ్ని - పిత్తవ్యాధి) ఉడుకు తెవులు మానిపోవును. నలువ (ప్రజాపతి) పుట్టించిన కణకు (అగ్ని) ములువెలమచెట్టు (వికంకవృక్షము) న్వొచ్చెను గనుక ములువెలమచెట్టు డినుసు మందు పుచ్చుకొన్న వాని యొడలికి మంచితళుకు వచ్చును.

పిడుగుపడిన చెట్టు చెక్క నూఱిన ముద్ద యొడలికి బట్టించిన యెడల వేఁడి పుట్టును. ఏడు సుఱులు (సప్తప్రాణములు) తలయందేకలవు. తలకాయ ముత్తెఱఁగులు - వెండ్రుకలు (కేశములు), అంట (త్వక్కు), ఎముక (అస్థి), (వరి - వ్రీహి) కండెన్నెదము (గోధుమపిండి) తినుట యెంతయోమేలు.

"సరస్వతీత్వామఘవన్నభిష్ఠాత్" వెక్కుతీఁగె (సరస్వతి - జ్యోతిష్మతి) కోపు (సుర) పుచ్చుకొన్న యెడల విత్తనమును హెచ్చించును. (వీర్యవృష్టి చేయును) గోతినీళ్ళు (ప్రదరోదకము) త్రాగఁగూడదు. వేపుడు బియ్యము (ధానములు), నే చలిమిడి (కరంభము), నెయ్యిలు (పరివాపము), పాల విఱుఁగుడు - జున్ను (అమిక్ష) మందులుగా వాడిన యెడలఁ దెవుళ్ళు మాని పోవును. ఈనిన పది పూటంలోగాఁ బిడికిన యావుపాలు వాఁడగూడదు.

పుట్టపొరి (చెవపుట్టమున్ను) చేత వినికి హెచ్చును. (శ్రవణేంద్రియము బాగుపడును) చెవుడు పోవును. ఎండి పోయిన యేటి వండుగాని - చెఱువు బాడె (కదణామము-సూదము) గాని పొలమున చెరివివేసిన యెడలఁబంట బాగు గాఁబండును. కారుపంది పెకల్చినపొరి (వరాహవిహితమైన మృత్తిక) యుడుకు (తాపము) నడంచును బంగరు (హిరణ్యము) పుటము పెట్టిన మందు మేనిలోని విత్తనము (రేతస్సు) న్పొదవించును. నిప్పు (అగ్ని) రావిచెట్టు (అశ్వత్థవృక్షము) లో నిమిడియున్నది. కనుక రావి చెక్క నీళ్ళతోఁ గడిగినన్పుండ్లు మాని పోవును. మోదుగ (పలాశవృక్షము) అంట (విస్తరి) లోఁ దిన్న వారికి మంచి తళుకు (బ్రహ్మతేజము) వచ్చును. (ఎ)

పెరుఁగు (దధి) వాడిన వానికి విత్తనము పొదలును (వీర్యమువృద్ధి పొందును). ఆవుపాలు వాఁడిన వాని కుసుఱు (ఆయువు) పొడిగింపఁబడునావే యైదార (అగ్ని) కనుక నావు న్గొల్చు వాడు పెక్కేండ్లు బ్రతుకును. హాయిగా బ్రతుకును.

**మంచుకొండనెత్తము - దెప్ప (హిమవత్పర్వతసానువు) యందు తీఁగ వలె బ్రాకెడునోఁజాతి పువ్వామాబొమ్మ తెవుళ్ళనెల్ల న్గుదుచఁజాలఁదగిన మందువు నీవు.**

## —: కంటితెవుళ్ళకు మంత్రము :—

కామిహైకాః కఇమే పతంగాః మాంథాలాః కులిపరిమాపతంతి
అనావృతైనాప్రవథ మంతు దేవాః సౌపర్ణంచక్షున్మనువావిదేయ.

వేడి వలనన్గన్నుల (మిహైకలు - పతంగములు) అను తెగుళ్ళ వలన వెండ్రికలను మిడుకుల్పోపింపు తెవుళ్ళనెల్ల న్దమ నోటిగాలిచేతనే పోఁగొట్టుదురుగాక. పిట్ట యెట్లు మిక్కిలి దవ్వునందలి దినుసునైన న్జూడఁగల్గునో యట్టి వాడి చూపునాకు వెలయింతురుగాక.

## —: కృష్ణయజుర్వేదతైత్తిరీయ బ్రాహ్మణము ద్వితీయకాండము :—

పుల్లతీఁగ (సోమలత) నూఱి వారుపు మీగడ (గంజితోరక - మాసరము), నానవైచిన పచ్చననిగలు (తోక్మము), మంగచెక్క మొదలగుకైపెక్కించు దినుసులు వేసి సారా (సుర) చేసి చవికై పెరుగుగాని చల్లగాని యాకోవు సారాయిలో గలిపి తగినటుల బుచ్చుకొన్న యెడల నోడలికి మేల్చేయును.

యావ్యాఘ్రిం విషూచికా ఉభౌవృకంచరక్షతి
శ్యేనం పతత్రిణంసింహమ్ సేమంపాత్వంహసః

తిండి యఱుగ నివ్వకుండు తెగులు - పొకుడు దోఁకుల తెగులు (వమనములు విరేచనములు పుట్టించు వ్యాధి - విషూచిక).

పులికిన్దోఁడేలునకు, నెరసఱెకె (సింహమునకు) గ్రద్దకు (శ్యేనమను పతత్రి - పక్షి) న్దగులనులితనిన్దగులః కుంపుగాక. పుల్లతీఁగె కోవు త్రాగిన (సోమాసి - సోమయాజికి) కూడని చావు (అపమృత్యువు) రాఁబోదని నేనొట్టు పెట్టెదను. (శపథము చేసెదను). పుల్లతీఁగెపస చవి (సోమరసపానము) కలిపిన కూడు (అన్నము) కుడిచిన వాని పెత్తనము పొదలును (ఇంద్రియాభివృద్ధియగును.) గంగ రేఁగు పండ్లు బియ్యము పేలాలు పొడిచేసి పుచ్చుకొన్న యెడల చేవ యెక్కును. "యదైకర్ప్యంఘభిః" ఓకిత్తి (అగ్ని) మాతెవుళ్ళనెల్ల మాన్పు మాతెగుళ్ళన్నియు న్మాకడుపులోని కఱుకు (జఠరాగ్ని) న్సన్నగిల్లించుచు బొల్లము (కుష్ఠు) మొదలగు గడ్డు తెవుళ్ళనేర్చుచును గనుకను, ఓ (యజ్ఞనీయాగ్ని) ముదిమివోఁగొట్టు మంటలతో మాయఱుగుడు (క్షయవ్యాధి) న్వోఁగొట్టుము. హాయిగానే తెవుళ్ళన్దగులనివ్వక మమ్ము బ్రతికించుము.

వైనవాఁడు - పిదపదనైనవాఁడు (అతిశ్లక్ష్ణుఁడు), మిగుల బొచ్చువాఁడు (అతి లోమశుఁడు), మిక్కిలి గిడసపండ్లవాఁడు (అతికిరిటుఁడు - అత్యల్పదంతుఁడు) మిక్కిలి పొడుగుపండ్లవాఁడు - మిక్కిలి మిట్ట పండ్లవాఁడు (అతిదంతురుఁడు), మిక్కిలి కనులు చికిలించుకొనువాఁడు - మాటి మాటికి న్గనుఱెప్పలు మూయుచు న్దెఱచు చుండువాఁడు (అతిమిర్మిరుఁడు), ఱెప్పలు వాల్చక మిక్కిలి కన్నులఁ దెఱచుకొనియున్నవాఁడు (అతిమేమిషుఁడు), పేరినంపజినిన్గొనటి వేల్పులకొఱకై (అరూపదేవతలన్గూర్చి) ముట్టుకొనవలయును. చిక్కని ఎనుముపైఁగోరిక పెట్టుకొను వేల్పు కొఱకు ముట్టుకిగి హాటమెకిఁబనికెరాని యూఁపునాని (జామిని) నంటుకొనవలయును. ముంద పలుఁగఁబోవు ఎనుపు - హాడుదల - నయము - పొలి - మిగత - మిగిలి - మిగులు - పేలు - వాసి (బాధము) కొఱకెదుచూఁడుచు కొను వేల్పునకై చిన్నపనుప నంటు కొనవలయును. మంచి గాని చెడ్డగాని అనుగలము - తోఁడు పిక - వాఁకు (సహవాకము) స్పష్టి వచ్చునని ("బ్రహ్మణేబ్రాహ్మణ మాలభతే" "పతికాయైపతిమాలభేత్" అనెడు పురుషమేధమంత్రముల తాత్పర్యము) నావొంటికి రోపలన్నెలు పుట్టెడుప గాలి వెలుపున్నట్టుదలతో నెంతయో కొలిచి ముసిలిముద్దాఁడుచు గొంకంత వఱకు హాయిగాఁ బెక్కేండ్లు బ్రతికెదను.

"హితంప్రాణం మనసాఽన్వార భామహేప్రజాపతింయోభువనస్యగోపాః
సనోమృత్యోస్త్రాయతాం పాత్వంహసః జ్యోగ్జీవాజరామశీమహి"

తల వెండ్రుకలు మీసములు గొఱిగివైచును, గోళ్ళుతీసి వేయును, పండ్లు తోముము. మునిగించును (స్నానము చేయించును) కిడుపొపుటకై క్రొత్తబట్ట కట్టించును నోరెత్తనివ్వకిల్లి (ఉపవాసము) వేల్పునగరు చిక్కుటకైచేయించును. చదలకాపుల పొత్రిగున నెలకొల్పుటకై (స్వర్గలోక సమష్టికై) మూపెల్ల మేల్కొనఁజేయును. "కేశశ్మశ్రువపతే" పది మేనదినుసుల (దశేంద్రియముల) యుగమునందు (ఆయువునందు) నెలకొల్పఁబడెను. గనుక రెండుకాళ్ళకన్నాకు మేనితాల్పు (పురుషునియునురు ఆయువు) నూఱేండ్లు. "శతాయుఃపురుషఃశతేంద్రియః ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి."

కనుక గుఱ్ఱము నాల్గు కాళ్ళమైతాల్పుల (పశువుల) లో నెల్ల మిక్కిలి తిండిపోతు న్వీత్తనము (ఇంద్రియము) హెచ్చుకలదియును. "తస్మాదశ్వఃపశూనామన్నాదో వీర్యావత్తమః". ఏడుపూటలు (దినములు) తిండి లేకున్నవాని యేడునురులు (సప్తప్రాణములు) తొలఁగిపోవును. రెండుచెవులు, రెండుకన్నుల రెండు ముక్కుఱంధ్రముల, నోటనుండునునురులు తల యందలి యేడునురులు (సప్తప్రాణములు) "(సప్తవైశీర్షణ్యాఃప్రాణాః)"

తిండికి నంజుడు పనికిరాదనియేనలువ (ప్రజాపతి) మేనినేలు నెల్ల వేల్పుల లోఁగిత్తికి (అగ్నికి) నెయ్యి (ఆజ్యము), ముక్కంటి (మహాదేవునకు) తేనియ (మధువు), బియ్యము (తండులములు) వసువులనువేల్పులకు (రుద్రులకు) అడుకులు (పృథుకములు), (ఆదిత్యులకు) పేలాలు (లాజలు), విశ్వేదేవతలకు కలగలుపు (కరంబము), బొదగులు - వేపుడు బియ్యము (ధానలు) (నక్షత్ర దేవతలకు), పొడిపిండి (సక్తువులు) సలువకు (ప్రజాపతికి), (చిఱుసెనగలు) వేల్పుల కెల్లరికి (సర్వదేవతలకు), కొఱ్ఱనూకలు (ప్రియంగు తండులములు) గుఱ్ఱముమేనిసంతుల వెల్ల (అశ్వాంగము) లన్నియు దాల్చును. అనఁగా (ప్రజాపతి స్వరూపముంతయు) నెల్లడించును గనుకఁబియ్య (మాంసము) తిన్నవారికెల్ల తెఱగుల చేటు తప్పదనియే ప్రాఁజదువులు నుడువుచున్నవి. కిత్తి (అగ్ని) మంచునోఁగొట్టుమందు. "అగ్నిర్హిమస్యభేషజమ్".

కమ్మనితావి పీల్చెడివారి కుసురులు (ప్రాణములు) పోవు. హాయిగా బ్రతుకుచుందురు (ప్రాణా వైసురభయః ప్రాణానేవాత్మన్దధతే. నైభ్యఃప్రాణా అపక్రామంతి."

పట్టతలవాఁడు (ఖలతి), చెమటయొడలివాఁడు (విక్లిధుడు), బొల్లివాఁడు (శ్వితిరి), పిల్లికనులవాఁడు (పింగాక్షుఁడు) వీరలతలలపైనివేల్మి (హోమము) చేయవలయును. వారల పొడలు (రూపులు) కసటు - మకిల - మురికిరొచ్చు (పాపము) కనుకఁగసటు (పాపము) నోఁగొట్టును. ఎటువంటి వాఁడటువంటి వానినే గెల్వఁ వలసి యుండును. ఖలతేర్విక్లిధస్య॥"

బట్టలిచ్చుటచేత నుసుసు (ఆయువు) పొడిగింపఁబడును "వాసోదదాతి, తేనాఽఽయుఃప్రతిరతే". నేను మేపిన ప్రత్తిగింజలు (తెలికెపిండి) మొదలగు తినుబడి దినుసులు వలన గేదెనన్పించునట్లు నాయిగిరికన్గైకొనియో వేఁడి వేల్పున న్గాపాడుము. "విభావసో, మహిషీవత్వద్రయిస్త్వద్వాజా ఉదీరాతే."

తలముంగిల గోదానమనఁబడు శిరసులోనొక (భాగముపై) (బతుకు సురు) మేనితక్కులనొప్పదలింఘుట కొఱకై (జీవనాఽఽయువర్చోద్ధివ చక్షుస్సుల యభివృద్ధి కావించుటకై) నీళ్ళతోఁదడుపుదు. "ఆపడిందంత్వు జీవసేదీర్ఘా యుత్వాయవర్చసే'' వేల్పుమంగలి (దేవశుల్పివు) నగు నేను క్షైదువ (మంగలి కత్తి స్వధితి - క్షురము) తో తల వెండ్రుకలు మొదలగువాని న్గొఱుగు కొనుచున్నాను. "ఓషధేత్రాయస్వేన స్వధితే॥" ఓమిసిమీః వెన్నాః నీవావుపాల పనివి (గోపయఃకార్యమువు) నున్నసీతక్కుకలదానవు కనుక నాకు జన్నిగట్టు కళుకు (బ్రహ్మవర్చస్సు) వెలయించుము.(మహీనాంపయోఽసి॥") తొలుదొల

నీళ్ళనిండిన బిందె దగ్గరనుంచి, జన్నిగట్టు (బ్రాహ్మణుని) కుడివైపునఁ గూచుణ్ణాండ బెట్టి కిత్తిన్వేల్చి (అగ్నిహోత్రముచేసి) కవవేల్పుల (అశ్వినీదేవతల) నెమ్మి (అనుగ్రహము) నిట్లు పొందిన పిమ్మటమందరి (మానుషభిషక్తు) తెగులు గొంటున్నదుర్చుటకై మందివ్వ వలయును. ("తమోస్త్రీధా భైషజ్యాని సంకాంపర్రింళఅ2")

## ఉపనిషత్తులు - కఠోపనిషత్తు.

గుండెలోనున్న నూట యొక్క నంద నరములలో నొక్కనరము తల కెక్కన్దానిన్బట్టి చావులేనియునికి (అమృతస్థితి) కలుగును (శతంచైకాచహృదయస్యనాడ్యః")

## —: ఛాందోగ్యోపనిషత్తు :—

మహిదాసుఁడను కావితాలుపు (తపస్వి) పదాఱువందల యేండ్లు బ్రతుకఁగలిగెను. "ఏతద్ధస్మవైతద్విద్వానాహమహిదాస ఐతరేయః.... షోడశంవర్ష శతంజీవతి"॥

కలలో గుబ్బెతల - లేజవ్వనుల (స్త్రీల) గనుగొన్న వారలకొదమి (సంపద)లు కొనసాగుచుండును. "యదాకర్మణుకామ్యేషు స్త్రియతిస్వప్నేషు పశ్యతి సమృద్ధింత త్రజానీయాత్తస్మిన్స్వప్ననిదర్శనే" తిన్నతిండి ముత్తెఱఁగు నందు (స్థవిష్టము) అంత ముతక యంత ముదురు సన్నముగాని కాకున్నది (మధ్యమము) నంజుడు (మాంసము) చిన్ని నలుసు (అణిష్ఠము) ఉల్లము (మనస్సు) అగుచున్నది. "అన్నమశితంత్రేధా విధీయతే"॥ త్రాగిన నీళ్ళు ముత్తెఱఁగునందు ముతుక కాల్మడి (మూత్రము), నడుపాళము నెత్తురు, నలుసు నూఱు (ప్రాణము). తినినచేవ (తేజము) ముదుగెముక, నడిదిమూలగ (మజ్జ) నలుసు పలుకువాక్కు. బువ్వ యుల్లముగా, తడి - నీళ్ళు (ఉదకము) ఊసులు (ప్రాణము) గా, చేవ - కిత్తి(తేజము) పలుగామాఱును.

## —: బృహదారణ్యకోపనిషత్తు :—

గుండెలోనున్న (పురీతత్తు) నాబడు పేగున కౌగలి యందలి డెబ్బదిరెండు వేల నరములవస (సారము) ఎప్పుడు చేరునో యప్పుడే తలంపులు లేక హాయిగా, గూర్కున్ (సుషుప్తినందును).

ఊరి పంటదినుసులు (గ్రామ్యధాన్యములు) పది, ఎఱ్ఱబుడవడ్లు (వ్రీహి) ములువడ్లు (యవలు, గోధుమలు), నువ్వులు (తిలలు) మినుగులు (మాషములు) నల్లవడ్లు (అణువులు) కొఱ్ఱలు (ప్రియంగువులు), (గోధుమలు), చిఱుసెనగలు

(మసూరలు), కందులు (ఖల్వములు), చోళ్లు (ఖలకులములు) జన్నిగట్టు (శ్రోత్రియుని) పెండ్లాముస్గవయువాఁడా ; జన్నిగట్టు - తిట్టు చేత విత్తనము న్దొఱఁగి (నిర్వీర్యుడై) చచ్చున్గావున నెల్లపుడు న్గిత్తిన్వేల్చు (అగ్నిహోత్రము చేయు) పాఱుని (వైదిక బ్రాహ్మణుని) యిల్లాలి నోరుఁడుకవగూడరాదు. "యమేవం విద్వాన్బ్రాహ్మణఃశపతి తస్మాదేవం విచ్ఛ్రోత్రియస్యదారేణనోప హాసమిచ్ఛేత్."

దినుసుల (భూతముల) లోనిగ్గు (రసము) నేల (పృథివి), నేల యందలి నిగ్గు నీళ్ళు, నీళ్ళ నిగ్గు మందులు (ఓషధులు) మందు మ్రాఁకుల నిగ్గుపువులు. పూవుల నిగ్గు పండ్లు (ఫలములు) పండ్ల నిగ్గు మేని తాల్పు (పురుషుఁడు), మేని తాల్పు నిగ్గు విత్తనము (రేతస్సు).

## —: శ్వేతాశ్వతరోపనిషత్తు :—

ఉల్లమునరికట్టుట వలనఁ గలిగిన కణకుగా మాఱిన యొడలు (యోగాగ్ని మయమైన శరీరము) కలవానికిఁదెగులుగాని, ముదిమిగాని. చావుగానిరాఁబోదు. "నతస్యరోగోన జరాన మృత్యుః ప్రాప్తస్యయోగాఽగ్ని మయంశరీరమ్". ఉల్లమరికట్టఁబడుచుంటకు మొదటి గుఱుతు మేను తేలిక (లఘుత్వము) అగుచుంట నెమ్మది (ఆరోగ్యము) కలుగుచుంట, కోరిక లేకుండుట (అలోలుపత్వము), ఒడలు తలుకెక్కుట (వర్ణప్రసాదము), వినవింపగుట (స్వరసౌష్ఠవము) మేనన్గమ్మని తావి యెసఁగుట (శుభగంధము), కొద్దిగానుచ్చ పీయివెడలుట (మూత్రపురీషాల్పత), కనుబొమ్మలనడుమఁ జూపునిల్పుట, మింట దిరుగు చప్ప (ఖేచరీ ముద్రయగుచున్నది). ఆచప్ప (ముద్ర) తాల్చిన వానికి దెగులు గాని, చావు గాని, కూర్కు (నిద్ర) గాని, ఆఁకలిగాని, డప్పి (తృష్ణ) గాని కలుగవు. భ్రూవోర్దంతగతా దృష్టిర్ముద్రాభవతి ఖేచరీ, నరోగోమరణంతస్య నవిద్రానక్షుధాతృషా."

## —: ధాన్యబిందూపనిషత్తు :—

ఈ మింటి దిర్మ్మరి చప్ప (ఈఖేచరీముద్ర) నెఱిఁగిన వానికి సొమ్మ రాదు. వాఁడు తెగులున నొగులఁడు. ఏపనినంటఁడు. తఱికి లొంగఁడు (కాల బద్ధుఁడుకాఁడు). ఉల్లము మింటఁదిరుగును. నాల్కమిన్ముట్టును. ఆఁడుదాని కౌఁగిటన్జిక్కికూటమి న్దేలుచున్నప్పటి కెవరికి విత్తనము (వీర్యము బిందువు) జాఱకెంత వఱకు నిల్చియుండునో యంతదనుక వానికిఁజావు వెఱపులేకుండును. బిందుక్షరతినో యస్యకామిన్యాఽఽలింగితస్యచ, యావద్బిందుఃస్థితోదేహేతావన్మృత్యుభయంకుతః" మింటి చప్ప (ఖేఖరీముద్ర తోనున్నవానికి విత్తనము(వీముర్య—

బిందువు) జాతీపోవదు. ఒక్కప్పుడు విత్తనమా(డుగుటి(యోని) లో(బడినప్పుడిది రెండుకయిల (చేతుల) వ్రేళ్ళుకలిపి బుయ్యచప్ప (యోని ముద్ర) తా ల్చిన యెడల(దిరిగి యావిత్తనమున్నన యొడలిలోనికి లాగుకొన(గలడు. ఆవిత్తనము తెలుపుగా నెఱుపుగా రెండు తీరులనునుండును. తెల్లనిది విత్తనము (శుక్రము) అన(బడును. ఎఱ్ఱనిది పెనుముట్టు నెత్తుర (యహోరజస్సు) అనంబడును.

బుయ్య (యోని)లో గసిరా-సిరాజి (విద్రుమము-ప్రవాళము) పోలిక నున్నముట్టునెత్తురు (మహారజము) నెలచోట (శశిస్థానమునందు) విత్తనము (బిందువు) ఉండును. ఆవిత్తును ముట్టునెత్తురును గలిసికొనుట మిక్కిలియరుదు. విత్తనము (బిందువు) ముక్కంటి (శివు(డు). ముట్టునెత్తురు (మహారజస్సు) నెలపట్టి (సత్తి-శక్తి). విత్తనము జాబిల్లి (చంద్రుడు). ముట్టునెత్తురు పగటివేల్పు (రవి). ఆయిరువురి కలియికవలన మరచియొడలు సమకూరును.

మేనియందలి వెంట్రుకలలెక్క ఇరవైయెనిమిది కోట్లు.

## నల్లవ్రేల్మితోలుఁబల్కుల వలనుపిట్టు (తీతువు) తారుచదువు [తైత్తిరీయారణ్యకము]

నలువయిచ్చిన యునుఖునంతయు హాయిగా(గుడిచెదము గాక. పను ముక్కు వీనునాల్కయంతలెల్ల మాకలరారున్గాక. యజ్ఞముగా( బాపడ హాపేంద్ర వేల్పులారా మిమ్ముగొల్చెదముగాక. "భద్రింకర్ణేభిః శృణుయామదేవాః" ఒకటి- సీకులారాకా(క(జ్వరము)వలన(గలుగు నొదలిమంటన్నల్లార్చెదవుగాక. మానిక్క్రాని యిక్కట్టు (ఇడుమ) రతః వానసీళ్ళు, మందుమ్రా(కు లెల్లమాకు మిక్కిలి హాయి నిచ్చుగాక. శివానఃశంతమాభవంతు, దివ్యాఆపఓషధయః. పగటివేల్పునకు యేడు మిన్కులలో (రశ్ములలో) నొక్కటి మెప్పికిత్తైన( [illegible] యద్దియేతక్కిన యామని (వసంతర్తువు) మొదలగు నాలుగింటిని [illegible] జలివెడులకున్గతమౌచున్నది. "సాకంజనా సప్తథమాహు రేకజమ్" [illegible] (వర్షర్తువున) నొప్పెడమినకంటితెవులు చలువతఱి (శిశిరర్తువు) [illegible] తొఱఁగుటవల మానిపోవునప్పుడు మంచుమొదలగు [illegible] బుల (బుతువుల) నేలెడు వేల్పుకొలది (సామర్థ్యము) "అతిమాత్రోపి [illegible]" చలువతఱియందు (శరదృతువునందు) [illegible] యంగరొల్లెలు (భక్ష్యవిశేషములు) మైలావునకై (శరీరపుష్టికై) [illegible] నేలనన చలువతఱి (శరత్కాలము) హాయిగా( [illegible] యించును. "అన్న మశ్నంతమన్నమత్తి, అహంవో జీవనప్రదః" [illegible] (హేమ-

తర్తువు) లో నెల్లయుసుఱుల (ప్రాణుల) నొదళ్లవడఁకించు మంచుగాలి ముమ్మ
రము వీచున్గనుక నెల్లవారు న్మఱికి వైనప్పటికి న్మృతుకదుస్తులన్దాలచ తీఱదు.
"అభిధూన్వంతో । భిఘ్నంత ఇవవాతవంతోమరుద్గణాః,అమృతోజేతుమిషుముఖ
మివసన్నద్ధాః సహదదృశేహ" చావులు (మృత్యువులు) నాల్గుతెఱఁగులు. పగటి
వేల్పు (సూర్యుని) రాకపోకలన్వరుసగా నుసుఱు (ఆయువు) తఱఁగిపోవుతొలి
ఉసుఱుగాలి నరములలోనడ్డాదిడ్డీగా మెలగుటవలన నట్టియిబ్బందిచేత కలుగును.
సావుమలిదిగాని యిద్దానిన్దాఁగోరినట్లు తనయూపిరి నరికట్టుకొనఁగల కావితాల్పు
(యోగి) మిక్కిలిపాటు తప్పించుకొనఁగలఁడు కనుక గాలి తగు పాటిది (మధ్య
మము) యీల్గుట (మృత్యువు) కడుపులోనిడిగ్గి (జఠరాగ్ని) యెప్పుడు సన్న
గిల్లునో (మందమగునో) యప్పుడు తెవుళ్ళు చెలరేఁగుటవలన చొలయివచ్చు
నిద్దా నిన్మందరులు (చికిత్సకులు) కొద్దిపాటి (అల్పప్రయాసము) చేతఁదప్పిం
చఁగలరు కనుకఁగణఁకు (అగ్ని) తక్కువు పొలియక (మృత్యువు), జాబిలి
(చంద్రుడు) మందులకెల్ల దొరకనుక నావేల్పునెనరు (అనుగ్రహము) లేమి
నుసుఱులు (ప్రాణులు) పొలియుదురు. కావునవెన్నెలఱేఁడు నాల్గవగిట్టింపు(మృ
త్యువు) వెలుగులఱేఁడైదవచావు. (హృతవ), "ఆముమాహుఃపరం మృత్యుం పవ
మానంతు మధ్యమమ్, అగ్నిరేవావమోమృత్యుఃచన్ద్రి మాశ్చతురుచ్యతే" పగటి
వేలుపు (సూర్యుఁడు) తనపొడవు కుర్రింకులచే నెల్లనుసురుల (సర్వప్రాణుల)
కొక్కనాటియుగము (ఆయువు) తఱిగించును. "అసౌయోస్తమేతి। ససర్వేషాం
భూతానాం ప్రాణానాధా యాస్తమేతి, అసౌయ ఆపూర్వతిససర్వేషాం భూతా
నాం ప్రాణైరాపూర్వతి". కన్పట్టుచున్నపగటిఱేఁడే (సూర్యుఁడే) నింగినేలల కెల్ల
కతమగువేల్పు (బ్రహ్మము) చదువు (శాస్త్రము) వలనఁదెలిసికొని యావేలుపు
నకుఁ బొడుపు కుర్రింకుతఱుల (ఉదయాస్తమయవేళలందు) వలగొని యెవఁడు
ప్రెుక్కుచుండునో వానికోరిన మేళ్ళెల్లనమకూరును. "ఉద్యంతమస్తం యంత
మాదిత్యమభిధ్యాయన్కుర్వ న్బ్రహ్మణో విద్వాన్సకలంభద్రమశ్నుతే, సావాది
త్యోబ్రహ్మేతి" పిల్లలన్మ్రింగుమింటి మొసలి (దివ్యశిశుమారము) నెవఁడుకొల్చు
చున్గొండాడునో యట్టివాఁడు డబ్బాటుచావున్దప్పుకొనునవ్వాఁడు త్రోవలోనేమరు
పాటునఁదరుణముకానిగిట్టింపు (అపమృత్యువు) రానేరదు. వానికెల్ల చోట్లన్గోరి
నంత తిండిచేకూరును. "యఏవంవేదాపపునర్మృత్యుంజయతి జయతి" వెమరు
కట్టిసూఁతకోలగా వాడుకొనువాఁడుచేవగానుండును."యద్వైణవీ।తేజోవైవేణుః
వేర్విల్మిడిగ్గి (హోమాగ్ని) కిన్పగటివేల్పున్నడు మనుండువాఁడు పుముతెగులు
గొంటుగును (కుష్ఠరోగియగును) "నప్రివగ్యఞ్చాఽఽదిత్యంచాంతరే యాత్।
యదంతరేయాత్। దశ్చమాఽఽస్యాత్" మేఁకపాలన్నితెవుళ్లనొప్పగొట్టుగనుక మేఁక
పాలు మిక్కిలిమేలు. "అజక్షీరేణాఽఽచ్ఛ్రీణాతి, పరమంవా ఏత్పయః। యద
జక్షీరమ్" ముంత (పాత్రము) దొలుచుటకు వేడినీళ్ల న్వాడవలయును. "మదం

తిభిః ప్రోక్షతి, తేజఏవాస్మన్దధాతి" మూడుతూరులేవలగొనవలయు (ప్రోక్షణము చేయవలయు) న్గాని సాల్గవసారివలగొనరాదల్లొనర్చిన వాడులుపు (కుష) వాడగును." యోవైఘర్మస్యప్రియాః తనువమాక్రామతి, దుశ్చర్మావైసభవతి, యస్త్రిః పరీత్య చతుర్థం పర్యేతి", అందఱియొడళ్ళయందున్డొలులనుఱ(పాణము) చిల్లులేగాక బొడ్డుకూడఁబడవచిల్లియునుఱ (ప్రాణావకాశము) కంపు. "నవవై పురుషేపాణాః. నాభిర్దశమీ" దున్నిఏత్తనక్కఱలేక తనంత మొలిచెడి మంచు మొక్కాయొణిల్లేడుచెట్టూ (శమిజావరి) పగతున్నెకలించి నొగిలించుము. ఓరంరది కోడుచేఁత (మంచపుకోడుచెంగట) న్పుట్టు వెల్లిమేడి, పుట్టిగొడుగా (తల్పజము నెకుమంద - కాకిబొడ్డు- కాకిమేకి) నాపగవాని నిల్లువెడలఁగొట్టి కొంపలంచెదారుల నడుమనల్లాడు నటుచేయుము.

"ఉత్తుదశిమిజావరి, తల్పేజేతల్ప ఉత్తుద, గిరీ రను ప్రవేశయ." ఓమొద లెడసినయునుణా (ప్రేతమా) నీకంటిచూపు వెలుఁగులతేని (సూర్యుని) లోఁగలియుగాక, నీయట్టిమొత్తి (ఆత్మ - మొందెము), ఊపిరిపైగాలి(బాహ్యవాతము) న్జేరుఁగాక, నీవుకూడ నీచేసికొన్న పాడి మేలిపనిన్నుట్టి (ధర్మముచేత సుకృతము చేత) వేల్పునగరునకున్నేలకు (ద్యులోకమునకు పృథ్వీలోకమునకు) వేగుము. నీళ్ళలోనైనఁజొరఁబడుము. ఆయావేల్పు లందుకింది నీకంటి చూపుమొదలగు కొలంది (సామర్థ్యము) నొకలిన్నింట (ద్యులోకమున)ఁగైకొల్పి తరవాత నిన్నే పొందును, గనుక నీకినీమలో నీకింపునిమ్ము (హితము, సుఖము)కలుగునోయచ్చటికిఁబోయి మందు మాకులలోఁ జొచ్చి యందుమండి (తద్వారముచేత) తలిదండ్రుల న్జూఱి (ప్రవేశించి) యందందఁదగు మేనులన్దైకొని యా యొడళ్ళన్నిలుపుము (ప్రతిష్ఠితుఁడవు కమ్ము)

"సూర్యంతేచక్షుర్గచ్ఛతు వాతమాత్మాద్యాంచగచ్ఛ..."

మిడుకెడసిన వానికి (ప్రేతమునకు) బొరుగులు- పేలగింజలు (ధానలు), పాలు (కసవు - గడ్డి - అజ్ఞానము) అత్తెసరు (చరువు) గటిక (మాష్ప),తెల్లజ (కాశము), (కోన్న -దబ్బ - దర్భ) ఇసుకమాసు - తెలిమికి - తెలిమెరి - మా వెలఁగ - మొగలింగ (రణవృక్షము) బంకపారితో (బంకమట్టితో)ఁగాల్చి చేసిన రాయి (ఇటిక), (జమ్మి -శమి), కారువడ్లు (యవలు) మేలు కలుగుటకై వాడెదరు.

"యాస్తేధానాః త్వామజా నౌషధీనాం......,
దుర్వాణా ...., కాశానా స్తంబమాహర........

దర్భాణాం స్తంబ మాహర........, వరుణో వార
యాదిదం ........ శమిశమయాస్మదఘాద్వేషాంసి.
యవయవయాస్మద ఘాద్వేషాంసి."

మంచుకొండమీది మూఁడు మూఁపురముల (కకుదముల) యెడఁజిక్కు కాటుక తెచ్చి కన్నులకుఁబెట్టుకొని నావగవారిన్మాపెదను.

"యదాంజనం త్రైకకుదం జాత హిమవతస్పరి........" కూడు (అన్నము) నుండి నింగినేలలన్నిటగు మేనితాల్పులెల్లను (ప్రజలు) పుట్టుచుందురు. తిండి (అన్నము) చేతనే బ్రతుకుచుందురద్దానియందే యుసుఱు (ఆయువు) చెల్లిన పిదపడిందురు. (అన్నములో నేలయమాదురు) చేరెదరు. బువ్వయే మేనితాల్పులకెల్ల (భూతములకెల్ల) నక్కుఱ- కతము కారణము. కనుక బువ్వయందఱికి మందు (సర్వౌషధము) అని చెప్పబడుచున్నది. కూడు నేయ్యందఱు నొందుచున్నారు. ఎవ్వరు బువ్వయే నింగి నేలలదినుసులం దెల్లనిండుకొని యున్నవేల్పు (బ్రహ్మమని) కొల్చుచుందురో వారలకన్ని రకముల యుంగరొల్లల (భక్ష్యముల) తిండిసమకూరును.

"అన్నాద్వై ప్రజాః ప్రజాయంతే...." దానినుండి (పరబ్రహ్మము ఆత్మము నుండి నింగి - మిన్ను - విన్ను - చదలు) పుట్టెను. నింగినుండిగాలి, గాలినుండి డిగ్గి (అగ్ని) డిగ్గినుండి నీళ్ళు-తడి, నీళ్ళనుండి నేల (పుడమి-పృథివి) నేలయందు మందుమ్రాఁకులు (ఓషధులు), మందుమొక్కలనుండి బువ్వ (అన్నము), తిండి - కూడు-బువ్వ (అన్నము) నుండి యుసురు (పురుషుఁడు - జీవుఁడు) కలుగును.

తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః.........., నేయి మొదలగు వేలి చెడుదినుసులుంచుటకు ములువెలమకఱ్ఱతెడ్డు వాడెదరుకనుకఁ దిండిసరకులు నిలువచేసికొనుటకు ములువెలమకఱ్ఱ ముంత మిక్కిలి మంచిది.

"యస్యతే కంకత్యగ్నిహోత్రహవణీ భవతి"

నింగినేల లెల్లనీళ్లే. "ఆపోవాఇద సర్వం విశ్వాభూతానాఽపః

# మొక్కతోలు చదువులఁ దక్కుకారు చదువులు
## (ఋగ్వేదీయ తైత్తిరీ యారణ్యకము)

వ్రేలికి నాలుగేసి గుంపుల కాల్ర్వేళ్ళగుంపులిరువది. కాల్ర్వేళ్ళు వ్రేళ్ళిరువది, జబ్బ, మెడకొంకి, కన్నుమొదల్లు కుడివైపిరువదియైదెడమవైపిరువదియైదు కలిపి

మొత్తమేఁబది. బొడ్డుక్రింది మేనివంతులన్నియు నేఁబది, రెండు పక్షికాళివెనుకటి తట్లు, తొడ (పిక్కల) యతుకులన్గలిపి యిరువదైదు. ఈతరబడ్డినన్గాల్గేలి దినుసులన్నియు న్గలిపిన మొత్త లెక్క నూటినడిమి యొడలిం (ఆత్మ) జేర్చినమొడలఁ దేలినటోకు - వెరసి - మొత్తమునూటయొక్క లెక్కమేనివంతులు. "పంచాంగుల యశ్చతుష్పర్వాద్వేకశత సీదోశ్చాత్మశ్చాం సఫలకంచసాపంచ వింశతిః పంచవింశానీతరాణిహ్యాంగాని తచ్ఛత మాత్మైకశతతమః॥ అచ్చట నూటిలెక్కయుసుఱు (ఆయువు) మొదలయినదాని పొడ (ఆయురాదిరూపము), ఉగము (జీవితకాలము) నూఱేండ్లు కనుకను, ఉసుఱున్నవరకు కన్నుమొదలయిన మేని చెల్వుపనిచేయును. విత్తనము (వీర్యము), చేవ (తేజము) జిగి (కాంతి) నిల్కడగా నుండును. వేల్చువాఁడు (యజమానుఁడు) నూటయొక్కటి లెక్కను నిండించుచుసుఱు మొదలగు మైదినుసులన్నిల్పఁబడును.

"యచ్ఛతంత దాయురింద్రియం వీర్యంతేజోయజమా ఏకశతతమ ఆయుషింద్రియే వీర్యతేజసి ప్రతిష్ఠితః" మేడిపండు మంచితిండి.

"ఊర్జోఽన్నాద్యస్యావరుద్ధ్యై" పిట్టతోఁక యీకెలువెనుక కుదుళ్ళు కల్గి యిరువదొక్క లెక్కనుండును.

"తహీఽమాని ప్రత్యంచి సుపర్ణాః సపతాత్రిణోభవంతి" పిట్టలు తమఁదోఁకయీఁకచేత నేలమీదన్గాని చెట్టుమీదన్గాని గట్టిగా నిల్చుకొనిపిదప గొప్పయుంకింపు (ఉత్సాహము) మింటికెగరుచుండును.

"సర్వాణి వయాంసిపుచ్ఛేన ప్రతితిష్ఠంతి పుచ్ఛేనైవ ప్రతిష్ఠాయోత్పతన్తి" ఉచ్చబుడ్డ (నీరు తిత్తి - క్లోమము) గుండె కెడమవైపునుండు వచ్చనిచియ్య (మాంసము) యుంత (ప్లీహము) మొదలగు కడుపులోని మాఱుపొట్లు (వికృతు) లిరువదొక్కటి

"ఏకవింశతిహీఽతా అంతరుదరే వికృతయః" ఉసుఱులు (ప్రాణములు) మేనిచిల్లులు తలయందేడుచాచుల (స్తనముల) రెండుబొడ్డు, కాళ్ళమడితోవ, కత్తియుల్లు మూఁడ్లు పెఱసి పన్నెండు

"ద్వాదశవిధాణ ఇమేప్రాణాః సప్తశీషమేణ్యావద్వౌస్తన్యౌ త్రయోఽవాంచ్యో"

నూటమ్ముప్ఫదేండ్లకుఁజైగా నిల్చునేడు (యజమానుడు) ఇతకఁగలడు. "త్రిష్టుబ్జగతీనాం సంపన్నానాం యావతీరావపన్తేతావం త్యూర్ధ్వ మాయ షోవషాణి జీవంత్యైతేన హైవాఽఽవపానేనాఽఽయురాప్నతే

జేజేపట్టు - జేజేలపట్టు - జేజేలపాలెము - దివము - (దివి) - విను - పోల్రిలు - వినువలను - విన్నుపోల్రిలు - విన్పొల్రిలు - విన్వలను (వెల్లబూల్గల పీడు) - వేగంటికచ్చేరి - వేల్పువెంకి (స్వర్గము)నుండి గాని, బిద్ద - బిద్దె - బిస్త (నరకము) నుండిగాని వానన్బట్టి నేలకు వచ్చినయుసుఱు (జీవుఁడు) వడ్లు (వ్రీహి), కారువడ్లు (యవలు) మొదలగు తిండిదినుసులలో నుండి తండ్రియొడలిన్జొచ్చును. ఆమగమేనియందు కూడు పస (అన్నరసము), నెత్తురు, నంజుడు (మాంసము) దొట్టి (మొదలుకొని) వరుసగా మాఱుచు విత్తనము (రేతస్సు)గా నిల్చియుండునదియే మగకడుపు (పురుషగర్భము) నాఁబడును. "పురుషేహవా అయమాదితోగ భోఽభవతియదేతద్రేతః". మగవానియందలి చూలు (గర్భత్వము) గా నిలిచినయే విత్తనము (రేతస్సు) కలదోయదేయడుగులు మొదలుకొని తలవఱకున్గలయెల్లమేనివంతుల (అవయవముల) నిగ్గుగా (సారభూతమై) పైకి వెడలును. తనపోల్కిన్దనవిత్తన మున్మగవాఁడు తనకడుపులో దాల్చియుండును. ఇట్లు మగవాఁడు తన విత్తనము పోల్కిఁదన కడుపులోఁబెంచుచుఁదుంట విల్తుడిగ్గి (కామాగ్ని) చేతనావిత్తనము నిప్పువలనఁగరఁగు నెయ్యివలెఁ బల్చనయి గుండెలో నిరవుకొనునట్టి విత్తు(రేతస్సు)ను ముట్టయిన తరుణమున నాఁడు దానిబుయ్య (యోని) నుండి కడుపులోనికి మగవాఁడు విడిచిపెట్టును. పిమ్మట విత్తుచెల్వగు నింకొక్కయుసుఱునిండుకొన్న (ఆవిష్టమగు) విత్తనము పొడయగు (రేతోరూపమయిన) యొడలిన్వాఁడుపుట్టించును. ఈతీరుగాఁనాడు దాని కడుపులోవిత్తనము చల్లుటయే మేనితాల్పు (జీవుని) మొదటి పుట్టుక.

"తదేతత్సర్వే భ్యోఽఙ్గేభ్యస్తేజః............"

మైతాల్పునకు (పురుషునకు) రెండడుగులు మొదలుకొని క్రింది పెదవివఱకొక్కచీలిక (దళము) మీఁది పెదవినుండి నడునెత్తిదనుక రెండు. రెండుగాఁజీల్చబడిన వెదురు బొంగువలె రెండుజీలికలు - పాయలై యొడలుండును. అంజలు - అడుగులు మొదలుకొని క్రింది పెదవివఱకున్న మేనివంతునెల, మీఁది పెదవి నుండి నెత్తి దనుకనున్న యొడలివంతు (భాగము) దివము(స్వర్గము), ఈ రెంటి నడుమనున్న నోటితెఱపియేవినువలను(సర్గము)నకు న్నేలకున్నడు మగలమిన్ను (ఆకాశము) నోటికనుమ (ముఖచ్ఛిద్రము) యందుసురు (ప్రాణము)పొదుకొని యుండును.

"పురుషోహవా అయంసర్వ ఆందంవిదలే భవత ........ ప్రాణ ఆయత్తో" ఉసురు (ప్రాణము) మేనిపాక నిల్పువెదురుబొంగు, "ప్రాణోవంశఇతివిద్యాత్".

# తక్కినవాని తొలుచదువులలోఁ జేరినపనస
# [ఐతిరేయ బ్రాహ్మణము]

వెలియూపిరి (ఉఛ్వాసము) డిగ్గిపొడ (అగ్నిరూపము) మేనికివేఁడి పుట్టించును, లో యూపిరి (నిశ్వాసము) జాబిలియడ (చంద్రస్వరూపము) యొడలికిఁ జలువఁబుట్టించును. వేఁడిచలువలన్బురికొల్పు వాఁడుపగటిఱేఁడు, ఆ రెండింటి నిల్పునదినేల. (భూమి) "ప్రాణాపానావగ్నిషోమౌ ప్రసవాయసవితా ప్రతిష్ఠిత్యా అదితిః".

తెలిపోయిన వ్రేల్మితల (యజ్ఞశిరస్సు) న్దిరిగిమేనికవర్చినవారు వేల్పు మందరులు (అశ్వినీ దేవతలు)

"తంసంభృత్యో చరశ్వినా విమం........" పెనుఁగువ్రేల్చువాని తప్పువలన నిలుఱేనికి (యజమానునికి) మెడచుట్టు పుండ్లతెవులు (గండమాలాఖ్య రోగము) పుట్టును.

"యద్విచ్ఛందసః కుర్యాత్తద్గ్రీవాసుతద్గండం........" చండ్రి (ఖాదిరము), మారేడు (బైల్వము) మోదుగు (పాలాశము) ఈ మూఁడుచెట్లు వరుసగా వేల్పునగరు (స్వర్గము). మేనిజిగిలావు శరీర పుష్టి (జ్యోతులు), చదువునేర్పులరించును.

"ఖారిదం యూపం ..." "బెల్వం యూపం...." "పాలాశంయూపం...." అబ్బాటుకొలఁదిచావు (ఆకస్మికాప మృత్యువు) నొందక నూఱేండ్లయుసుఱుకోరువాఁడు పందమ్రొక్కుల చదువుల మిడియల (అపమృత్యు పరిహారమునకై) యేర్పర్చబడిన శతఋగ్వేద మంత్రవిశేషముల దుదముట్టఁజదవవలయును (పారాయణము - జపముచేయ వలయును). నూఱేండ్ల యుసుఱు (జీవితకాలము) ఎవ్వనికుండునో యట్టివాఁడు వందేండ్లయుగమువాఁడు (శతాయువు) తానుచేసికొన్న చెడుగువలన గలుగఁబోవు డబ్బాటుకొలది చావు (అపమృత్యువు) తప్పించుకొనఁగలిగినవారు నూఱేండ్లు తప్పక బ్రతికెదరు. పదిగాలెక్కింపఁబడిన మేనివంతులు (ఇంద్రియములు) వేఱువేఱుగా నొక్కొక్కటివరుసగా బదినరములలో (నాడులలో) నడుచుచుంటచేతనన్నియున్గలిసి మొత్తముపై నూఱుమేనివంతులగుచున్నవి. కావుననవిచేయుపనులు (వ్యాపారములు) నూఱగుట నృట్టినూఱుచేవలకలిమి (శతవీరత్వము) చెప్పఁబడును. కనుక నేర్పర్చఁబడిన పనసలు నూఱుసార్లనుటవలన నూఱేండ్ల యుసుఱుపట్ల వ్రేల్మినొనర్చువానికి (యజమానున నూఱుకొలంది చేవలయుసుఱు (శతవీర్యశతాయువు) నిలుపఁబడును.

"శతమనూచ్య మాయుష్కామస్య...." పుల్లటిఁగ వస (సోమవల్లీరసము) న్దాగివివేల్పుటేఁడు వేగ్రిల్మినొనర్చునతని(యజమానుని) వగవారలకు న్గీడులన్దూడ మాపును.

"యస్యేంద్రః పీత్వా వృత్రాణి జంఘనత ప్రసజన్యాని........"

ఎగయూపిరి (ప్రాణము వేల్పుటేఁడు) ఎక్కడనుండునో యక్కడనేదిగ యూపిరి (అపానము - గాలివేల్పు) కూడనుండును.

"ఐంద్రవాయవం శంసతి యత్రవావ ప్రాణస్తదపానో యదైంద్రవాయ వంశంసతి ప్రాణాపానా వేవాస్యతత్సంస్కరోతి"

వీనులు, ముక్కు, నాల్క, అంట (త్వక్కు) ఈనాల్గింటికంటెకన్నె ముందుగాఁబుట్టెను.

"మైత్రావరుణః శంసతి తస్మాదాహుశ్చక్షుః పురుషస్య ప్రథమం సంభవః సంభవతీతి........"

తల్లికడుపునుండి పైకివెడలుకందు (శిశువు) తాలావుగానుండియు న్దల్లి బుయ్య (యోని) మిక్కిలి యిఱుకైనప్పటి కాయాఁడుగుఱి న్వాడుసల్పకయే పాడిగా (స్వభావమున్పట్టి) క్రిందికి దిగజాఱును.

"తస్మాజ్జాయాన్సన్గర్భః కనీయాంసం సంతం యోనిం సహినస్తి బ్రహ్మణా హిసక్లప్తఃపీతః....." మేడిపండుమిక్కిలి మంచితిండి. "ఊర్గ్వా అన్నాద్యము దుంబరః" ఈతలంపు వేల్మికి (యజ్ఞమునకు)ఁబగటివేల్పు పాలకొయ్య - పాల గుంజ (యూపము), నేల చచ్చెకపుఁదిన్నె (వేది), మందుమ్రాఁకులు (కొన్నె- దబ్బ - బర్హిః) పూయకకాచుచెట్లు (వనస్పతులు చితుకులు)-చిదుగులు- వేలిమి పుల్లలు - పుడకలు-పుడుకలు (ఇధ్మములు), నేలమీఁదినీళ్లల్ల మడిఁతడిచిలకరించు షిడత - పిడుత - బుడిగ - బుడ్డి-బుడ్డిగ-బోడిగ (ప్రోక్షణపాత్రములు,) తూర్పు మొదలగు వలనులు (దిశలు) గుడిచుట్టులు - గాలిగుడులు (పరిధులు), పైదినుసులెవ్వియున్లేక పోయినప్పటికిట్టి తలంప వేల్మి (శ్రద్ధాహోమము) చేతనే కోరికలన్ని యున్నమకూడును.

"అసౌవాఅస్యాదిత్యోయూపః...... "నాకొలఁది సామర్థ్యముచెప్పెద వినుము. తక్కువయునుఱు (అల్పాయువు) కలయావున్నూఱేండ్లు బ్రతికించెదను. నూఱేండ్లయుగముకల యెవ్వనికైన పే యేం డ్లు బ్రి తు కి చ్చె ద ను." శాతాయుంగామకరిష్యం సహస్రాయుః పురుషమ్".

ఆటవెలది॥ తిండియుసుబు, గుడ్డ - తెంకి
ఐంగరునగ, యొప్పిదంబు,
తొడుకు - లొసఁగు పెండ్లి
ఆలనుంగు కూఁతు - రలత,
కొడుకు వెలుంగు కరణిఁ
దండ్రిమింటనిరవు కొల్పు.

"అన్నం హి ప్రాణః శరణం హవాసోరూపం హిరణ్యం పశవో వివాహాః సఖాహజాయాకృపణం హదుహితాజ్యోతిహ పుత్రః పరమేవ్యోమన్"

గీ॥ బిడ్డలేకున్నవానికే - వెరవులేదు
ఈవయిపు తొఱ్ఱులున్గూడ - నెఱుఁగఁగలవు
కనుకఁగోడియ తల్లితోఁ - గాని, తోడ
ఁబుట్టువులతోడుతన్గాని - పొర్లుంచుడు.

"నాపుత్రస్యలోకోఽస్తీతి తత్స ర్వేపశవోవిదుః తస్మాత్పుత్రోమాతరంస్వసారం చాధిరోహతి"

పండుకొనుట, మేల్కొనియు లేవకుంట, లేచియునిల్లు కదలకుండుట, ఇత్వెడలి తిరుగుచుమంచిపనుబు చేయుచుఁదెగులు లేకుండుటయీనాల్గునటివలనఁ గలుగునునికులు (కాలకృతావస్థలు) వరుసగా (కలి,ద్వాపర, త్రేతా, కృతము) లనంబడు నిందుపండు కొంటకన్న మేల్కొంటనయము, మేల్కొంటకన్ననింటిలో మెలఁగుటమేలు, యింటిలో మెలఁగుటకన్న దవ్వులన్దిరుగుచుంటమంచి,

త్రేతా = త్రేతాగ్నులు.
కృతః = చేయబడినది = ఉపకారము.
ద్వాపరః = సంశయః = ద్వాపరయుగము.
కలిః = నొట్టియొడఁబు = కలియుగము.

"కలిః శయానో భవతి సంజిహానస్తుద్వాపరః ఉత్తిష్ఠం స్త్రేతాభవతి కృతం సంపద్యతే చరశ్చరైవేతి".

పిల్లచోట్ల న్దిరుగుచుండుటవలనఁ దేనెనొ్ందఁగలఁడు. దీయని మేడిపండ్ల న్దినఁగలఁడు. పగటివేల్పు (సూర్యుని) గొప్పకన్గొనుమెప్పటి కలసటలేకెల్లు తిరుగుచుండునో.

"చరన్వైమధులిందతే చరన్స్వాదుము దుంబరమ్ ।
సూర్యస్యపశ్య శ్రేరూణం యోనతంద్రయతే చరంశ్చరైవేతి ॥

మ్రొక్కచెల్లించని వానికిఁగడుపుబ్బుతెవులు హరిశ్చంద్రునకువలెఁదప్పక వచ్చును. "అథహైక్ష్వాకం వరుణోజగ్రాహ తస్యహోదరంజజ్ఞే" వేల్పులన్వేడుకొనువాఁడు (శునఃశేపుని) వలె చావుకట్లన్విడిపించుకొనఁగలఁడు. మ్రొక్కుచెల్లించువాఁడు హరిశ్చంద్రునిలాగునఁ దెగులునోఁగొట్టుకొనఁగలఁడు.

"తస్యహస్మచుణ్యాచ్యుక్తాయాం విపాశోముముచే కనీయఐక్ష్వాక సోదరం భవత్యుత్తమస్యామేవ చుణ్యాక్తాయాంవిపాశోముముచే ఒగదఐక్ష్వాకఆస" పెరుగు, నెయ్యి, మొదవులు, గఱిక మొదలగు మందుమ్రాకులు తినుటవలన మందులపస (ఔషధిరసము) అగును. తేనియ తేనెటీఁగలెల్ల పూవులనుండి తీసి కూర్చుటవలన మందుల నిగ్గగుచున్నది. "అథయద్దధి మధుఘృతం భవత్యపాంస ఓషధీనాం రసోఒపామే వాస్మింసదోషధీనాం రసందధాతి"

# మన్కిమిన్కున్గూర్చి తొలుఁబలుకుల తలలనుండి [ఛాందోగ్యోపనిషత్తు చెప్పినది]

తిన్నకూడు ముత్తెఱఁగుల మాఱును. లావుది (స్థవిష్ఠము) నలగము (పురీషము), నడుపాటిది (మధ్యమమయినది) చియ్య (మాంసము), మిక్కిలిపలుచని డుల్లము (మనస్సు).

తాగిననీళ్ళు ముత్తెఱఁగులగును. లావుదుచ్చ, నడిమిదినెత్తురు, సన్నపుది (అణిష్ఠము) ఊపిరి (ప్రాణము). తినినచమురు, వెన్న, చేవవేఁడిదినుసు, జిగటబందన (తేజము)లో లావైనది (స్థవిష్ఠము) ఎముక, నడిమిది మూలగ - చెక్కియము - చెక్కెము - ఊట (మజ్జ), సన్నము (అణిష్ఠము) నోరు - పలుకు (వాక్కు), కూడు మాఱుపాటు (అన్నమయము) ఆద - ఉల్లము - ఉల్లల - తలఁపు, నీళ్ళమాఱుదల (ఆపోమయము) ఊపిరి - గాలి (ప్రాణము), వేఁడి, డిగ్గిమాఱుపాటు (తేజోమయము) మాట (వాక్కు). పెరుఁగు గిలకరింప - గిలకొట్ట - చిలుక, తర్చిచ్చ - తరుచ (మథింప) గాఁబైకిఁదేలిన సుఱుగు (అణిష్ఠము) నెయ్యియగునట్లుఁ దినఁగాఁ బైకిఁదేలిన బువ్వనిగ్గుల్లము (మనస్సు) అగును. తాగిన నీళ్ళ పసయూపిరి (పాణము) అవును. కడుపులోనికి వెళ్ళిన డిగ్గి (తేజము) నిగ్గుపల్కు (వాక్కు) అగును.

కృష్ణయజుర్వేదీయతైత్తిరీయ బ్రాహ్మణము వ్యాఖ్యానములోఁ ద్రోవలోఁ బెరుగుబాన (బ్రహ్మసంధత్త) కనుపడుట మంచి గుఱుతు (శకునము)

బంతి॥ నిప్పనెయిన్దిని - నెయ్యిమైనేయి
కతమయిమనకుసు - ర్కలిగించి యెదుగు
ఆలకమ్మని గొన - బైననేదావ్రి
కావుమిత్రేనిగొ - డ్కని దండ్రివలెను.
("ఆయుదా అగ్నే॥")

కడుపునందలి యైదార (జఠరాగ్ని) తిండిదినుసులు కూడు పప్పు నేయి మొదలగు మందులచే వెలుగుచుఁబెరిగి మాకు సొగసైన తెల్లని యొప్పునైలివి తేటలన్నెంపుకావించి నింగినేలలందలి మాయిడుమలెల్లనోప్పఁగొట్టును.("త్వామగ్నే ప్రిదివ"॥"ఘృత ప్రతీకం॥") కడుపుకిత్తి (జాఠరాగ్ని) న్బాగుచేసికొనువారు నూతేండ్లుగాని నూతేండ్లకుఁబైగాఁగాని మంచి మందుచవి (జీవనౌషధామృతము) ద్రావుచుహాయి గా బ్రతుకఁగలరు.

(శత శరర్భ ఆయుషేవచ సేజీవాత్యైవపుణ్యాయ) మంది కందఱికి దలయందలి యేడుదొలకలందేడునుఱులు (సప్తప్రాణములు) ఉండును. (సప్త వైశీషాణ్యాః ప్రాణాః)

బంతి॥ వెలుఁగులతేఁడగు న్వేల్పులబువ్వ.
(అకోవై దేవానా మన్నమ్) -

కూడంతయెకు వకాని తక్కువుగాని తినకతగు పాళముగాఁ దినవలయు నపైనచో నట్టితిండి తిన్నగా నొడలికి పట్టితెగులు తగలనివ్వక కావలసిన చేవ (పుష్టి) గలిగించును. (మధ్యతోఒన్నమశితంధినోతి). తల (శిరస్సు) వెండ్రుకలు (లోమములు) అంట (త్వక్కు) ఎముకలు (అస్థులు) ఈమూడు దినుసుల న్గలిగియుండును. "త్రివృచ్ఛిరోభవతి, త్రేధావిహితం హిశిరః, లోమ, ఛవీ (ఛవీ స్త్వక్), రస్థి" ఒడలులావైన తలలావుకాదొడలు చిక్కినఁదల చిక్కిపోవదొడలెట్లున్న దలయొక్కలాగున యుండును. "నమేద్యఒనుమేద్యతి, నకృశ్యతోఒను కృశ్యతి". వడ్ల (వ్రీహి) కంటె, న్గారువడ్ల (యవల) కంటె నైదము(గోదుమలు) నయము. "నవాఏతేవ్రేహయోనయవాయద్గోదూమాః" నూతేండ్లుమంది (మానిసి) కుసుఱు (ఆయువు) తెలిపనులన్గావించునొడలి పదిదినుసులు (దశేంద్రియము లలో) కన్ను మొదలగు దినుసుల కొక్కొక్కంటికిఁ బదినరముల (నాడుల(

యందు నడక మాఱుపులన్నట్టి నూఱుమేనిదిన్నులు (శతేంద్రియము) అగును.

"శతాయుః పురుషః శతేంద్రియః ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి"

ఏఱదేండ్లవఱకు దొలియుగము (పూర్వాయువు) తఱవాత మలియుగము (ఉత్తరాయువు) "ఉత్తరఆయుషి" తినెడియూరు మందుదినుసులేడు- నువ్వులు మినుములు, వడ్లు, ఉలవలు (యవలు), చిఱువడ్లు, కొఱ్ఱలు, సైదుమ (గోదుమ పిండి). కారుదినుసులేడు. వెదురు, తోఁక వడ్లు (చామలు - శ్యామాకము), గువ కలు - గునుకలు - గొలివెలు - గోళ్ళగొండిలు - దూసరులు- ఐదపటలు (అమ డలు - నివ్వరి - నీవారము), కారునువ్వులు - వలిసెలు (జతిఞాలములు). వట్టి వడ్లు (వట్టివరి- గవేధుక) ఆళ్ళు (మాకఞటిక) ఇట్లుదుక్కిపంటలేడు, దుక్కిలేని పంటలేడు.

కల్లరకి నీటికడుపు తెవులు రాకమానదు. "అనృతేఖలు వైకిృయు మాణో వరుణోగృహ్ణాతి"

గోతిలోనినీళ్ళు త్రాగరాదు. వాననీళ్ళుతాృగఁగూడదు ("తస్మాత్త్వదరాదు దకం నాచామేత్, నవషఞధారాస్వాచామేత్తధాన ప్రదరోదకమ్")

ఆవీనిన పదినాళ్ళలోపుగానద్దానిపాలు త్రాగరాదు. "దశమారాత్రీ జాఞ తంనదోహన్" ఆవున్డిగ్గి (అగ్నిహోత్రము)గానెంచి యగ్నించువాఁడు నూఱేం డ్లయుసుఱులోపున చిఱుచావు అల్పమృత్యువు నకుఁలోఁబడకపోయిగా బ్రతుకు ను, "గౌర్వా అగ్నిహోత్రం, యఏవంవేద గౌరగ్నిహోత్రమిత్రమితి, ప్రాణా పానాభ్యాం"

దేవహారు బంక (గ్ధాగరము) యనెడు కమ్మతావిదినుసు బొట్టుపెట్టుకున్న యూఁడుదానికి మగవాఁడు లొంగిపోవును. అధహాసీతాసావిత్రీ సోమంరాజానం చకమే "తస్యాఉహస్థాగరమలంకారం కల్పయిత్వా ........ ముఖ్యేలంకృత్య", ఎవ్వఁడైన నానామముంచుకొని యేదొరనైనన్దనకులోకువ చేసికొనఁగలడు.

"సయఃకామయేతప్రియఃస్యామితి...." (నీలిమందు - పసపు) పూసికొన్ను చున్న యెలనెఱిసిన వెండ్రుకలు నలుపెక్కునెల్లతెఱగుల తెల్ల పొడలపులుము (కుష్టు) మానిపోవును.

"నక్తంజాతాఽస్యోషధే.... కిలాసంచపలితంచ.... అసితంతే నిలయనమ్.... అస్థిజస్యకిలాసస్య...., సరూపానామతే మాతా".

౮౦॥ మంచుకొండనుబ్బుట్టు మందారపువ్వ
మాన్పు మాద్దఱన మాగుండె తెవులు ॥

యత్రై సుజాతే హిమవత్సు భేషజమ్...., అదోగిరిభ్యో అధియత్ప్రధావసి.." ప్రోగులు వీనులన్గట్టిపెట్టుకొనునగలుసుఱునొప్పిడిగించును,

"ఆయురసి విశ్వాయురసి...." కలక, మిఱుమిట్లుకొనుట మొదలగు కంటి తెవుళ్ళకు నోటి యుబ్బ తగల్చిన సన్నపుగుడ్డ వేఁడితోఁ గన్నులు గాఁచుచున్న యెడల మానిపోవును.

"క్రామిష్యైకాఃకఇమేపతంగాః, మాంథాలాఃకులిపరిమాపతంతి......." అఱకము - అఱుకువ - అఱ్ఱియము - అఱ్ఱె - మఱ్ఱి - మఱ్ఱియ - పాఱుడు - బేదికక్కుపారుల తెవులు (అజీవిషూచిక) వఱడు, పులి, డేగ, నెఱసరి -ఏనికతిండి (సింహము) కన్గడుపులోని డిగ్గి (జఠరాగ్ని) యెక్కువుగా నుండుటవలనఁ దగులదు. ఆతెగులీయిలు ఈనికిదగులకుండునుగాక.

"యావ్యాఘ్రిం విషూచిహ...." సైదము(గోదుమపిండి) రేఁగుపండ్లుకలిపి తిన్న యెడలఁదెవుళ్లనొప్పిఁగొట్టు మందగును. "అజోధూమ్రోనగోధూమైః క్వలై భేషజమ్" ప్లేలపిండి, రేఁగుపండ్లముద్ద తీయని చల్లలోఁగలిపి తిన్నయెడలఁ దెవుళ్లనొప్పిఁగొట్టును.

"యవైః కర్కంధుభిః, మధులాజైన మాసరమ్" మేనన్పంగారు నగలు తాల్పువారు పెక్కేండ్లు హాయిగా బ్రతికెదరు.

"ఆయురసి విశ్వాయురసి, సర్వాయురసి, సర్వమాయురసి" ఓడిగ్గి(అగ్ని) మాకడుపులందుండు కిత్తి (జఠరాగ్ని) న్నన్నగిల్లించు తెవుళ్ళ నొప్పిఁగొట్టుము. ముదిమినాప్రినివ్వకడైడునెల్ల మందులచేతనఱుఁదెవులు (క్షయవ్యాధి), మమ్మంటనివ్వకుము. మాకేతెవులు నాప్రినివ్వకహాయిగా మమ్మబ్రతికించుము.

"అగ్నేత్వమస్మద్యుయోధ్య మీవాః......." ఓముక్కంటిః మాకు నీవిచ్చిన మందులవలన మేమునూఱుమంచుతఱులు-పందేండ్లుహాయిగాబ్రతికెదముగాక.

("త్వాదత్తే భిరుద్రిశంతమేభిః, శత హిమా ఆశీయభేషజైః")

తిండిచేతనే మీదిగాలి క్రిందిగాలులు (ప్రాణాపానము లు)

రెండును దిన్నఁగా బనిచేయును. చెడుకూడుకుడుచుటచేతఁజావువచ్చును. మంచి తిండె హాయిగాఁ బెక్కేండ్లు మననిచ్చుబ్రతుకు మందగును.

ఈ మాటయందఱెఱిఁగినదే. మందుచదువరు (ఆయుర్వేద శాస్త్రజ్ఞులు) అయిన పాఱుండ్రు (బ్రాహ్మణులు) కూడేముదిమితెచ్చునంను రొక్కరకము కూడుతినుటవలన దబ్బున నెరపుకలుగునని యునురుమిన్కుల (ఆయుర్వేదము) వెల్లడించుచున్నది. కూడేయొడలికిఁ జేవపుట్టించి బిడ్డలన్గనఁజాలునలవు (శక్తి) న్గలిగించును. "అన్నం ప్రాణమన్నమపాన మాహుః ...."

ఇరువదినాల్గవచుక్క (శతభిష నక్షత్రమున) న్పుట్టినవారు గొప్పమందరు లై (వైద్యులై) పెక్కేండ్లు హాయిగా బ్రతికెదరు. ("తన్నోనక్షత్రం శతభిగ్జు షాణమ్ ....")

ఎవనితల పుట్టెయైన నెనిమిది చిప్పలతో నతుకఁబడియుండును. "తస్మా దష్టాకపాలం పురుషస్య శిరః"

వాననీళ్ళు, నూతినీళ్ళు మడుఁగు - కొలను- తిరుకొళంబు నీళ్ళు, ఏటినీళ్ళు నాఁబడి నీళ్ళు నాల్గురకములుగా నుండును. "చతుష్టయ్య అపోభవంతి"

చెంబుతలయతఁడు - చెమరించువాఁడు - బొల్లివాడ్బిల్లి చూపులవాఁడు - చెనటి (ఖంతేర్విక్లిధన్యు) గుచ్చిపుటంటకు (త్వక్కునకు) ఁదెగులుతగులునపుడు నెత్తురుపోయు మందివ్వవలయును. "పౌష్ణంచరుం నిర్వపేత్, యదిశ్లోణఃస్యాత్"

ఉలిమిడిచెట్టు కొయ్యముంతతో నీళ్ళుత్రాగువానికాఁకలి తగ్గిపోవును. జర రాగ్ని మందమైపోవును. "అగ్నిర్వాఇదం .... వరణశాఖయా ఒవారయంత" ఉలిమిడిచెట్టు చెక్కయఱఁగఁదీసి యొడలికిఁబూసికొన్నయెడల నిప్పుచుఱుకదు. తస్మాద్వరణోభిషజ్య ఏతేనహిదేవా ఆత్మానముచాయన్త" పెరుఁగుతోఁ గలిసిన నెయ్యి (పృషదాఒఒజ్యము) విత్తనము (రేతస్సు) మగగుఱి కుడివైపు నుండి పడును, "దక్షిణానూరూనభిషించంతి దక్షిణవోహిరే తస్సిచ్యతే" కల్లరితెల్లపులుము తెవులు పొందును. "అనృతం హిసోఒవదత్స ఏషఃశ్విత్రః తినుబడిదినుసులనెల్లఁ దేనె (మాక్షికము) మిక్కిలి మేలయినది ("పరమస్యాన్నాద్యస్య.... యన్మధు") మేడిచెట్టుక్రింద నెల్లపుడి సండ్లతోఁ బొట్టనించుకొనువాఁడే తెవులున్గుల కెవ్వరి పొరిపున్గోరకహాయిగాఁ బెక్కేండ్లు బ్రతుకును. "ఉదుంబరేవ సత్యాగుణ దుం బర ఊర్జ మేవావరుంధే" నూఱేండ్లు హాయిగా బ్రతికిన వానికన్నగొప్పవాఁడిం కెవ్వఁడు న్గాడు. నూఱేండ్ల బ్రతుకే చవితనము (అమృతత్వము).

"ఏతద్వావమనుష్యాఽమృతత్వంయత్ సర్వమాఽఽయురేతి వసీయాన్భవతి" కారు (అడవి) పంటలనే తినవలయును (తస్మాదారణ్య మేవాశ్నీయాత్: శతపథ బ్రాహ్మణము) చెట్టునఁబుట్టు ఆకు, పువ్వుకాయ, పండు (వృక్ష్యము), తలపుట్టె పెంకులనడిమి చియ్య (మాంసమున) కు నెదడు (మస్తిష్కము) అని పేరు. తిన్నతిండి నన్నినరములకున్బంచి యిచ్చెడిగాలి పంపకపు కరువలి (వ్యానము) నాఁబడును. వేర్లికణుపులు మూఁడిటికొలవఱకు నేలలోనే మందుమొక్కల వేళ్లు చొచ్చియుండునో యామందువేళ్ళలోఁ దెరువుమాన్లు (విష్ణుమూర్తి) నెలకొనియుండును. (ఓషదీనాం తదుతథాన కుర్యాత్.... విష్ణుమన్వహిదంస్తస్మాద్వేదినాఞమ)

బం॥ నింగినేలలనెల్ల నెలకొనుదినుసు
లన్నియున్మందులే - యారసిచూడ,

"ఋతవఓషధీః పచన్తిద సర్వంయు ఏవమేతు మగ్నిమృతుష్వా భక్తం వేద" నేలయందలి దినుసులెల్ల తడిపొడివాసి నెర్రిందేరకముతడివిఁజాఖిలి, పొడివిడిగ్గి (అగ్ని) "ద్వయం వాఇదంనతృతీయమస్తి, ఆర్ద్రఞంచైవశుష్కంచ, యచ్ఛుష్కంతదాగ్నేయం యదార్ద్రఞం తత్సౌమ్యమ్"

## (అధర్వవేద సంహిత) లోఁ దెవుళ్లన్మాన్పు పెరవులు - మందులు.

కాక నీరుడి తెవులు, (అతిసారము), ఇరువాయికట్టుతెవులు (మూత్రపురీషబంధనరోగము) మాన్పుటకై (ముంజగడ్డితో) పేనినతాడు కరక చలువయిసుక (కపురము)లతోఁబూసి మగయాడుగుఱులలో నెక్కించుట. ఎఱుక ద్రిప్పినపాటి (మంటిపై) నట్టితెగులు గొంతుకట్టియమోయఁ గూర్చుంపఁబెట్టుట, మందువేళ్ళ మఱఁగించిన నీటి ( ) దాగింపవలయు నీమడియ (మంత్రము)అను చుండవలయును. "యథాద్యాంచపృథివీం చాన్తస్తిష్ఠతితేజనమ్, ఏవారోగంచాస్త్రావచాన్తస్తిష్ఠతు ముంజఇత్" ఓనీరుడి (మూత్రరోగము) పొరుడు (అతిసారము) తెవులు గొంటా (రోగి) నీకడుపులోపల నిలువమై పొంగిపొరలైన యుచ్చనేం పైగలగల చప్పుడు చేయుచు వడివడి (ఈమంత్రపుబలముచలన) స్రారిపడిపొవున్గాక. "విద్మాశరస్యపితరం పఞన్యం శతవృష్ణియమ్, తేనాతేతన్వే శంకరం పృథివ్యాంతే నిషేచనం బహిష్టే అస్తువాలితి", "విద్మాశరస్య పితరం మిత్రం శతవృష్ణ్యమ్, తేనాతేతన్వే శంకర పృధివ్యాంతే నిషేచనం బహిష్టే అస్తువాలితి" నింగినేలల యుసుఱులకెల్లఁ దండ్రియగు పగటివేల్పు నీసీరుడు తెగులున్దబ్బున

నొప్పిఁగొట్టు న్గాక. రేయివేల్పు (వరుణుఁడు) నీనీరుడు తెవులునొప్పిఁగొట్టెడున్గా
వుతను "విద్మాశరస్య పితరం వరుణం శతవృష్ణమ్॥" జాబిలి నీనీరుడి తెవులునొప్పి
గొట్టుఁగాక. "విద్మాశరస్యపితరం చంద్రం॥" వెలుఁగులఱేఁడు నీనీరుడి తెవులు
నడంచుఁగాక. "విద్మాశరస్య పితరం సూర్యం॥" ఈమిడియలు (వేదమంత్రము)
లనుటవలన నీరుడి తెవులునొప్పిగొట్టుచేవ (మహిమము) కలదు. ఉచ్చతిత్తిలో నరి
కట్టుబడి ప్రేగులలోఁ బ్రోగయిన కాల్మడి (మూత్రము) యంతయున్దప్పక
దొలదొల జాతిక్రిందఁబడి పోవునట్లుమిడియలు (వేదమంత్రములు)చేయఁగలవు.
ఓనీరుడు తెగులు గొంటా (మూత్రవ్యాధి పీడితుఁడా)నిండినచెరువునకు మదుము
తెఱచునట్లే యినపపాళా (కడ్డి - లోహశలాక) నీకామకోవి (మేహననాలము)
లో దూర్చెదను. తప్పక నీయరికట్టఁబడిన యుచ్చయంతయు న్బలబలపైకి కాఱి
పోవును. "ప్రతేభినద్మి మేహనం వర్త్రం వేశన్త్యా ఇవ, ఏవాతేమూత్రం
ముచ్యతాంబహిర్బాలితి సర్వకమ్" ఓనీరుడి తెగులుగొంటా నీక్రిఁగడుపునందు
మూసికొని యున్న(పొత్తికడుపు బస్తినీ)కన్నముద్దెఱచెదనపుడు కడలి నీళ్ళప్పు
టేటిలోనికివలె నీయుచ్చ నీమగగుఱి నరములోనికిఁ బోడుచుకొనివచ్చి బలబల
క్రిందఁబడిపోవును. విషితంతే బస్తిబిలం సముద్రస్యోదధేరివా, ఏవాతే మూత్రం
ముచ్యతాంబహిర్బాలితి సర్వకమ్" ఎక్కుపెట్టుబడిన వింటినుండి యెగచబడిన
అలుఁగు - అల్గు - కోల - తూపు - లకోరి (బాణము) ఎట్లువెంటనేగుఱికిఁదగు
లునోయట్లేనీయుచ్చయొక్కమ్మడి న్బొదబొదక్రిందన్గాఱిపడును, యదేషుకాపరా
పత దవసృష్టాధి ధన్వనః॥" నీళ్ళలోబ్రతికించుమందు చవి (అమృతము)కలదు.
"అప్స్వంతమృతమప్సు భేషజమ్" మాడప్పితీర్చి మాతెవుళ్ళనెల్ల మాన్చిమీవెఱపు
లనొప్పిగొట్టి మాకన్ని తెఱగులనమ్రంచి నీళ్ళు హాయికావించి మాబ్రతుకు న్బొడిగిం
చుఁగాక "శంనోదేవీరభిష్టయ ఆపోభవంతు పీతయే, శంయోరభి స్రవంతునః"
తెవుళ్ళనెల్లఁదప్పకకుదుర్చు మందుదినుసుల పొడయగుడిగ్గి (అగ్ని) నీళ్ళలోవి
మిడియున్నది. (అనిసోముడగ్నితోఁ బలియ...."అప్సుమేసోమో అబ్రవీదంతర్వి
శ్వానిభేషజా, అగ్నించ విశ్వశంభువమ్" ఓ నీళులారా మీరు నా మేనన్దెవుళ్ళవ్వి
యున్దాకనీక నివ్వనిమందుతో నింపుడు. నేను బెక్కేండ్లు హాయిగాబ్రతికివెలుఁగు
లఱేనిన్గొల్చుచుందున్గాక. "ఆపఃపృణీతభేషజం వరూథంతన్వేమమ, జ్యో
క్త్వసూర్యందృశే"ఎడారిలోనినీళ్ళు చవుటినేల (ఉషరము-దన్వన్యా)నీళ్ళు,జౌకు
నేల(అనూపము) నీళ్లు నూతినీళ్ళు ఏళ్ళు చెఱువులునుండి తెచ్చి బానలలో నిలువ
చేసిననీళ్ళు, వాననీళ్ళు మాకు మేలుచేయుఁగాక."శంనఆపోధన్వన్యాశము సంత్వ
నూప్యాః శంనఃఖనిత్రిమా ఆపః శముయాః కుంభఆభృతాః శివానః సంతువా
షికీః" కల్లరికి (అనృతవాక్కునకు) నీటిపొట్టతెగులు (జలోదరరోగము)
తప్పకవచ్చును, కల్లరిపైనీటిఱేనికి (వరుణునకు) గినుక (కోపము) వచ్చును.

గనుక దబ్బరాడక నీటితేని న్గొనియాడు వానికి నీటి పొట్టతెగులు కుదిరిపోవును.

"యదు వక్షాన్నృతంఁడి హ్వాయావృజినం బహుశాజ్ఞప్త్వా సత్యాధర్మణాోముం చామి వరుణాదహమ్" నీళ్లాడఁజాలక నొప్పులువడునిందు చూలాలి బయ్య (యోని) న్వెడల్పు కావించెదమో నీళ్లాడించు వేల్పాకడుపులోని బిడ్డతల ముందు గాఁ బైకివచ్చుతీరుగానా బిడ్డనొప్పదవికొని యున్నమావి (జరాయువు) న్దెఱవి హాయిగాఁబురుడువచ్చునట్లు చేయుము. "సూషామ్యాణో ణతువియోనిహాపయా మసి. శ్రథం యాసూషణేత్వమవత్వం బిష్కలేస్పృజ", కనఁజాల కిడుమన్నుపు నిండు చూలాలా! (గర్భిణి) నీయుచ్చ పడుత్రోవనే గాక (మేహనమును) దాని కండ (ఆధారము) గానున్న బయ్య (యోని) న్గూడఁదెఱచి చులకనగా (సుఖ వుగా సులభము) బిడ్డపైకి వెడలునట్లు చేసెదను. అచ్చోటున (యోని) కిరుపై పుల బిగిసికొని బిడ్డన్వెలువడనివ్వకిరియించు నరములన్గూడ సడలించి వదులుకా వించి యాదారి న్గూడ వెడల్పుచేసి తిన్నపర్చెదను. తల్లిబిడ్డన్గూడ వేఱుగా నేర్పా టు సల్పుటయేగాక బిడ్డనొప్పదవిబిగియ మూసికొని యున్నమావి (జరాయువు) న్విప్పికడుపుతిత్తిలో నుండి బిడ్డనప్పించెదను, ఁబిమ్మటమావికూడఁగ్రిందపడిపో వును. "వితేభినద్మి మేహనం వియోనింవిగ వీనికే, విమాతరంచ పుత్రంచవికు మారం జరాయుణావజరాయుపద్యతామ్".

పగటివేల్పు (సూర్యుఁడు) ఒక్కతనవెలుఁగు (తేజము- ఓజము) నేగాలి, డిగ్గి (అగ్ని) జాబిల్లి (చంద్రుడు), చెలువుల ముత్తీరులఁగావించి మేనితాల్పుల నెల్లఁబొదవుకొని గాలి (వాతము), వేఁడి – కఱఁకు (పిత్తము), తెమడశ్లేష్మము లనఁబడు ముక్కిడుల (వాతపిత్తశ్లేష్మాత్మకత్రిదోషముల) నెసంగించు ముత్తెఱఁ గుల వేల్పులు తానొక్కఁడేయై యంతట నిండుకొని చెలువారుచుండును గనుక ముక్కిడుల తార్మాఱువలనఁ బొడమిన తెవుళ్లెల్ల (దోషత్రియోద్భూతరోగము) లన్నియున్పగటివేల్పున్వేడుకొన్నయెడలఁ దప్పక కుదిరిపోవును.

'జరాయుజః ప్రథమఉస్రియోవృషావాత భ్రజాస్తనయన్నేతి వృష్ట్యా, సనో మృడాతితన్వఋజుగోరుజన్ య ఏకమోజస్త్రేధావిచక్రమే" తలనొప్పి, గుండెకు త్తుకలనొప్పడము దగ్గుతెవులు (కాసరోగము). ఒడలికీళ్ళనన్నిటివలనఁబుట్టిన దగ్గు తోఁగూడిన యపుఁదెవులు (క్షయరోగము - శ్లేష్మరోగము), గాలి. వేడి, తెమడ కీడులు మూఁడిటన్గలుగు తెవుళ్లెల్ల (వాతపిత్తశ్లేష్మత్రయ జనితము) లగునెల్లతెఱఁ గుల నలుకువలు, మబ్బువలనఁబుట్టిన (అభ్రిజము) లయిన తెవుళ్లను వాననీళ్ళ వలనఁ గలుగు రొంప (శ్లేష్మము) తెవులు, గాలి తెవుళ్ళు (వాతరోగములు), వేఁడి (పిత్తము) వలన నొదవినకాఁక (జ్వరము) మొదలగు నుబ్బుతెవుళ్ళు ముక్కిడుల (త్రిదోషముల)ఁజెలరేఁగిన యన్నిరకముల తెవుళ్లెల్ల నిత్తెగులుగొం

టును (రోగిని) విడచి యెడారులందలి చెట్లకు న్గొండల కెవ్వరున్దిరుగాడని (మను ష్య సంచారములేని) నిట్రాతిమెట్టలకుఁ బట్టిపోవున్గాక; యోవెలుగులతేఁడ నిన్నె ల్లపుడు వేఁడుకొందుము మాతెవుళ్ళనెల్లన్దబ్బున బోగొట్టుము. ఓవెలుఁగులతేఁడా! నిన్ను గొల్వని పినవారులన్నివు కాపాడనొల్లవు. నీకు మ్రొక్కుట తప్ప నిన్ను మతెట్లైన నిన్ను గొల్చు వెరవుతేదు. నీయడిదమగు పిడుగునకు న్గూడ మ్రొక్కెడెదము. ఓవేల్పులతేఁడ నరములకెల్ల నాటపట్టగు బొడ్డువలె నీవుమింటి మబ్బులకెల్ల నండగానుంటనీయున్కిపట్టు తెలిసికొన్నారము. "పవతోనపాన్నమ ఏవాస్తుతభ్యంనమస్తే హేతయేతపు షేచకృణ్మః విద్మతేధామ పరమంగుహాయత్ సముద్రే అంతర్నిహితాసినాభిః".

# [వేల్పు తొలుబల్కుల యజుర్వేదము] లోఁజెప్పబడిన మందులు

మంది (మనుష్యులు) డిగ్గినుండి (అగ్నిద్వారా) కమ్మతావిగల వేళ్ళదినుసులు గాలిన్గలిపి గాలితోఁగూడిన కమ్మతావి (సుగంధము)వలన నెమ్మది (ఆరోగ్యమును) గొప్పతడవు బ్రతుకు (దీర్ఘజీవితమును) బొందుచున్నారు. తేఁడు పెక్కుతెఱఁగుల మందరులన్దనయొద్దనుంచుకొని కాపాడుచుండవలయును. ఆ మందరులుమంచిమందులతోఁ దెవుళ్ళన్గుదుర్చుచుండవలయును."ఆత్వాజిఘర్మి".

నిక్కమే పల్కుచు నెల్లపుడిగ్గి (అగ్ని) న్గూర్చి మందుల న్గూర్చిన చదువులనాటితీటి కోపు (మద్యము) న్దప్పఁద్రాగక తెగుళ్ళన్మాన్పుయందఱున్బెక్కేండ్లు మనవలయును.

"ఋతగుం సత్యమమృతగుం సత్యమగ్నిం"

తల్లిదండ్రులు తమయాడుపిల్లలకుఁకూడ మందులన్గూర్చిన చదువుమప్పిన యెడల నప్పడుచులు తాముచూల్దగిలినప్పుడు నీళ్ళాడునపుడు కావలసిన మందులు వాడుకొని తెగులు గొంట్లు (రోగిణులు) గాక హాయిగా బిడ్డలతోఁగూడఁ బెక్కేండ్లు హాయిగా బ్రతికెదరు. "ఓషధయః ప్రతిగృ॥"

మగవారుగాని మగువలుగాని తాము తెగులుగొంట్లు కాకుంటకొఱకు (రోగములు తగులకుంటకై చీకటి తప్పు పంపు, పడుచుఁజేత - పడుపు - బజాఱము- బాజాఱము - రంకు - రంకాట - ఱంకు - వెలిచవి సల్పఁగూడదు,

"విపాజస్తాపృథునాయు నక్తిసిరా"

నెయ్యివేసి వొగిచిన పలురకముల కూరలు, కుడుములు మొదలగు తిను బడి దినుసుల వంటబాగుగా నేర్చినవంట పుటన్లూర్చుకొనవలయును.

"యస్తే ఆద్య"

మగవారుగాని యాడువారుగాని బాగుగా వంటనేర్చుకొని మంచితిండితిని తెగులు దగులక హాయిగా నేల దున్నిపండించుకొనుచుఁ బెక్కేండ్లు గట్టియొడళ్ల తో బ్రతుకవలయును.

''కామం కామదుఘే''

మంది (మనుష్యులు) తగినమందులు వాడుకొనుచొడళ్ళ కనువగు తిండి (పథ్యము) తినుచు పూనికన్మంచి నడువడి కలవాటు గొనుచు, ద మ మే ను లు తెగుళ్ళన్దగులనితీరునఁగాపాడుకొనుచున్నన్గాని పాడి (ధర్మము), ఒడమి(అర్థము) కోర్కి (కామము), పెందోవ ముగితి - ముక్తి-మోక్షములనుఁబొందఁజాలరు.

''శతంవో అంబ''

ఆఁడుది మగవాఁడు నొండొరువుల మంతనము - ఒంటిపొటు - కందువ (ఏకాంతము)గా మాట్లాడుకొన్నపిమ్మట న్గావించుకొన్న పెండ్లి (గాంధర్వవివాహము) వలన నాల్మగలు హాయిగాఁబెక్కేండ్లు బ్రతికెదరు.

''ఉత్థాయ బృహతీ''

రెండుకన్నాకులు (మనుష్యులు) అందఱు నొక్కతెగ (ఒక్కేజాతి) తే చెంది తమలోఁదాము కొద్దిగొప్పలెన్నుకొనకాఁడువారు న్మగవారున్గూడ మేటిచదువరులై కల్మిలేముల నొండొరువుల న్గలసి మెలయుచున్నన్గాని వారికొండొరిమిక-చెలిమి (ఐకమత్యము) కుదురదు. అందఱున్దమలోఁదాము పొత్తుతోనుండినన్గాని హాయిగా మననేరరు. నేలలోని దినుసులఁ దెలిసికొనదగు చదువు భూగర్భవిద్య (వైద్యము) నేర్చినన్గాని తెగుళ్ళన్బగతుఱ (శత్రువుల) న్గూడ నడంపఁజాలరు. గుఱ్ఱమెక్కి పగవారినెట్లుగెలిచి హాయిగా నుండనగునో యట్లే యెల్లమందుదినుసుఁదినుచుఁదగుపాటిగా (పథ్యముగా) గూడుకుడుచుచుఁజెడుకోర్కుల నడంచుకొని (జితేంద్రియులై) తెవులు దవులక (ఆరోగ్యముగా) నిమ్మళముగా నెమ్మదిన్గాని మనుచుందురు,

"ఓషధీఃప్రతి"

వఱ్ఱు మొదలగు కూరగాయ గింజదినుసులు యెట్లు మేనులఁబెంచునో య ట్లులే తల్లులు తమపిల్లలకు మంచిచదువునేర్పి తా మున్నమబిడ్డలున్నాడ నొండొరుల చేరికన్నాయిగా మనఁగలరు.

"ఓషదీరితి"

తగిన మొనగాని (సేనాపతి) యూఁతచేత నెట్లుతేడు లాతిసీమలన్నగవారి న్గెలిచి యేలుబడిన్గొని యొప్పారునోయటులే గొప్ప మందరి (భిషక్కు) వలన నుసుఱుతొలుఁజదువుల (ఆయుర్వేదము) నేర్చుకొని యెచ్చోట మంచి మందు మాఁకు దినుసులు చిక్కునో వానినీసి తెచ్చుకొని మంది యందఱున్నమలోఁదా మొండొరుల (అన్యోన్యము) కామందులయోజల (గుణముల) న్దెలుపుకొని వాడు కొనుచు మేలు పొందుచుండవలయును.

"యత్రౌషధః సమఁగ్మతు"

ఈమిడియన్ (యజుర్వేదమంత్రము) బట్టి తెవుళ్ళన్గుఱుతించుట (నిదాన ముచేయుట), తెగుళులన్గుదుర్చు వెరవు (చికిత్సావిధానము) మందు పుచ్చుకొని తగినట్లు కూడుకుడుచుతెఱఁగు (ఔషధపథ్యసేవనము) మందులయోజ న్దెలిసి కొంట (ఓషధిగుణజ్ఞానము) మందులుతగునట్లు వాడుకొనుటచేతఁ న్దెగుళ్ళనా మ్పుకొని మంది పొందవలసిన కలుములు (పురుషార్థములు- ధర్మార్థ కామమోక్ష ములు) చేకూర్చుకొనుట యందఱున్దొలుతచేసికొనవలసినపని.

"అశ్వావతీ సోమావతీ మూజజయంతీముదోజసా"

"ఉచ్ఛుష్మా ఓషధీనాంగావో"

ఏయేపనులు చేయుటవలనఁదెవుళ్ళు వచ్చునో యాయాపనులు మానుకొన వలయును.

యాఃఫలినీయాః.

ఇలుతేనివలన (గృహాధికారి) నదలింపఁబడిన దొంగవలె మందు పుచ్చుకొ నుటచేతఁతెగులు పటాపంచలగును. కల్వముబాగుగాఁ గైగవతోనూఱిన మందు తిన్నఁగావాడుకొనుటచేత నరుఁదెవులు (రాజయక్ష్మ) మొదలగు తెగుళ్ళనోఁగొ ట్టుకొనుటకు యెల్లపుడున్పూనుకొని (ప్రయత్నించి) హాయిగానుండవలయును.

"అతివిశ్వాపరిష్ఠాస్తేనఇవ"

మొదవులెటు తమలేఁగలన్మంది (మనుష్యుల)న్గూడఁబాలిచ్చి పెంచఁగలవో యటులనేయోరెండు కాళ్ళకన్నాకులారా (మనుష్యులారా) మందులు మీ యొడ ళ్లనుల్లములన్గూడఁదెగుల్లగులనివ్వక కాపాడి పెంచఁగలుగును. యెవ్వరు తగిన కూడున్మందులన్గుడువకుందురో వారు వరుసగా (క్రమముగా) చేవ (బలము) మంచితెలివి (విజ్ఞానము) దొఱఁగుచుఁజెడిపోయెదరు. కనుక నెల్లరెల్లపుడు న్దగిన మందులు పుచ్చుకొనుట కలవాటు పడవలయును.

"యదమానా జన్నగామోషధీః"

చదువులలో (శాస్త్రములలో)ఁజెప్పిన చొప్పున మందు పుచ్చుకొనెదరేని యొడలివంతుల (అంగముల) నుండి తెవుళ్ళన్పోఁగొట్టుకొని తెగులుగొంట్లు నిమ్మ ళముగా (నిరోగులై) యుందురు.

యాస్యౌషధీః ప్రసర్పథాంగమంగ"

మందినందఱున్మందు పుచ్చుకొనుటచేత నూపిరిన్దిన్నగా నడుపుకొనుటచేత (ప్రాణాయామముచేత), కాలినడకన్దిరుగుచుంట (వ్యాయామముచేతను) తెవుళ్ళ న్పోఁగొట్టుకొని హాయిగా నుండవలయును.

"సాకం యక్ష్మ"

ఇల్లాం(డిల్లాం(డతోఁగలసిమెలసి పొత్తుగొని యొండొరుల న్గాపాడుకొను తీరున మందులొండొంటన్గూడిక కావింపఁబడి తెవుళ్ళ నన్నింటి న్మాన్పునోమగు వలారా స్త్రీలారా మీలో మీరొండొరువులకు మందుచదువు మప్పుకొనుడు.

"అన్యావో అన్యామవత్వన్యాన్యస్యా"

వేల్పుచేత (ఈశ్వరునిచేత) నెల్లయుసురులు హాయిగా బ్రతుకుట కొఱకు న్దెవుళ్ళన్మాన్పుటకొఱకు న్పండ్లు కాఁచునవి, పండ్లుకాయనియవి, పూచునవి పూ యనివి, యగు మందు(మ్రాఁకులు పుట్టించఁబడినవో మగయాఁడువారలారా (మను ష్యులారా) మీరందఱామందులుసురు తొలుచదువులన్బట్టి (ఆయుర్వేదానుసార ముగా) వాడుకొని యెల్లతెవుళ్ళన్పోఁగొట్టుకొని చెడునడువడికి న్దవ్వుగా (దూర ముగా) నుండి యెల్లపుడు తప్పకపాడి (ధర్మము) సల్పవలయును. చదువరులు (విద్వాంసులు) ఎల్లవారికిన్మంచిమందుల చదువు చెప్పవలయునందువలన నంద ఱికి న్గావలసినయన్నాళ్ళు హాయిగా బ్రతుకుసమకూరును. ఏనాటికిన్గాని యెవ్వ నివలన న్గాని మందులు పాడుసల్పఁగూడదు.

"అవపతంతీర వదల్దివ"

ఎవఁడు తగిన తిండి, మంచినడువడి కలిగి యొంటిపాటున మంతనమగు చోట వేల్పుకొల్పునఁజొక్కియుండునో వాడెఱుకన్నిండారి యెప్పటికిన్ హాయిగా నుండును.

"యుంజతేమనఉత"

ఉల్లము నరికట్టుకొని యెల్లపుడు న్వేల్పు కొల్పుపైమఱచిన వాఁడెన్నటికిన్జెడనియిమ్మున నలరారుచుండును. ఎవరుగాని నింగి నేలలన్బన్నుచున్దాల్పుచు నేలకడిములలరారనంతట నిండుకొని హాయి నిడువేల్పున్గొల్చుచుందురో వారేహాయిగందురొరులుచెడుదురు, మింటనెగురుతెక్కలయెక్కుడుల(విమానముల)న్నేర్పునఁబన్నుకొని కోరినచోట్లకు రాకపోకలు సల్పువారుహాయిన్గాంచెదురు. డిగ్గి(అగ్ని) నీళ్ళన్బట్టి మింటనెగురుపనులు చేయునేర్పుకలిగియుందురో వారు హాయిగాఁదమ కోరినచోటకు వెళ్లగలరు. గొప్పచదువరులనే వెంబడింపవలయున్నాని ములుచలనడువడిన్వెన్కొనఁగూడదు. డిగ్గి (అగ్ని) దొట్టి దినుసులయొజ (గుణము) న్గనిపెట్టి యెల్లపుడెచ్చరికతోఁ దమకోర్కెలనెఱుకగలవారు నెఱవేర్చుకొని యిమ్ముగొనవలయును. మెఱపు (విద్యుత్తు) న్వాడుకొను వెరవుగననివారలు గాని తమ కోరిన గొప్పపనులు తక్కిన ముక్కడులు జేయనేరరు. నింగినేలలన్ మెఱపు నిండుకొనని దినుసేలేదు ఎవఁడు చదువరులకు నెచ్చెలియై, యందగాఁడై మంచి నడువడికలవాఁడై చిఱునగుమూతి నలరుచుండునో యట్టివాఁడే చదువరి మేల్బంతియై చదువులొరుల కున్మప్పఁదగినయయ్యవారు - పంతులు(ఉపాధ్యాయుడు) కాఁజెల్లును, మగవానికి గాని యాఁడుదానికిగాని వెలిచవి (వ్యభిచారము) కన్నునుసుఱు (ఆయువు) న్దఱిగించునది, పేరున్జెఱచునది మఱేపనియున్గాదు కనుక రంకు మానుకొని మంచి నడువడిన్గొని నూఱేండ్లందఱును హాయిగా బ్రిదుకవలయును. ఆలుమగలొండొరుల జగడమంచైన నెడయక కలిసి పగతుఱ న్గెలువవలయును. ఆలుమగలొండొరులన్మక్కువగొని·మంచినడువడి కలిగి తమ యొడళ్ళనుల్లములన్గూడ నెమ్మదికావించుకొని తగినపిల్లల న్గనవలయును. ఆఁడువారు తప్పకసురుతొలుచదువులు (ఆయుర్వేదము) నేర్చుకొనవలయును. మందుచదువున నారితేఱినన్గాని· వారలకుఁ దమతెగుళ్ళన్మాన్పుకొనుటకుఁగాని కూడికహాయి (కామసుఖము) న్బొందుటకుఁగాని తగిననేర్పు (సామర్థ్యము) కలుగఁబోవదు. ఆపడుచులకు (కన్యలకు) వేఱేబడి యాబడికెంతో దవ్వుగా పెండ్లికాని పడచువాండ్రికు వేఱేబడి యుండవలయునాఁడు వారలకాఁడు వారే మఱియు మగవారలకు మగవారలే చదువునేర్పవలయును. ఆలుమగలు తప్పనాడుదొండువానిన్మగవాఁడొండాడుదాని న్గనుంగొనఁగూడదు. ఆఁడుది చెడిపెను (రంకు) దానిన్మగవాఁడురంకుబోతుని (వ్యభిచారిని)ఁజేరరాదు. పగటితేనినే (సూర్యునే) యందఱున్గొల్వవలయును. వేల్పువలె నెవ్వఁడెల్లవారి న్గాపాడఁజాలునో యట్టి దొడ్డవాఁడే ఱేఁడుగా నుండవలయును.

